

తిరుపతి వేంకటేశ్వరులు,

శతావధానులు.

# ఉపోద్ఘాతము

—(o)—

చదువరులారా!

మ॥ కలముం బట్టితిఁ గొన్ని నాళ్ళు కవితాకన్యానుకూలుండనై
హలముం బట్టితి నేఁడు జీవికకునై యాపత్తిధర్మమ్ముగా
విలిఖించెన్ మఱి యిప్పుడెన్ ద్విజులకో పృథ్వీశులో యగ్లాటచే
ఖలమున్ మెట్టితి దానినిల్లు గదలంగా వీలులేదమ్మయో॥

అను పద్యమువలన నేను బ్రస్తుతము ముద్రణమున కనుకూలింపని పల్లెటూరున నివసించుచుండుట లోనగు కారణములు విస్పష్టములగుచున్నవి కదా? దివాకరాస్తమయము వలన మహామహోపాధ్యాయి స్వర్గమునకుఁ డాటయు నెఱిఁగియున్నారు కదా! ఆయా హేతువులం బట్టి మా పాండవ నాటకాములకు మీ రెన్ని జాబులు వ్రాసినను మీ కాయా యాత్రముల నందింపలేకున్న నన్ను మన్నింపుఁడు. తిరుపతిశాస్త్రిగారి జ్యేష్ఠపుత్రుని ముకులకుం బురికొల్పితో మా నాగించుమము పురల గ్రంథముల పునర్ముద్రణమున కుపక్రమించితిని. భగవదనుగ్రహమువలన నచిరకాలముననే మీకుఁ దక్కిన గ్రంథముల నందింపఁగలుగుదును. మఱియు మా గ్రంథ పునర్ముద్రణము మధ్యకాలమునఁ గొండొకయెడమగుటచే మా నాటకముల పేరులనే పెట్టి కొందఱు కొన్ని మఱికొందరు మఱికొన్నియుఁ బ్రకటించి లోకము మెప్పునకుఁ బాత్రులగుచుండుట తెలిసికొని యానందించుటయేకాక వారియెడల మేము మిగులఁ గృతజ్ఞులమై యుంటిమనుకూడ విన్నవించుకొనుచున్నారము. అదియటులుండె, మేమిరువురము గ్రంథసంస్కరణ మొనర్చి ముద్రించు దినములయందుఁగూడఁ బ్రమాదములుగొన్ని నిల్చియుండెడివి. అట్టిస్థితిలో—

"శ్రీహర్షైస్త్రిదివంగతే మయి మనోజ్ఞా నేచ"

అను శ్లోకమున నుదాహరణమైయున్న నా చేమాత్రము సంస్కరింపఁబడని యీ ముద్రణమునందు విశేషించి లోపములు పడియుండవచ్చును. వాని సంస్కరణమును

"మహాత్మ్యవిధిరాభారోఽయమారోపితః"

అను తెఱఁగున విద్వత్ప్రకాండులయందిడి యథామతిఁ బరిశీలింపఁగాఁ గన్పట్టిన లోపములగు ముఖ్యమైనవాని నీక్రిందనుదాహరించు మనంతతో విరమించుచున్నాఁడను.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి,

శతావధాని.

## ముఖ్యముగా దిద్దవలసినవి.

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 11 | సంహార | సంపార |
| 4 | 6 | యర్జునుని | అర్జునుని |
| 6 | 21 | ప్రయత్నంబు | ప్రయత్నంబున |
| 10 | 10 | పలఁతులె | నలఁతులె |
| 17 | 9 | దేవతులు | దేవతలు |
| 18 | 2 | సునాశీరు | సునాసీరు |
| 28 | 19 | పాఱిపోయి | పాఱిపోము |
| ,, | 20 | యుధిష్టిరు | యుధిష్ఠిరు |
| 26 | 16 | యథాశక్తికి | యథాశక్తిని |
| 35 | 24 | ముష్టాముష్టి | ముష్టాముష్టి |
| 36 | 21 | దేవరలు | దేవతలు |
| 38 | 10 | మనమందు | మనుమందు |
| 40 | 17 | నీకడుపుమంట | నీకీకడుపుమంట |
| ,, | 19 | నిర్భేదవచనం | నిర్భేదన[illegible]ణం |
| 43 | 9 | గనిగిరేం | [illegible] |
| 44 | 13 | [illegible] | [illegible] |
| 46 | 8 | గొం[illegible]తెమ్మ | గొంతెమ్మ |
| 51 | 13 | కలుసాత్తుండుచు | కలుషాత్ముండన |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 63 | 7 | జడశి | జడిసి |
| 65 | 12 | శంతనుప్రతి | శంతనుపుత్రు |
| 71 | 11 | వితవివ్వారేం | వితమెవ్వరేని |
| 72 | 8 | గానఁజనుమా | గావఁజనమా |
| 74 | 17 | కౌగలించుకొని | కౌగిలించికొని |
| 75 | 22 | దుర్భర | దుర్భర |
| 77 | 7 | [illegible] | మీాయుది |
| 80 | 21 | సముఖమున | సముఖమ్మున |
| 81 | 9 | సేవతి | సేవతి |
| 82 | 10 | భీష్ముఁగూల్చి | భీష్మునిఁగూల్చి |
| 82 | 19 | యితడను | యీతఁడను |
| 83 | 4 | చేతికి | చేతికి |
| ,, | 18 | కిరీటి | కిరీటి |
| 69 | 20 | పార్షి | పార్ష్ణి |
| 90 | 29 | జాగవర | జాగరవ |
| 110 | 27 | [illegible] | [illegible] |
| 112 | 4 | [illegible] | [illegible] |
| 113 | 18 | మడసిరి | మడిసిరి |
| 115 | 16 | నీతసికి | [illegible] |
| 119 | 14 | భావము | [illegible] |

మరియుసుంగల న, స, ష, వ, శ, స, ఇత్యాదులును, అర్ధబిందు వ్యత్యాసములును, రేఫశకటరేఫవిపర్యాసములును దయచేసి చదువరులే సవరించుకోఁ గోరెదను.

చె. వెం. శా.



# ఉపోద్ఘాతము.

( తృతీయ ముద్రణము )

చదువరులారా!

ఈమూడవకూర్పునం దనేక హేతువులంబట్టి యీనాటకము మిక్కిలి మార్పంబడినది. దీనియందు మొదటి రెండంకములు తగ్గించి నూతనముగా నొక యంకము చేర్పంబడినది. ఆ రెండంకములకును మఱికొన్ని యంకములు చేర్చి పాండవోద్యోగమను పేర నింకొక నాటక మచిరకాలమునను ప్రకటింతుము. ఇంతకుమున్ను పీఠికలో భారతమెల్ల నాల్గునాటకములే యని వ్రాసినను ఈకారణమున నైదు నాటకములు కావలసివచ్చినది. ఇప్పటికూర్పుచొప్పునఁ బ్రదర్శకులకు మునుపటివలెఁగాక సుకరమగునని యెంచితిమి గాని తిరిగియు మధ్యమధ్యఁ గొన్ని విశేషములు చేర్చుటచే వెనుకటియంత పెద్దనాటకముగా నిదియు నించుమించు కాకతీరినదికాదు. అగుఁగాక. ప్రదర్శకులు జాగరూకులగుదురేని బిగించి త్రిప్పింపవచ్చును.........................

పూర్వము విజయము యుద్ధప్రధానమేగాక సంధివిషయమునకుఁ దావిచ్చియుండెడిది. ఇప్పటికూర్పులోఁ గేవలయుద్ధముగా త్రిమే యుంచఁబడినది. ఈ విషయమునందేమి యితరభారతనాటకములయందేమి మేము పలుకారణములంబట్టి కొన్నియెడల సంస్కృతభారతమును గొన్నియెడలఁ దెలుఁగుభారతమును ననుసరించి మఱికొన్నియెడల నాటకసంప్రదాయమునుబట్టి యీరెంటికిని భిన్నమగునట్లు రచించియుంటిమి. ద్రోణవధవిషయమున నీతుది సంగతి స్పష్టముకాఁగలదు. తెలుఁగుభారతము సంస్కృతమునుండి వచ్చినదేయైనను ననేకస్థలముల దానితో భిన్నముగ నున్నయది స్థాలీపులాకన్యాయముగాఁ గొన్ని హెచ్చుతగ్గులు చూపఁబడుచున్నవి. ద్రౌపదీస్వయంవరప్రస్తావనలోఁ గర్ణుఁడు మత్స్యయంత్రమును గొట్టుటకు సిద్ధమైయుండ ద్రౌపది

"నాహం వరయామి సూతం"

అని యనాదరించినట్లును పదపడి యాతఁడు విముఖుఁడైనట్లును సంస్కృతమునం దుండఁ దెల్గులో నాతఁడు చాపము నెక్కుపెట్టుటకై తిలమాత్రము కడమ యున్నట్లు మార్పంబడియున్నది. మఱియు నభిమన్యువధఘట్టమున దుశ్శాసనసుతునిచే నభిమన్యుఁడు మ

డించినట్లును పదపడి మఱియొకశిశువు దౌశ్శాసని ద్రౌపదేయునిచేఁ జంపఁబడినట్లును సం
స్కృతమునందుఁ దెల్గులో నీరువురును నేకకాలమందే హతులైనట్లు లున్నది. మఱి
యుఁ దెల్గులో భీముఁడు కర్ణుని నాలుకఁ గోయఁబోఁగా శల్యుఁడు వారించినట్లున్నది.
సంస్కృతములోఁ గర్ణుఁడు మూర్ఛపడినట్లుమాత్రమే యున్నది. ఇట్టివనేకములుగలవు.
గ్రంథవిస్తరభీతిచే నీవిషయమును విరమించెదము. ఇంకనీ భారతయుద్ధ మెప్పుడు జరిగిన
దని? శల్యపర్వములోని

“ ప్రాప్తం కలియుగం విద్ధి ”

యను శ్రీకృష్ణవాక్యము ననుసరించి కలియుగమునకు ముం దైనదని తెలియుచు
న్నదిగాన నిప్పటికించుమించుగ నైదువేల వత్సరము లనుకొందము. ఇంకేమైన మత
భేదమున్న నుండనిందు గాని యుద్ధప్రారంభ తిథిమాత్రము.

(కార్తికామావాస్యకాదు, కార్తికశుద్ధదశమి.)

అమావాస్యావాదులకు 14 నాఁటి రాత్రియుద్ధమున దీపములు వెలిగించుటయు
సగమురాత్రి గడచినపిదపఁ జంద్రుఁడుదయించుటయుఁ బూర్తిగా బాధకములు.
ద్రోణపర్వము 163-185 అధ్యాయములు చూడుఁడు. అంతేకాక కక్కరలేదు ఈవిష
యము తెల్గులోఁ జూచిన ద్రోణపర్వమున 5 వ ఆశ్వాసములోఁ దెలును. దశమీపక్షము
న నీబాధలేదు శుద్ధదశమికి 14వ దినము బహుళాష్టమిగాన నాఁడు 16 గడియలకుఁ జం
ద్రుఁడుదయించుట సంఘటించుచున్నది. ఇట్లేని

“ అష్టపంచాశతం (58) రాత్ర్యశ్శయానస్యాద్య మే గతాః ”

అనుశాసనికములోని వాక్యము కుదురుట దుర్ఘటమందురేని ఈ 58 రాత్రులు శర
తల్పశయనానంతరము 25 వ దినమునఁ గృష్ణుడు

“పంచాశతం షట్చ (56) కురుప్రవీర శేషం దినానాం తవ జీవితస్య”

యన్న నాఁటినుండి లెక్కపెట్టినఁ దదిరాత్రితో సరిపోఁగలదు. ఇక్కడ వ్యా
ఖ్యాత క్లిష్టార్థమును జెప్పి ఇఁక నీకు 30 దినము లాయువుకలదని తెల్పెనుగాని యది
తిక్కన్నగారి తెల్గునకు విరుద్ధమగుటయేగాక

“ ఉషిత్వా శర్వరీః శ్రీమాన్ పంచాశన్నగరోత్తమే ”

యని యానుశాసనికమునఁ జెప్పిన దానికిఁగూడ విరుద్ధము ఈ పంచాశత్పదమునకు వెను

కటిదానిఁబట్టెఁ క్లిష్టార్థము చెప్పి 30 రాత్రులని సాధించుట యశక్యము 30 దినములలో భీష్ముడు స్వర్గస్థుడైనచో 50 దినములపైని ధర్మజుఁడు వెళ్ళనెంచెనేని యతఁడు చనిపోయిన 20 దినములకా! ధర్మరాజు భీష్మునిజూడఁగోరినది? కాదుకదా! తిక్కన్న

పంచాశతంషట్చ

అను శాంతిపర్వస్థశ్లోకమునకు

" ఏబదియాఱుదినములకు" అనియును ఉషిత్వా..." పంచాశత్ "

అన్నచో

" పంచాశద్వాసరానంతరంబ "

యనియును దెనిఁగించె. దీనింబట్టి శాంతిపర్వమున

" పంచాశతం షట్చ "

అనుపదమునకు 30 దినములను నర్థము చెప్పి అంతకుఁ బూర్వము శరతల్పశయనము మొదలు 28 రాత్రులనియును ఈ 30 యు ఆ 28 యుఁగలిపి 58 చేసి

" అష్టపంచాశతం "

అను శ్లోకమును సరిపెట్టి కార్తికామావాస్య మొదలు మాఘశుద్ధాష్టమివఱకు 68 దినములనియు నందు భీష్మునియుద్ధదినములు 10యును గ్రోసివేయఁగా 58 రాత్రులాయన యంపశయ్యయం దుండెననియుఁ జెప్పుపక్షము పూర్తిగా దుర్బలమని తేలినది. ఈచూపిన వేళాకోళాపక్షమున నింకొక నాల్గుదినములు ధర్మజుని కాశౌచవిషయమున వృథాగాఁ గల్పించుకొనుట యొకయనుచితము. అదికల్పించుచో భీష్మునిమృతి మాఘశు 5 నాఁడు కావలయునే కాక

" అష్టపంచాశతం చతుష్పంచాశతం "

కావలసివచ్చును. లోకప్రసిద్ధమైన భీష్మైకాదశీద్వాదశులు నేతిబీరకాయలగుచున్నవి అమావాస్యాపక్షవాదులు భీష్ముఁడు శరతల్పమందున్నది 58 రాత్రులనిగదా చెప్పుచున్నారు. వారికిఁగలవిప్రతిపత్తులు సంగ్రహముగాఁ జూపితిమి. కాననిఁక శుద్ధదశమీపక్షవాదులసిద్ధాంతమును జూపుచున్నాము. వీరిమతమున భీష్ముఁడు శరతల్పమందున్నది 82 దినములు మాఘశుద్ధద్వాదశి నితఁడు స్వర్గతిచెందెను. కార్తికశుద్ధదశమికి మాఘశుద్ధద్వాదశి 92 వ దినమగును. కాన భీష్మయుద్ధదినములు 10 యును 82 లో జేర్చుకొన్న 92 దినములు తేలును

“ అష్టపంచాశతం

అనునది తిరిగియు శాంతిపర్వమున 25 వ దినమునఁ గృష్ణుఁడు

“ పంచాశతంషట్చ ”

అని చెప్పినది మొదలుకొని లెక్కించుకొనవలెనని వ్రాసియే యున్నారము. 25వ దినమున శ్రీకృష్ణుఁ డీమాటచెప్పె ననునిర్ధారణ మెట్లనఁగా! భీష్ముఁడు శరశయ్య నలంకరించినది మొదలుకొని 8దినములు యుద్ధశేషము గదా! 9నినాఁడు దుర్యోధనమృతి. నాఁడు మొదలు 12 దినములు ధర్మజున కాశౌచము శ్రాద్ధదాన, పురప్రవేశ, పట్టాభిషేక ప్రకృతిశాంత్యనామంకు 4 దినములు వెరసి 24 దినములు. 25వ దినమున భీష్మునికడ కరిగినట్లువిస్పష్టము. అమావాస్యపక్షవాదుల కనుకూలముగ వ్యాఖ్యాత ఈ లెక్కలో యుయుత్సుఁడు వైశ్యాపత్యము కనుక నతనికి 16 దినముల పఱకాశౌచమగుటచే నతఁడును పాండవులును శ్రాద్ధము కలిసిచేసి నట్లభిప్రాయపడి వృథాగా నతనికై 4 దినములు ధర్మజాదులు శ్రాద్ధమొనరించుకొనక మిన్నకున్నట్లు వ్రాసినాఁడు. అట్లాగుట లోక విరుద్ధమును శాస్త్రవిరుద్ధమునుగూడనై యున్నది కావున నీనాల్గుదినములును మేముకట్టుకొనలేదు.

“ క్షత్రియోద్వాదశాహేన వైశ్యః పంచదశాహకైః ”

అని పరాశరస్మృతి, తేలినసారాంశమిది. భీష్మశరతల్పశయనము మొదలుకొని 25 వ దినమున ధర్మజుఁడు శ్రీకృష్ణాదులతో భీష్మునియొద్దకు వెళ్ళెను. కృష్ణుఁడు నీకిఁక 56 దినములు జీవితశేషమని చెప్పెను. కావున నిర్యాణదినమున భీష్ముఁడు 58 రాత్రులు లెక్క చెప్పెను. ఇయ్యెడ (గతాః) అనుపదమునకు “వెళ్ళవచ్చెను” అనునర్థమేని చెప్పికొనవలెను కదా

“ ఈషద్వైషమ్యమవివక్షిత ”

మని యేని యనఁదగు. ఈమాత్రము సహించితిమేని దశమీపక్షమున నేచిక్కును లేదు. అమావాస్యవారికో ?

“ పంచాశతంషట్చ ”

అను దాని భారతసారవేదియగు తిక్కన్న సోమయాజి 56 అని తెల్గించియుండఁగా 30 దినములని క్లిష్టవ్యాఖ్యానము చేసుకొనవలెను. అందుకు సమ్మతించినను “ధర్మజుఁడు 50 రాత్రులు పట్టణమున నుండిన పిదప నీవిషయమును స్మరించెనని యనుశాసనికములో

నుండుటచే నతఁడు ప్రమత్తుఁడు కావలసివచ్చును. దానిపై భీష్మనిర్యాణఘట్టమిల్లఁ బొల్లగును. తక్కిన గల విరోధము లట్లుండ నమావాస్య వారికి లెక్కలోఁగూడ పైని జెప్పిన వైషమ్యము లేకపోలేదు. అందుకే వ్యాఖ్యాత 16 వ దినమున వైశ్యలశుద్ధి చెప్పుటకు బదులు 17వ దినమునఁ జెప్పినాఁడు. ఇట్లు చెప్పనిచో 18వ నాఁడే ధర్మజుండు భీష్మునియొద్దకి వెళ్ళినట్లగును అట్లైన గుదక

“ అష్టపంచాశతం, సప్తపంచాశతం, ”

కావలసివచ్చును. ఇంకను విస్తరించిన నొకగ్రంథము వ్రాయవలసివచ్చునని సూత్రప్రాయముగా వ్రాసితిమి. మేమీదశమీపక్షమును గనఁగొనుటకు బీజము మున్నాహరించిన ద్రోణపర్వస్థమగు నధ్యాయద్వితయమును, కాన వలయువారది చూతురుగాక. అమావాస్యనాఁటికి 18వ నాఁ డశ్వత్థామ చీఁకటిలోఁబోయి శిబిరము చొచ్చెనను భారతముగూడ విరుద్ధమే యగును. ఆనాఁడు బహుళద్వితీయకదా కావలెను 4 గడియలరాత్రికే చంద్రోదయమగును తెల్లవారువనుక వెన్నెలపుచ్చ పువ్వువలె నుండును. దశమీపక్షము వారికి బాధలేదు. వీరికి నాఁడు బహుళద్వాదశిగాన 24 గడియలకుఁ గాని చంద్రోదయముకాదు. అప్పటికి నశ్వత్థామకృత్యమంతయు నెఱవేఱవచ్చును. కావున నిందెచ్చటనేని ఈషద్వైషమ్యమున్నను వారివలె మాసములును బక్షములును సామ్యతగ్గండనందునఁ జదువరులు శుద్ధదశమినే భారతయుద్ధప్రారంభదినముగా నెఱుంగుదురుగాక మాఘశుద్ధద్వాదశి భీష్మనిర్యాణము. కావుననే అష్టమిమొదలు నాఁటివరకును నీవ్రిత మాచరించుట యాచారముగా నున్నదియని గ్రహింతురుగాక. మేమశ్వమేధములో వ్రాసిన యేకాదశినిగూడ నీషద్వైషమ్యమని సమన్వయించుకొందురుగాక.......

తిరుపతివేంకటేశ్వరులు.



# నాల్గవముద్రణము

పాఠకమహాశయులారా !

ఈపాండవవిజయ మిప్పుడు నాల్గవసారి ముద్రిత మైనది. మూడవసారి ముద్రిత మైనప్పుడు వ్రాసిన పీఠిక యిందుఁ జేరియే యున్నది గాన వలయు విశేషము లద్దానికతన తెలియఁగలరు...................... మే మెంత శ్రద్ధగాఁ జూడవలయునను కొన్నను గ్రంథము స్వకర్తృకమగుటచేఁ బద్యాద్యక్షరము చూచినంత నేతక్కినది చూడకయే మాకు నడచుచుండును. అట్టిపట్టున మధ్య నేయే యక్కరములున్నవో, యేవిలేవో, యచ్చుపట్టిన తప్పు నొరలినదో యవగతమగుట కడుఁగష్టసాధ్యముగా నుండును. ఈయంశము స్వానుభవజ్ఞులకుఁ దెల్పవక్కఱయే లేదు. అనుభవమున్నను జ్ఞానలవదుర్విదగ్ధు లట్టిపట్టుల నే మేమో వదరుచుందురు. ఎంద జ్ఞానలవదుర్విదగ్ధుఁడైనను నీమాత్రము తెల్వియు లేకయుండఁడని మాయభిప్రాయము. అదియటులుండె, తాదృశుల వృథాలాపములనుగని ప్రాజ్ఞులగువారు భవకరవములుగాఁ గూడఁ బరిగణింపకుండుట మేమనుభవపూర్వకముగా నెఱిఁగియు నెవరో తాదృశులు కొందఱు "మేల్బళా" యని తలయూపువారుగూడ నుండవచ్చునని తలఁచి యీక్రింద నద్వారల వాకట్టునకుఁగా ప్రూఫ్ దిద్దుటలో పొరపాటుపడినచోట్ల నిజ్జాతము చూపుచున్నారము............

తిరుపతి వేంకటేశ్వరులు

# ఇందు వచ్చు పాత్రలు.

### 1 వ అంకము

1- సూత్రధారుఁడు
2- నటి
3- భీష్ముఁడు
4- కృష్ణుఁడు
5- అర్జునుఁడు
6. సాత్యకి

### 2 వ అంకము

1- భాగీరథి
2- యమున
3- సరస్వతి
4- కృశానుఁడు
5- విశ్వావసుఁడు

### 3 వ అంకము

1- పంచపాండవులు
2- అభిమన్యుఁడు
3- కరండకుఁడు
4- బకోటకుఁడు
5- సుమిత్రుఁడు
6. ద్రౌపది
7- యుయుత్సుఁడు
8- కృష్ణుఁడు

### 4 వ అంకము

1- కృష్ణుఁడు
2- అర్జునుఁడు
3- ధర్మరాజు
4- బకోటకుఁడు

### 5 వ అంకము

1- ధర్మరాజు
2- సేవకుఁడు
3- కృష్ణుఁడు
4- భీముఁడు
5- అర్జునుఁడు
6- హిడింబ
7- సాత్యకి
8. ధృష్టద్యుమ్నుఁడు

### 6 వ అంకము

1- శల్యుఁడు
2- కర్ణుఁడు
3- కృష్ణుఁడు
4- అర్జునుఁడు
5- ధర్మరాజు
6- అశ్వత్థామ

### 7 వ అంకము

1- దుర్యోధనుఁడు
2- సంజయుఁడు
3- కంకాళకుఁడు
4- కృపాచార్యులు
5- అశ్వత్థామ
6- కృతవర్మ
7- పంచపాండవులు
8- కృష్ణుఁడు
9- కిరాతుఁడు
10- బలరాముఁడు

### 8 వ అంకము

1- దుర్యోధనుఁడు
2- పాండవపంచకము
3- కృష్ణుఁడు
4- బలరాముఁడు
5- సంజయుఁడు
6- కృపాచార్యులు
7- అశ్వత్థామ
8- కృతవర్మ



శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవ విజయము.

తిరుపతి వేంకటేశ్వరులు

(నాటకము.)

ప్రథమాంకము

(నాంది)

చ. కరము మనోహరంబు లతికర్గ్రము లాశ్రితవత్సలంబులుం
బరపురభేదకంబులు సుమాంచితశాంగనివాసభూములు
సురకృపభావుకంబులు విస్రుతపితామహ మస్తకంబులౌ
హరిహర పాదపద్మములు హైదిటికి న్విజయంబు గావుతన్.

సూత్రధారుఁడు—(నాంద్యంతమునఁ బ్రవేశించి) ఆర్యురాలా! నీయొద్దకి సింగారము ముగించుకొని త్వరగా రమ్ము.

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్ర! ఇదిగో వచ్చితిని. ఏమి సెలవు?

సూత్ర—ఏమి యింత తడసితివి? రసాస్వాదనత్వరాయమాణమానసులగు సభాసదులింతటి కాలహరణమున కోర్తురా?

నటి—ఈనాఁడు తలనువ్వుకొనుటకుఁ గొంచె మాలస్యమయినది కావున క్షమింపవలయును.

సూత్ర—సహజశ్రీగల యువతుల సంతతికి శృంగారము గూడ నేల?

నటి—సహజశ్రీగలవారికయినను సంస్కారమువలన మిగుల శోభవచ్చును గదా?

సూత్ర—(ఆలోచించి) ఔను. ఐనను స్త్రీలకు సహజసౌందర్యమే సౌందర్యము. అందును సత్ప్రతిమాలంకరణములలోఁ గురులసంతతియే ప్రథమగణ్యంబు.

గీ. కృష్ణవిమతంబు ద్రోణగాంగేయభూమి, తటము ద్విష్టశిఖండిమద్రబహుళంబు
కర్ణమకరోద్ధతంబై కల్మిఁగాంచెఁగాని, కాలగతిఁ గురుగుఁ బాండవాక్రాంతమగుచు

నటి—కాలక్రమమున నాఁటఁ దలంచిన నీకురుల సంతతియే కాదు—

గీ. అంచితాంగాతిశయ మెల్ల నడఁగిపోవుఁ, బౌరకు బలంబు శల్యాతిశిష్టమగును
గడకు భీమగదాహతిఁ గాల్గడప, లేక చెడురాజరాజైన వీఁక గౌడలి

సూత్ర—ఈయప్రస్తుతప్రశంసవలనఁ బ్రకృతమే మఱచితిని.

నటి—'ఏమిటాల' అని మొదటనే ప్రార్థించితిని గదా!

సూత్ర—ఇదిగో నీపత్రికఁ జదివికొనుము. (చేతికిచ్చును)

నటి—(తనలోఁ జదివికొని ప్రకాశముగా)

గీ. పాండుసంతానకీర్తిదర్పణము ధార్త, రాష్ట్రశతతతదుర్యశోర్పణము సార
సాపణముఁ జాడవలయు సంసారభార, తరణమగునట్టి యాభారతరణమిపుడు

అని యున్నది. కావునఁ దత్కథాభూయిష్ఠమగు నాటకమును బ్రదర్శింప వలయు. కాని యట్టినాటక మేదియో స్మృతికి రాకున్నది.

సూత్ర—స్మృతికి రాకేమి? నేనిదివరకే నిశ్చయించుకొనియున్నాను.

నటి—దాని పేరేమి సెలవిండు?

సూత్ర—సీ. గోదావరీపావనోదారతీరవ్యయీరాజితావనీదారుఁ డనుచు
సంస్కృతాంధ్రకవిత్వ సారస్యమకరందభసలాయితామిత్రప్రతిభుఁడనుచు
హూణభాషోదన్వదుల్లంఘనక్రమ ప్రాప్త బీ. ఏ. పట్టభద్రుఁడనుచుఁ
గరుణాతరంగరంగత్కటాక్షచ్ఛటా పాలితాఖిల పరివారుఁడనుచుఁ
గొనని నుతియింతు రట్టిపోలవరనగర, పాలకుండును బ్రాహ్మణ ప్రభువునైన
కృష్ణభూపాలవరుని ప్రేరేపణమున, సకలగీర్వాణ రూపకూపకము లరసి.

చ. నవరసపూరపూరితము నాటకమీయది యంచు నెంచి పాం
డవవిజయంబుఁ దెల్గున నొనర్చిరి వీరరసప్రధానమున్

నటి—కృతికర్తల పేరు చెప్పరైతిరి!

సూత్ర—చెప్పుచుండఁగనే నీకింత తొందరయేల?
కవలవలెం జరించుచుఁ బ్రశస్తి వహించు శతావధానులే
కవులిఁక వారిపేరులు జగద్విదితంబులు చెప్పనేటికిన్

నటి—తిరుపతి వేంకటేశ్వరులా?

సూత్రి—ఏమీ నీ తెలివి తేటలు? చెప్పకయే తెలిసికొంటివి

నటి—(నవ్వుచు) నీమాటలు వినిన 'నేమీ నీ తెలివి తేట' లని కాకుస్వరముగా నే మరలనవలెనని యున్నది. 'వారి పేరులు జగద్విదితంబులు చెప్పనేటికిక' అనుమాటల్లు తెలిసికొంటివని యడిగితి వేమి?

సూత్రి—ఆపాండవవిజయ మీ సభాసదుల యానతికిందగినది. కావున దానం బ్రదర్శింతము. ఈనీ నగురి వాక్యములకేమిలే. సంగీతము పాడి చాతుర్యముం గనంబఱచుకొనవలయును.

నటి—ఏ ఋతువునాశ్రయించి పాడవలయును?

సూత్ర—మనము ప్రదర్శింపఁబోవు నాటకమున కనుగుణమగు శిశిరఋతువునే వర్ణింపుము.

నటి—గీ. ధార్తరాష్ట్రసమూహంబు దక్షిణాశ, కభిముఖంబుగఁజను సమయంబుచూచి
ప్రబల పాండవహంసలు పట్టువదలి, యచ్ఛమానసవైకల్యమనుభవింప.

(తెరలో)

భరతపుత్రా! ఏల యిట్టి యసందర్భాలాపము లుపన్యసింపఁ జేయుచుంటివి.
ఈ నేఁటికి రెండునాళ్ళ క్రిందట నేను ధనస్సు ధరించి శాత్రవో
ద్ఘాటన మానరించుటకుఁగా నని వేయఁగడంగి; నేను నా
నాఁటికిఁ బాండవేయులది నాశనమందుచో కాను కాన నే
పాటునాలోటుఁ గౌరవులపక్షమునను; దిటువెల్కుఁ జేలాకి.

సూత్ర—(వినుటనటించి) చెలీ! నీ ఋతువర్ణనమునందలి ధార్తరాష్ట్ర పదంబునకు హంసవిశేషము లను నర్థముకన్న ఝుడితిమ్యాతిగ నందుచున్నకతన ధృతరాష్ట్ర పుత్రులను నర్థంబును గైకొనుటచేఁ గాఁబోలు భీష్ముఁడు మనపైఁ గనలుచు నిటువచ్చుచున్నాఁడు. ఇకమనమీతని యగ్రమున నిల్చుట తగదు. పోదము రమ్ము. (నిష్క్రమింతురు)

(ఇది ప్రస్తావన)

(భీష్ముఁడు ధనుష్పాణియై పటాక్షేపమునఁ బ్రవేశించి దృష్టినించి తనలో)

ఓహో యిదియా హేతువు!

చ. అనలము గ్రుమ్మరించెడి మదస్త్రపరంపరచేతఁ జాల నొ
చ్చినకతనన్ యదూద్వహుఁడు చేత సుదర్శనమున్ ధరించి తా
ను నను బొనరించు సాహసమయమున్ దిగఁద్రావి ననున్ వధింపఁగా
నరిగెఁ గడంగి (కొంచెమూరకుండి) యుద్ధమని మానసముల్లడె నెల్లనయ్యెడిన్

(ఆశ్చర్యముతో)

మ. తనకేలన్ గల పగ్గముల్ కశయు ధ్వంసంబౌ గతిన్ [illegible] హా
మ్మని చక్రంబును గేలఁ గైకొని యధర్మారంభుఁడయ్యెన్ సధ
ర్మునిఁ బార్థున్ గెలిపింపఁ బూంచి యచలంబుం బోని కౌంతేయు స్యం
దనమందుండి మృగేంద్రుభంగి ధరకున్ దైత్యారి లంఘించెడిన్.

(మరలఁ బరికించి)

చ. వెనుకకు లాగు బాహువులు బిగ్గఁగఁ బట్టి ధనంజయుండు ; కో
పనుఁడు సుదర్శనాయుధుఁడు పార్థునితోడనవచ్చుచుండె ముం
దునకు ; మహోత్కగోద్ధతిని దూఁగుచు సంద్రము సాంద్రభంగి ని
స్స్వనితముగాఁగ నేగు తరిసంయుత మారుతి యేపు దోఁపగన్

(యథోక్తముగాఁ గృష్ణార్జునులు ప్రవేశింతురు)

అర్జు—శా. బావా ! కోపము సంహరింపుము రణప్రారంభమున్ మాను సి
వ్వేఁకన్ రణముల్ బొనర్చెదన్ వీఁడేల ? నీ ఘాతకున్
జేవన్ వీడని వీరుఁ డెవ్వఁడు ? కృపాసింధుండవై నాయశ
శ్శ్రీవర్ధిల్లఁగఁ జేయుమయ్య యనఘా ! చేమోడ్పు సంధించెదన్

కృష్ణ—(అనాకర్ణితముగా ముందడుగు వేయుచు)

శా. వృద్ధుండౌ నలజాహ్నవీతనయుఁడనుకొంకెన్ నేఁడు ? పార్థుండు నీ
యుద్ధప్రక్రియ కోసటించె నని లో నుబ్బంగ నింకెంత సే
పాదత్రయమ్ము వహించెదో కనఁ గా కాహోరవవ్యాప్త ది
గ్ధ్వంబై జగ మక్కజంపడఁగఁ జక్రన్ జేతు నిన్నిక్కడన్.

శా. జనకుఁడు స్వేచ్ఛామరణ,మ్మనోసంగె వాఁకటించుచుఁ బొంగదనో ? య
య్యనిమిషు లక్ష్యంబైనను, నినుఁ జంపు సుదర్శనంబు నేడే తుదన్.

వీరవ్యాఘ్రమహాకిరాతు నెదుటన్ వీరేల? నీవేల? నేఁ
బ్రారంభించితిఁగాక యాహవమొనర్పన్ ధర్మరక్షార్థినై

అర్జు—బావా? నీవిక్రమం బక్రమంబగుటం జేసి ధర్మరక్షార్థంబు గానేరదు గాని కేవలమాపదఁబునకు ధర్మరాజరక్షణ మని యర్థము చెప్పుకోవలసివచ్చును.

కృష్ణ—అర్జునా? వృథాగా నన్నిందులకు వాదించెదవు? దుర్జనధర్షణంబున కొకొక్క తఱి నధర్మపరివర్తనంబుగూడ నుపక్రమింప నగునని శాస్త్రప్రాప్తికి వచ్చుచున్నయది. ధర్మమార్గమే యైనను సజ్జనాపకారంబునకుఁ గారణంబగునేని యవలంబింప ననర్హంబు-

చ. తెలిసె భవద్భుజాబలము; తెల్లముగాఁ దెలిసెన్ సమస్త సే
నలయలఘూరతాగరిమ; నన్నిఁక వారణ సేయఁబోకు మీ
కలను, సమస్తమీదినము కాలునిపోలికిఁ జేరుఁగాక భూ
తల మిదియెల్ల సాధు నిక ధర్మతనూభవుఁ గోరుఁ గావుతన్.

(సేనలదిక్కు బిగ్గరగా)

ఓహో! పాండవ చమూపతులార?

ఉ. పాండిఁక నాలుబిడ్డలను బోలఁగఁ గన్నులనిండఁ జూచి కొం
డొండొకఁ జేల తోడు విలయోద్ధతకేళికిఁ జక్రపాళికిన్!
ఖండన మింతతో ముగిసెఁ బాండుసుతాగ్రజుతోడఁ జెప్పఁ డే
గుం డభిషేకవస్తువులు గూర్పుఁడు మార్పుఁడు యుద్ధసద్ధతుల్-

భీష్మ—(తనలో) అర్జునుఁ డెట్టకేలకుఁ బదిపండెన్డు డదుగులలో నీవిశ్వంభర నిలువరించినాఁడు, కాదు కాదు ఇయ్యెడ ముఁడే భక్తపరతంత్రుఁడగు కృష్ణ ఫల్గునానురాగంబుఁ బ్రకటించుటకై యతనిప్రయత్నంబు సాగినట్లు నటించె నను ట ధ్రువము- లేనిచో—

మ. విలయాంభోదములీల మేనొలయ నుర్వీచక్రమెల్లన్ దలా
తలపర్యంతము క్రుంగఁ జక్రరుచు లుద్యద్విద్యుదుల్లాసముల్
దెలుపన్ సింహనినాదముల్ పిడుగులై దీపింపఁ గల్పక్షయం
బొలమిన్ జేయఁగవచ్చు నీతనికి నడ్డే క్రీడియున్ గిడియున్-

(నిరూపించి) ఇంతకు సబూర్ణముగా సంరంభము తగ్గలేదు! ఏమైనను నీకు నాకుఁ గృతార్థత్వ్యమకలుగుట సంశయాస్పదమే (యోజించి) అవును ఇదినిశ్చయము

మ- అలవేదంబులు ధర్మమూలములుగా ? యం దీమహాభాగుఁడే
తెలియంగాఁ బడువాఁడుగా? యతఁడె యుద్యోగించి యిప్పట్టునన్
గలనన్ శూరు లనేకు లున్నయెడ సంకల్పించునే సూనృత
స్ఖలితం బౌపనిఁ జేయ? నట్లయిన లోకంబెల్ల ఘోషిల్లదే

ఒకవేళ దుష్టశిక్షణ శిష్టరక్షణంబులు తనపనులుగాన నెట్లేని యయ్యవి కర్తవ్యం బులనియు దుర్జనాగ్రగణ్యుండగు సుయోధను నవలంబించిన నేనును దుర్జనుం డనే కావున వ్యుత్క్రమంబున నన్నుక్కడంప నెంచెననియును నిప్పట్టున రోషింప నయ్యెడిఁ గాని దీర్ఘదర్శులగు వారిదియును సమంజసమగు ప్రోవ గా భావింపరు. ఇది నిక్కముగా నస్మదీయశౌర్య సంరంభంబునకు నోర్వలేకుం చు పార్థుని బాహుబలంబు పురికొల్పుటకుఁ బన్నిన పన్నుగడయే కాని వే ఱొండు గాదు. ఇట్లే కానిచో—

ఉ- నాఁడు సుయోధనుండు కరుణామయుఁ డన్నను గట్టుపూనిక న్నాఁడని పూర్తిగా జెలఁగి న్యాయపథంబును జెప్ప వచ్చి మో మోడక నీఁడుమిక్కిలిగ నుక్కుమెయిన్ దన కగ్గొనర్ప మా టాడక విశ్వరూపధరుఁ డయ్యెను మిన్నక పోనసేర్చునే ?

ఇయ్యవసరమున కిట్టియూహలేల? నిక్కముగా నున్నచో విశ్వరూప ప్రదర్శనము తోడనే భారతయుద్ధము ముగియవలసినది. (వినుట సూచించి) స్వామి యేమో మేఘగంభీరభీషణంబు లగు భాషణంబుల నర్జునుని యెడలఁ గనలినట్లు సహించుచుఁ గృపఁగనుపరచుచున్నారు.

కృష్ణ.—అర్జునా ! యీ నీమాటలయం దంతిపాటవ మున్నట్లు నాకు నమ్మిక లేదు ముమ్మాటికి నిన్నుఁ బురికొల్పి పురికొల్పి వేసారియే తుదకీ సుదర్శనమ్మును సంస్మ రించితిని నీకును నాకును లేశమేని భేదంబు లేనియపుడు మనలో నన్యోన్య జయంబులనన్యోన్యమును సంక్రమించుటలో నాక్షేపణ మేమున్నది.

శా. గాంగేయున్ బరిమార్తు మొట్టమొదటన్; ఖండింతు నామీఁద దు
స్సంగున్ ద్రోణు ; వధింతు నాపయిని నశ్వత్థామ నా వెన్క న
య్యంగాధీశు గతాసుఁ జేయుదు ; సహోదర్యంబుగా రాజు నా
ర్యం గూల్తున్ వెనువెంట , నిత్తు నవనిన్ వేయేల నీయన్నకున్.

అర్జు—దేవా! నాలోనే నే నీ మొగముఁ గన సిగ్గిలుచున్నప్పుడు సర్వజ్ఞుండవయ్యు నన్ను మఱియు నవమానపఱచు టనునది యుత్తముల త్రోవ కాదు. ఇంతవఱకు నొనర్చి నతప్పులన్నియు మన్నించి మరల నొకరెక్కుడ వేవి.

ఉ. ఏమగునో ధనుర్ధరుల నెల్లను మించగఁడి భీష్మపితామ్హ ! యిం
కేమగునో రణాంగణకి నెల్ల గురుండు ఘటోద్భవుండు ! తా
నేమగునో కృపుండు ! మఱి యేలిక యేమగునో ? కనంగొనం
గా పద నీవకౌతుకముఁ గాంచెను మేల్ ! బళి ! యంచు మెచ్చుచున్.

(పాదములం బడి లేవకుండును)

కృష్ణ—(తనలో) ఎట్లును భీష్మునిచేతిలోఁ జావనున్న యితఁడు కర్జునుం డెట్టి పిరుఁడై నను నతనిఁ దలకడవఁ జాలఁడు. ఇందుపాయ మేమి? (యోజించి) ఉపాయ మొకటి యగు నజాతశత్రుండు సంగరారంభ సమయమ్మున నయ్యనఘుఁ దర్శించి "తాతా! మాకుజయంబు ప్రసాదింపు" మన నమ్మహామహుఁడు ధర్మపక్షపాతంబునఁ జేసి "నీవు మరల నేతెంతువు గాక. నీకు శుభంబు కాఁగల" దని పచియించి యున్నవాఁడు. ఇతఁ డిట్టినితరసాధ్య విక్రమక్రముండై కొన్నాళ్ళు పోరినపిమ్మటఁ దిరిగియు ధర్మజుఁడతని కడకరిగి—

మ. కలన న్నెదిరింప నేర్చునె మహాకాలుండు గాని లయా
నలుఁడుం గాని యఖండపండితుఁడు పూర్ణాశక్తియాధుర్యుఁడు
జ్వలతేజుం డలశూలి గాని; కరుణింపన్ గాల మేతెంచె మ
న్నల మార్తిం బడి ప్రిందుచుంటిమి దయన్ మన్నింపవే దీనులన్.

ఉ. నిద్దుర రాదు నేసలకు నీదగు పేరును విన్న ; నెట్టులో
నిద్దుర పట్టినన్ గలను నీకల సూపాకు వచ్చి వెంట నే
దద్దురు పాటు చేకుఱు, వృథాయిఁక మాశ్రమమెల్ల ; మాకు నీ
యుద్ధపు నెట్టువా పెదవో ? యేగతి నేలను నేలఁ జేతువో

క. నీవింతిపరాక్రమమున్, గావింతు పటంచు మన్ను గన్గొనసైతిన్
దేవ ! యిది తొలుకపశినన్, గావఁ దుని యావాపడఁబుఁ గావఁగదయ్యా!

అని మఱియు మఱియుఁ దన్నుఁ బ్రార్థింప డెందంబు కరఁగి స్వార్థత్యాగియగు దేవవ్రతుండు పుట్టతుద కా మనుమని వినయమ్మునకు మెచ్చి తన్ను నిగ్ర

హించు నుపాయంబు వక్కాణించు, పిదప నితండతని సంగరంబునుండి
తప్పింపఁగలఁడు కావున నిప్పుడే నొనర్చిన యకాండతాండవంబల్లఁ బాండవ
సేనాపతులకు కార్యోద్రేకదోహదంబుగా పరిణమించుఁగాని యిఁక యథాపూ
ర్వకంబుగ సరవంబు నడిపించుటయు కర్తవ్యంబు అంత నలసి నేని యిఁకనొక
పరి యిట్లే యీసేనలం బురికొల్పుటకును సర్జునకు కార్యంబెక్కించుటకును
బ్రియత్నింపఁగలను.

(అర్జునిని లేవనెత్తి, ప్రకాశము)

చ. పలికినయంతవట్టు సలుపంగలవాఁడవె నిన్ను మెచ్చితో
వలసిన నుండఁగావలయు వస్త్రియులాక్కు సహాసరి; మింముఁగో
వలతులె కొంద; అందఱును నట్టిరె; రమ్మరదమ్ము నెక్కి; నే
నల కొసకొల్ప సాత్యకి చనంగలవాఁ; డిదె పోవుఁ జక్రియున్.

(చక్రమును విసర్జించును. సాత్యకినిష్క్రమించును కృష్ణార్జునులురథమధిరోహింతు
రు. రణోచితంబులగు ధ్వనులు మ్రోఁగును )

భీష్ము—(తనలో) ఇంతకుమున్ను—

శా. "వచ్చెన్ భీష్ముఁడు వచ్చెఁ జచ్చె" ననుచున్ జాపంబు లంపమ్ములన్
గచ్చున్ విచ్చునుగాఁ దగిల్చికొని చీకాకైన సైన్యంబు వి
వ్వచ్చుం గూడి మురారి తేరి కరుగన్ వైవర్ణ్యమున్ బాసి వీ
రోచ్చైర్నాదము రోదసీకుహరమం దుచ్చండమై పర్వెడున్.

(పట్టరాని సంతోషముతో)

శా. "లీలామానుషవిగ్రహుండు రణకేళీలాలసుం డైనఁ గా
కాలంబం దెదిరింప లేరొరులు భీష్మాచార్య" నంచున్ భుజా
శాలుల్ మెచ్చఁగఁ జేసె శౌరి; యిఁక నాజన్మంబు ధన్యంబు

(వైమనస్యముతో)

దుశ్శీలుం డీకురువంశపాంసనుఁ డనిన్ జేయించుటెంకందుకో."

చ. కొలఁదికి మీఱి నమ్రుని కోల కరంబునఁ గ్రీల లీల న
య్యలఘుఁడు నన్నుకా దెవని నైనను జంపఁగ నేగుదెంచు న
వ్వలన మహానుభావుఁడటు పాండవ పక్షముఁబూని యుండ నీ
కల నెటు నెగ్గ నేర్చుఁ; దనుఁగా చెడి వాఁడెవ డంతపట్టుగన్?

ఔరా ! యీసుయోధనుని యవివేకము !

మ. భగవంతుం డితఁడంచు స్పష్టపడియెన్ బాహాబలప్రౌఢిచే
నగధారిత్వముచే విశిష్టమునిమాన్యత్వమ్ముచే విశ్వరూ
పగతిన్ జూపుటచే ననేకగతులన్; బ్రహ్మాదులర్చింతు లో
కగురున్ గృష్ణు జయిష్ణు నిప్పుడయినన్ గైకోఁడు వీఁడంధుఁడై
(యోజించి) అయినను నాకిప్పుడీవిషయము ప్రస్తుతముగాదు (సింహనాదంబు
చేసి ధనుర్గుణంబు మ్రోయించును) ఓ సేనానాయకులారా!

ఉ. విచ్చిన మొగ్గరంబులను వేఁకమెయిన్ బురికొల్పి నిల్పి కొ
డెచ్చుట నేరికిన్ దలఁకి యేస్త్రీల వీడకుఁ డేను గల్గ వి
వ్వచ్చుఁ డుఱాఁడు నీపయికి; వచ్చిన వచ్చెడుఁ గాక నీరు వె
న్నిచ్చి తిరన్న మర్యశి కెంకింతియు నా చెవి సోఁకకుండుతన్.

(రణాభిముఖ్యమ్ము నటించును.)

కృష్ణ—(చేతితోఁ జూపుచు) ఫల్గునా? కనుగొంటివా! మన సేనలకు భీష్ముఁడనిన
నెంతభీతి గల్గుచున్నదో?

శా. టంకారం బొనరించె సింహరవ ముట్టంకించె నావృద్ధుఁ, డా
తంకాసంకులమయ్యె సైన్యములు ధార్ష్ట్యంబెల్లఁ జీకాకుగా
నింకన్ బాణ మొకండు గాని విడువండే యూతఁ డౌరౌర! యీ
జంకున్ గొంకును మాన్పఁగా వలయు నీశౌర్యం బవార్యక్రియన్.

చ. తలయును గడ్డమున్నరసెఁ దాతయు పంజనఁ దెల్లలోకము
త్రిలపడునట్లుగా రణముఁ దప్పయు నిమ్మహితుం డొనర్చు నా
మెలఁకువ నాభుజావిభవమేదురతాతిశయంబు నామహో
జ్జ్వలరథచాలనంబులును సాఁగసిరీతిఁ బరాక్రమింపుమీ?

అర్జు—బావా?

చ. అతఁడు మహామహుం డనుట యందఱికిన్ విశదంబ యూతఁడ
ప్రతిముఁ డనంగ నేల! కురువంశభవుండని యేనుఁ గూడ స
మ్మతిఁ గనుఁగొమ్ము తాతయును మన్నెఁడుఁ బోరెడుతీరు, మాటలన్
జతురత చూపనేల! క్రియ సాక్ష్యమొసంగెడుఁ గాక నీకికన్.

రథంబు భీష్మాభిముఖంబుగఁ దోలునుపుగాక

కృష్ణ—(రథము తోలుట నటించును)

అర్జు—బావా?

శా. రణమున్ జేసెడిపట్ల నొక్కొకయెడన్ రాఁగూడదే వేలుకా
రణమై కొండొక హేతుసృత్సగ్గ! లటి పోరఁగా లేమి యే! శత్రుభూ
రణకర్మంబు లెఱుంగనే యనఘ? చక్రంబంటిలోఁ దాల్తువే!
యణుమాత్రంబు సహింపఁగా వలదె? దేవా యింతకారుణ్యమే?

కృష్ణ—(తనలో) ఇతని నింక మెల్లన సమాధానపఱుపవలయును (ప్రకాశము) అర్జునా! నేను చక్రంబు గైకొనుటకుఁ గారణము నీవెఱింగియును నాక్షేపించిన నేనేమి యుత్తరం బీనేర్తును.

శా. గంగానందను బాణపాతముల కాఁగన్ లేక చక్రంబు చే
లం గైకొంటి; సమానులే యిరువురున్; లావున్ బలంబున్ సమం
బంగీకారమె; తాతయున్నదయ నీ వాఁపంత నూహింతు పే
ర్మిం గన్పట్టఁగ నీడతం డురక గంభీరాహవోత్సాహియై

అర్జు—బావా? యీనీయుత్ప్రేక్షలు నేనెఱుఁగనివి కావు నేను బ్రథమమున బంధువధంబునకుఁ దలఁకుటయు నీవాయజ్ఞానంబు వారించుటయు నప్పుడే గతించినవి. ఇటీతల నాకట్టి ప్రీతి యుదయించుట లేశమేని లేదు. మఱియు నొక విశేషంబు.

తే. గీ. చిన్నతనమున తాత్తమాయన్నదమ్ము, లందఱిని బెంచె నాపగానందనుండు
అతని కబ్బిననబ్బుఁగాకట్టికరుణ, నాకు లేదునిక్కం బిది నమ్ము మనఘ.

ఉ. అతఁడనేకయుద్ధముల నాఱియుఁ దేఱిన వృద్ధమూర్తి నే
నో? తరుణుండ నక్కతన నుండిన నుండగవచ్చు సుంత వి
ద్యాతిశయంబు తాతయెడ; నంపులకున్ బదివేలరెట్లు నీ
యూఁతగదా గదాధర! జయోదయమబ్బుట కింక శంకయే

సర్వంబును నిర్వహించెడివాడవు నీవయ్యెనను ననుమన్నించి యీయాయశంబునాకుం దక్కింపుము.

కృష్ణ—(అంగీకరణ సూచనాపూర్వకంబుగ రథవేగంబు నిరూపించును. ఇరువురును నిష్క్రమింతురు.)

భీష్మ—(తనలో)

మ- కడు పక్షాగ్రులు పాండవుల్ మనుజులున్ గానన్ రణం బంత నొ
క్కఁడుగాఁ జేయుట పాడిగా దనుచు నాకున్ దోఁచులో నప్పుడ
ప్పుడు; యుద్ధాభిముఖుండనై నతఁడెఁ బోవున్ సర్వ మాహేశ్వర్మ; నే
నుడుగంగా వలెఁ; గాంగఁ గావలె జయం బుద్రేకులై పాండవుల్

చ- కరమునఁ జాప మున్న దన కన్నను గెల్వఁడివాడు గాఁడు శం
కరుఁడు త్రిశూలపాణియగుఁ గా కనినేఁ దలఁచ నర్జునుండు నే
ర్పరియగుఁ గాన నాకెదుటపక్షమున న్నిలువంగఁ జాలె ధ
ర్మరతుఁడు ధర్మజుం డతఁడె రాజగు నెవ్వర మెంతపోరినన్-

(పరికించి) చ- ధరముగఁ బోగుచున్నయవి పాండవసైన్యము లస్త్రదీయులున్
దురమున వెన్కఁద్రొక్కకయ దోర్బలమున్ బ్రకటించుచున్న వా
రరిగెడుఁ గాక నాయరద మగ్గును ఁడున్నెడ కింకొకింతలో
నరుణుఁడు గ్రుంకఁ బోవుసమయం బగుచున్నది వేగమే గెడన్

(నిష్క్రమించుచు-)

గద్య.

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వరులొన
ర్చిన పాండవవిజయమునందుఁ
బ్రథమాంకము-



శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవ విజయము.

—:o:—

## ద్వితీయాంకము.

(శిరప తెల్లని చీరతో భాగీరథి ప్రవేశించుచున్నది)

**భాగీ**—హా కుమార! హా భువనైకధనుర్ధర! హా పరస్పహాప్రియాసజీవి! హా అస్ఖలిత బ్రహ్మచారి! కురువృద్ధ! ఈయుద్ధము నీకొఱకేవచ్చినదా? పెండ్లి పేరంటము లు లేకపోయినను నొంటిజందెముతోడనే! వ్యాసాదులవలెఁ జిరకాలజీవి వగుదువనుకొంటింగాని యింతలో నాకడుపునఁ జిచ్చిడుదువనుకొనలేదోయి తండ్రీ!

(చదికిలఁబడుచున్నది)

**యమున**—(నల్లని చీరతోఁ బ్రవేశించి దెసలు పరిశీలించి) ఎచ్చటనో యార్తస్త్రీ నాదము వినిపించుచున్నది- (చెవియొగ్గి) భాగీరథీదేవిగారి కంఠస్వరమువలె నున్నదే- (ఎదుటఁ జూచి సమీపించి) సోదరీ! ఏలవిచారగ్రస్తురాలవై కుందుచుంటివి?

**భాగీ**—(అనాకర్ణితముగా) ఆధర్మరాజానకట్లు నోరాడెనో! చచ్చుటకుందగిన సాధనముం జెప్పుమని యడిగెనఁట- ఆకిరీటి కట్లు చేతులాడెనో! శిఖండి వెనుకనుండి తానే బాణములు ప్రయోగించెనఁట.

**యము**—దేవీ? ఎవరమ్మా! ఎవరిది! నేను యమునను. తలయెత్తి- నావంకకుఁ జూడుము

**భాగీ**—(తలయెత్తి) చెల్లెలా! యమభగినీ! కురుపాండవులకు జరుగుమాయయుద్ధములో మనభీష్ముఁడు పదిదినములు పోరి మాయదారిశిఖండిచేఁ దుదకు నొచ్చి మకరాయనప్రవేశ మాశించి శరతల్పంబున నిరశనవ్రతుండై పడియుండెనఁట!

**యము**—కుమారా! విజితపరశురామా! నీకెట్టిదశవచ్చినది! ఓరీ చండాలదుర్యోధన! ఎటువంటివారికెంతచేసి యాపదలు దెచ్చిపెట్టుచున్నావురా! (గంగదిక్కై ...జెప్! విచారింపకుము- నీకన్నసంతానము పుడమిమీఁద నొక్కఁడైనను నిలిచియుండెను గదా యనుకొంటిమి! యింతకు దైవవిధి యిట్లున్నది- ఈనాఁడు మాయన్నగారి యింటినుండియే వచ్చుచుంటిని, పదిదినములనుండి భీష్మునిచేతఁ జచ్చిన యోధవరుల పేరులు చిత్రగుప్తులతనికి విన్నవించుచుండఁ

జాటునను౦డి వింటిని. పాపమాయెనుగా ! ఆ యిరావంతుఁ డలంబసునిచేత మడిసెనఁట. భీముని చేతఁ జచ్చిన కురుకుమారు లెందఱో వారి పేరులన్నియు మఱచిపోయితిని. సునాభుండఁట, పండితకుండఁట, మహోదరుండఁట ఎవరో యఁట ! ఏ పేరో యఁట ! కొందఱు రాజులమ్మా ! ఇఁక సైనికులమాట లెక్కఁ గానేలేదు.

భాగీ—ఇంతమంది కడతేఱుటకు నీతమ్ముఁడు కర్ణుఁడే ప్రధమకారణము.

యము—అతఁడేమి చేసెనమ్మా ! మా భీష్ముఁడు కానివారందఱిని మహారథులలోఁ జేర్చి వానిని అర్ధరథులలోఁ జేర్చెనఁట. దానికిం గోపించి యీయుద్ధము ముగియువఱకు నేను ధనుర్బాణములు ధరింపనని ప్రతినపట్టి యింటనే యుండెనఁట.

భాగీ—ఈపదిదినముల యుద్ధములోనికి వచ్చిన నేమి రాకున్న నేమి ! మొదటిమాట చెప్పుము !

యము—అగును నానిమతము వట్టిదుర్మతమై పోయినది. వాఁడు మాతృము బ్రతికిబట్టము గట్టుకొనునా యేమి ! మాయలాఁడా కృష్ణుఁ డేదియో యొక మాయ పన్నక పన్నునా.

భాగీ—పోనిది యంతయు వాసుదేవుని పనియే సంధికానీయక కౌరవసభావిశేషంబు లున్నవి కొన్ని లేనివి కొన్ని ధర్మరాజుతోఁ జెప్పి యుద్ధమునకు సన్నద్ధపఱచె. ఇరుతెగల నడుమనుండి గురుజనవధ మహాపాతకంబునకై భీతిల్లి కంపించు విజయునకు గీతలుపదేశించి మనంబు విఱిచె. నరునకు సారథ్యంబు గావించుట తప్ప నక్రియ బట్టనని నేర్పాటున్నను గుమారశరధారాభిన్నశరీరుండై చక్రము ధరించె. ఇఁక నెన్ని యకృత్యములు చేయునో? నిజమితనివలనఁ బాండవ పాంచాలయుద్ధ మధర్మప్రధాన మనిపించుకొనక మానదు.

యము.—దేవీ! గతజలసేతుబంధన మేల? శరతల్పగతుం డగుబిడ్డ నొకసారి కడసారి చూపు చూచివత్తమురా.

భాగీ—ఎప్పటిఁ బడియుండెనో! యెట్లుండెనో? చూచివత్తునని మనసుస్తుతి యేగి వది రాని.

సర—(పద్మిని చీరతోఁ బ్రవేశించి) ఇదిగో దేవిగారిని యనుచు యారడించుచున్నది. (సమీపించి) దేవీ ! ఏమనివిన్నవింతు, సైరికనాగధారాలంకృతం బగు

మేరుగిరిచందంబున ఘనీభవించిన నెత్తుటిచారికలతో శరమయంబగు తల్పం
బునఁ బరుండియున్న దేవవ్రతుం జూచి వచ్చితిని.

యము—తగినయుపచారములు చేయుట కెవ్వరును దగ్గఱ లేరా?

సర—లేకేమి. అంతవఱుక ధర్మరాజాదులును సుయోధనుఁడును జుట్టియే యున్నా
రఁట. కాని నేఁ బోవునప్పటికిఁ గర్ణునితో నే మేమో మంతనములాడుచున్నాఁడు

భాగీ—సరస్వతీ! ఇంక నా మంతనములాడుటకుఁ దగిన తెరపినిలో నున్న వాఁడుగద.

యము—(తనలో) కర్ణునితోఁ జేయుమంతనము లెట్టివో? ఒకవేళ వానిజన్మవృత్తాంత
ము తెల్పుచున్నాఁడేమో.

సర—అమ్మా! మహానుభావు లిచ్ఛాధీనమరణులుగదా!

భాగీ—అది యతనికిఁ దండ్రిగారిచ్చిన వరమే.

(తెరలో)

పాండవయోధులారా! కౌరవచమూపతులారా! ఆలకింపుడు!

గీ. కౌరవేశ్వరా! చూఁడు నీకడకుఁ దెత్తుఁ, బాణములతో యుధిష్ఠిరుఁ బట్టుపట్టి
పార్థుఁ డొక్కింతయే నడ్డ దకయున్నఁ, బగకు వెన్నిచ్చియాతఁడు పారకున్న-

అని కుంభసంభవుండు దుర్యోధన మహారాజున కభయమిచ్చినాడు.

యము—సరస్వతీ! ద్రోణాచార్యునకు సర్వసేనాధిపత్యమునకుఁ బట్టముగట్టిరాయేమి?

సర—ఔను. దేవవ్రతుండు పడినపిదపఁ గురురాజు రాధేయునితో నాలోచించి ద్రో
ణుం బ్రార్థించి యాయాధిపత్యమిచ్చెనఁట.

భాగీ—ఉన్న పెద్దవారల నందఱిం జంపించుట కితనికిదియే మార్గము.

యము—సరస్వతీ! తరువాత ?

సర—తరువాత గురుఁడు సంతోషించి కురురాజు నొకవరము కోరికొమ్మనిన నతఁడు
రణంబున "ధర్మరాజుం బట్టి తన కొప్పగింపు" మని కోరెనట.

యము—వీనికోరిక పాడుగాను! ధర్మరాజునో, భీమునో, యర్జునునో, కవలనో చం
పుమని కోరక యిది యేమి కోరిక! మరలజూదమాడి యడవులకుం బంపవల
యుననిగాఁబోలును.

సర—అవును! అదియే యని వింటిని.

యము—ఈద్రోణుని ప్రతిన పాండవులు విని యుందురా?

సర—ఓసి వెఱ్ఱి యమునా! ప్రజలందఱు వినవలయునని వరుచాటించుచుండఁగాఁ బాండవులేల వినకుందురు? (తెరలో మరల చాటింపు వినఁబడును.)

యము—(వినుటనటించి) ఓహో! ఈచాటింపదియేనా! సరస్వతీ! ధనుర్వాచార్యుఁడును సామాన్యుఁడుగాఁడే. అతని ప్రతిజ్ఞకుఁ బాండవులు జడియవలసినదే.

సర—జడియుటకేమి! ధర్మరాజుగోలయెత్తుచుఁ దనతమ్ములందఱితోఁ జెప్పుకొని మరల నడవికిం బోవుప్రయత్నము చేయఁగా విష్వచ్చుఁడోదార్చి మరల్చెనఁట

యము—అటులేని పేఁటియుద్ధము మహాఘోరముగా జరుగును.

సర—జరుగుచునేయున్నది. చూడు మాకసమునంక; దేవతలెల్ల గుములై చెప్పుకొనుచున్నారో!

యము—(ఆకాశముఁజూచి) అవును. దగ్గఱనున్న వారందఱు యుద్ధమునకుఁ బోదురు ఒంటిగానున్న భీష్మునియొద్ది కీదేవిం దోడ్కొని పోదమురా?

(నిష్క్రమించుచున్నారు.)

(పిదప యుద్ధప్రశంసఁ గావించుకొనుచుఁ గృశానువిశ్వావసులను నిరువురు గంధర్వులు విమానములతోఁ బ్రవేశించుచున్నారు.)

విశ్వా—కృశానూ! దివామధ్యప్రచండుండగు చండకిరణునిపగిది నీయుదుసలిపోలుఁడు నేఁడు యుధిష్ఠిరుం బరాభవదవానలంబుపాలు సేయునేమోగదా! అదిగో కాంచనవేదీపతాకావిరాజితంబగు వరదం బతనిమీఁదికే పోవుచున్నది.

ఉ. "చేతులతీఁట వోఁగలను చేసెద ద్రోణునితోడ నేఁడు; చే
సేఁతలనేర్చు నానుభుజసేతువు చాటుగఁ జూచుచుండు మ
య్యా! తలఁకేల" యంచుఁ దమయన్నకుఁ గ్రీడి దిటంబు చెప్పఁగా
కాతనియొద్ద నేర్చిన మహాస్త్రము లగ్గురునాఁగ నేర్చునే.

కృశా—గంధర్వరాజ! ప్రతిభావిశేషమున గురువుల నతిక్రమించు శిష్యులే లేరా? దీపమొక్కటియైనను నాధారవిశేషంబునం బ్రభావంతమగు గతి విద్యకును బ్రతిభావిశేషంబున హెచ్చుతగ్గులు గలవు అగియునుంగాక.

గీ. ఫల్గునుండొక్క కుంభసంభవునియొద్ద, నేర్చె నే దివ్యసాయకనిచయ! మతని
నడ్డుటకుఁ గాదె మఱికొన్ని యభ్యసించె, శిష్యునివలనను మనసు నాశీరువలన.

విశ్వా—సునాసీరతనూజాతుండు కుంభసంభవు నెదిరింపలేఁడనికాదు. గురుపరాభవమహాపాతకంబునకు జంకునేమోయని.

కృపా—అయ్యా! జంకిన మురారిలేఁడా! మరల గీతలుపదేశింపఁడా! గురుపరాభవంబుకంటె భ్రాతృపరాభవంబు తక్కువదా?

విశ్వా—కృపానందా! తినఁబోవుచు రుచులడుగనేల? అదిగోఁ ముమ్ములసంగరంబు ఘోరంబగుచున్నది. సేనాపతిద్వయంబున శకునిసహదేవులును వివింశతభీమసేనులును భూరిశ్రవశ్శిఖండులును లక్ష్మణక్షత్రదేవులును నల్లుఁడు మామలగు నకులశల్యులును శారద్వతధృష్టకేతులును వృషసేనచేకితానులును విరాటకర్ణులును ద్రుపదదుశ్శాసనులును దలఁపడి శరాసారంబున ముంచుకొనుచున్నారు. ఈ దెస

లయాగ్రిహి

శూరులకబంధములు దారువులుగా గజశరీరములు లావుగ శిరోజములు నీలాం,
భోరుహసమూహములుగా రథములోలగ్గు విసారములుగా విమానవారములుగా డిం
డీరములు గాఁగఁ దరవారులు శిలాలు వెలిచీరలు దగన్ పరివాహముగ ఘోరా
కారముగ శోణితపు టేఱు ప్రవహించె రణధాత్రి నీమనంబు వెరపారఁగనుఁగొన్మా.

కృపా—అగ్రజా! మనము నలుదెసల సమరము పరిశీలించుటచే నొకరీతియు సాకల్యముగఁ జూడలేకున్నారము. కావున నీహారవాహియన్యుల సంగ్రామము మాత్రము కనుఁగొందము.

విశ్వా—(అశ్వైపునకుం జూచి) బళే! సౌభద్రి నీతండ్రికంటె సమరమహాప్రబంధమునం దేరాకు లెక్కుడ చదివితివి.

(తెరలో)

చ. నిలు నిలు మోరిపార్థసుత! నీబల మాబలహీనుఁ బౌరవుం
దలపడినంత నే తెలిసెనా; కిదెచ్చితి వారిఁ గావ నీ
యలవు గనంగొనంగ; విదు మారిని మూర్ధము; కాచుకోర! నీ
తల మగు నేని మామకగదాహతి నీతల వ్రీల్యకుండగన్.

కృపా—అన్నా! వింటివా! రథాశ్వసారథుల నుగ్గుచేసి పౌరవునిం దలపట్టియుండుచున్న నేల్పుకొర మనుమనిపై వేషఁగవియుచున్న సైంధవుని దురాలాపములు దీని కభిమన్యుఁడేమి ప్రత్యుత్తర మిచ్చునో విందము.

(తెరలో)

ఓరీ! దురాత్మా! నాడరణ్యంబున ద్రౌపదీపరాభవంబైన సహించి దుస్సల మొగంబు చూచి మా తండ్రు లూరకుండిరి గాని యిపుడు నిన్నుఁ గాపాడు వా డెవండురా?

విశ్వా—నిజ మభిమన్యుఁడా! నిజము. తమ్ముఁడా! చూచితివా కుమారుని చాకచక్యము

ఉ. కత్తియుఁ గత్తళంబుఁ గొని కప్పుశిబిడ్డ విలోచనంబులం
జొత్తిలు కెంపుచే నెగయు సూరెల నెట్టవడంగ దంతిపై
మత్తిమ్ము గాధపం బులుకు మారిగాఁ గదిసి ప్రమున్న వాఁ
డుత్తిది యింక సింధునృపుఁ దూపిరితో సమరంబు సేయుటల్

కృష్ణా—అయ్యో! అయ్యో! ఎంతలో నెంతఘోరకృత్యము జరిగినదో. సౌభద్రుం డట్లు జయద్రథుని మీఁదికిం దుముకుచుండ మధ్యమార్గంబున—

ఉ. "నీకు భయంబులేదు దిరి నిల్వుము సింధుపతీ!" యటంచు ఘో
రాకృతియైన శక్తిఁగొని యగ్రజుఁ డెంచి వైచెన
స్తోకబలుండు శల్యుఁ; డది సూర్యశతప్రభతో వెలుఁగుచుం
దాఁకెను నయ్యొ! దండధరదండ మువో లెఁ గిరీటినందనున్.

విశ్వా—తమ్ముఁడా! యేల భయపడెదవు. కొంచెమోపిక వహించి చూడుము.

గీ. శౌరివానికిసికి సుఖకాంతి తఱుఁగ, బాండవావరూధినికి ముఖప్రభలు పెరుఁగ
మద్రపతియుక్తశక్తి నే మరలఁద్రిప్పి, కొట్టఁగలవాఁడు విశ్వచ్ఛుకొడుకు చూడు

కృష్ణా—కుమార పరాక్రమ మాలోకింపఁ దమతమ ప్రతిపక్షులుగూడ నుత్సుకులగు టుంజేసి స్వస్వయుద్ధసమ్మలు చాలించి విరాటద్రుపదసాత్యకి ధృష్టకేతు శిఖండి ధృష్టద్యుమ్న ధర్మజులును గనులతో ద్రౌపదేయులును దక్కుంగల యోధవరులును మూఁగుచున్నారు. తనశక్తి విఫలంబయ్యె నను కోపంబునం జాపంబు గదుర సన్న్యాసం బగు గదాదండంబుం ద్రిప్పుకొనుచు మాద్రి సహోదరుండు మరలఁ గేశవభాగినేయుం దాఁకుచుండెను.

విశ్వా—ఈసమయమునం దర్జునుఁ డుండఁ డిగిడె. పాల్కడలినడుమఁ దిరుగుకవ్వపుఁ గొండ చందంబునఁ గౌరవసేనఁ గలఁచు కుమారుని నైపుణిం జూచుము-

కృపా—అర్జునుఁడున్నఁగొడుకని సేయుటయే తటస్థింపదు. పాపము! సమరము సే
యఁదగినప్రాయమా! పెన్నటి పసివాఁడు

విశ్వా—శల్యుఁడిట్లు పసివానిం దాఁకుచుండ నీవిరాటద్రుపదాదు లగు మహాయోధు
లందఱు నూరక చూచెద రేమో?

కృపా—వీరెవ్వరును గదాయుద్ధపరిశ్రమయే యెఱుఁగరు. (ఎదుటికిఁ బారంజూచి)
పిల్లవాఁడని తలంపక గదాయుద్ధంబునకుం దొడఁగి యీమద్రపతికిఁ దగిన
ప్రాయశ్చిత్త మగును లే.

మ. కనకశ్రోణీధరంబుపైఁ గురియు మేఘవ్రాత మన్నట్లుగా
వెనుకన్ముందును బిక్కటిలఁ దగుల వేవేలమ్ములం జిమ్మురయో
ధనికాయుష్మ శ్రేణిసేయుచు గదాదండంబు సారించుమన్
నెన చెండాడుచు వచ్చి యడ్డపడు భీమంజూడుమా యగ్రజా

విశ్వా—ఓశల్య! యిఁక నీశల్యంబులు విఱిగినవిగా తలంపుము. ఏపృథసేనునో యే
లక్ష్మణకుమారునో సాభద్రుని నెదిరింపంజేవి నీవుగూడఁ జూచుచుండిన నీచేటు
మూఁడెనుగద!

(తెరలో)

చ. "అని నిను కౌంతేయజేయుఁ డనునా! యిటుఁ జోద్యము మూఁడ నంత త
ప్పనిపని యేమివచ్చెఁ బసిపాపని బోరికిఁ బంపుసేతు; వీ
తెసవులు గాల్పనే? పిదప ; దంభనరాధిపులార! దేవకీ
తనయుఁడుఁ దమ్ముఁడు న్వినిన దక్కెనొకో మనప్రాణమానముల్."

కృపా—భీమసేనుండు దురాగ్రహంబునఁ బల్కుపల్కులు విని ధృష్టద్యుమ్నప్రము
ఖులందఱు శరాసనమ్ములను పెదకికొనుచున్నారు.

విశ్వా—దీనికేమి, తన్నుం గయ్యము సేయవలదని నివారించు పెదతండ్రి కర్జునవంద
నుండెట్టి ప్రత్యుత్తరము చెప్పునో విందము

(తెరలో)

అయ్యా! వస్నేలవారించెదవు—రణాభిలాషంజేసి నాకు నేనై వచ్చి ఈనరాధి
పుల "బాసట వల" దని నివారించిన నిల్చిరిగాని వారిలోపము గాదు.

క. బాణాసనంబు సేనొక, పాణిం గొని నిలువ మదరిపతి యొకతెక్కా!
ప్రాణాశయున్న సగణ, స్థాణునకు వశంబె యెదిరి సమరము సేయన్.

కృపా—ఎందును రాచబిడ్డ రాచబిడ్డయే. అంమం గిరీటినందనుఁడు వానికి మేనయల్లుఁ
డతనినోట ననుచితపుఁ బల్కులేల వెలువడును.

విశ్వా—విశ్వకర్మా! యిదిగో భీమసేనుండు శల్యునితో గదాయుద్ధమునకుఁ డీకొనియె. అచ్చోటిదెస భారద్వాజుండు ప్రళయరుద్రునివలెఁ బాంచాలసేనం జెక్కుచెండాడుచున్నాఁడు. మనమేసమరము చూతము.

కృశా—మనము భారద్వాజుని యుద్ధమే చూడవలయును. ఏమన—

ఉ. "బాలరమునందుఁ బట్టికొనివచ్చెద ధర్మజు" నంచుఁ గుంభసం
భవుఁడు ప్రతిజ్ఞ చేసెఁ గురువల్లభుతోడఁ; గిరీటి యున్నతో
"నడచుటెట్లు మయ్యా! నేఁ గలరణంబున నిన్నుఁ బరాభవించువా
రెవ" రనియగూఁత యిచ్చె నిపు డేమగునో సమయంబు వీరికిన్.

విశ్వా—సహోదరా! రెండును సమదర్శనీయములే యని నాకుఁదోఁచుచున్నది. కావున నీవిపరీక్షణముండి యిచ్చటివిశేషంబులు నాకుం దెల్పుచుండుము. ఏనావలనుండి యచ్చటిసంగతులు నీకుఁజెప్పుచుండెదను. రెండునుజూచినట్లగును.

కృశా—మంచిది (అవలితట్టునకుఁ బోవును)

విశ్వా—విశ్వకర్మా! పాండవమధ్యమున్నుండు ప్రయత్నమున సౌభముని వారించి మద్రపతిం దాఁకుట నవ్వు చూచితే- ఇప్పుడుగదా! గదాధరులగు భీమసేనశల్యుల స్వరూపములు చూడఁదగినవి.

ఉ. శృంగములందు మధ్యములఁ జెంగలఁబూచినకింశుకంబు లౌ
ప్పంగ గనంబునం దరుగుపక్షచపక్షులు వాఁగలంగి రు
ప్పొంగుచు వీరు వారుఁ దమపోరువిచిత్రము లెంచుచుండ స
ర్వాంగములందు భీకరగదాహతి నెత్తురుధార లోడఁగన్.

కృశా—అగ్రజా! ఇచ్చటమాత్రమేమి తక్కువ సాయంతనార్కమండలంబునకు మరల మధ్యాహ్నంబు వచ్చిన తెఱంగున ద్రోణాచార్యునకు మరలఁ గౌమారంబు ప్రత్యక్షించినది. ప్రళయకాలవారివాహంబు గర్జించుపడువున నిజద్రోణంబు టాంకరించుచు "భారద్వాజా! రక్షింపుము రక్షింపుము! గురువర్యా! కావుము కావుము! కుంభసంభవా ప్రోవుము ప్రోవు" మని పెద్దయెలుంగులతోఁ బంచరాజులంతయు నమస్కరింపఁ గటాక్షించుచు "శిఖండీ! నిలువుము. సాత్యకీ! పారిపోకుము నకులసహదేవులారా! నాయొద్దఁ జదివిన ధను

ర్జిగమం బప్పగింపుఁడు, ద్రౌపదేయులారా! మీరు కుమారులు నాబోటికిఁ వ్రాలఁగుడు, ద్రుపదా! నేఁటితో నీకు సుర్రముపదంబుఁ జూపింతు. విరాటా! నీవేల యీపోరాటమునకువచ్చితి" యనుచుఁ బదింటనో యిరువదింటనో ముప్పదింటనో చేతికివచ్చినకొలంది దూపులం జొబుక్కాన గాఁడ సేయుచు నీటి మీఁదినూనెచందంబున సర్వత్రి తానయై యుప్పతిలం జేయు శరనిర్ఘాతంబులకుఁ గొందఱు సైనికులు "శ్లో॥ అర్జునః ఫల్గునః పార్థః కిరీటీ శ్వేతవాహనః, భీభత్సో విజయః కృష్ణ స్సవ్యసాచీ ధనంజయః" అని యతని నామంబులు స్మరింప మఱికొందఱు "ఇతఁ డెక్కడిపాండవుఁ? డెక్కడియుద్ధ? మెక్కడి ధర్మరాజు? నేఁడు గురుఁడు తనమాట చెల్లించుకొనఁ గలఁ"డని బిక్క మొగంబులతోఁ బిలపింపఁ గురంగంబుల మీఁదికి దుముకు సింగంబు చందంబున నురువడించుచు ఘృతకోశంబుమాడ్కిఁ దనయుధిష్ఠిరనామంబు నిరర్థకంబు గావించు ధర్మతనయు వెంటఁ బడివిల్లుఁ దునిమి కేతనంబుఁ ద్రుంచి రథ్యంబులం గూల్చి చక్రరక్షకుండగు సత్యజిత్తును వృకునితోఁ గూడఁ జదిపి శరాఘాతంబులకోర్చి మరల నెదిరిన విరాట్ద్రుపదులఁ బటిమి యనేకులఁ బాంచాల కుమారుల సురాంగనాకుచకుంభపాణులం జేసి విక్రమించుచున్నాఁడు.

చ. కదనము నేఁటితోఁ ముగియుఁ గౌరవనాథుఁ డపృష్టశాలి యీ
ముదుసరి జన్నిగట్టు మనుమందలఁ దీర్చె వైరమెల్ల; ప
ట్టిది పరిజలంప తాదుకొనులే యది; పాండవపక్షపాతి గాఁ
డదయుఁ డితండు; బ్రాహ్మణుల కౌర! పరాక్రమ మింతయొప్పునే.

విశ్వా—తమ్ముఁడా! నీవు నుడివినవచనములు కొన్ని సేవిన నేలేదు. వాయునందన మద్రినందనులు గదాపాణులయి కొంతవడిపోరి తుదకుఁ బరస్పరాఘాతంబుల నిరువురు మూర్ఛిల్లిరి. అందు శల్యుని కృతవర్మ తనరథంబుపై నిడుకొని యొంటికో కొనిపోయినపిదపఁ గర్ణునికొడుకు వృషసేనుఁడు పిడుగువలెవచ్చి సర్వసేనా మూర్ఛాంబుగ వాఁడివెడందతూపులు నిగిడించి విక్రమించునంత నకులపుత్రుండగు శతానీకుండను ద్రౌపదేయుం డతనికోల్తలకడ్డంబై నిలువరించె. వృషసేనుం డతని చాపకేతనములుద్రుంచి యతిక్రమించువాలోఁ దక్కంగల ద్రౌపదేయు

లాఁగిరి. పదపడి యశ్వత్థామాదులు వారిపై శరపరంపరలు గురిసిరి. దానంజేసి యాసమరంబు దేవాసుర సంయుగంబు పోలెక నతిభీషణం బయ్యె.

కృష్ణా—(అనాకర్ణితముగా) ఓకుంభసంభవా! ఏపాపమెఱుఁగని ధర్మరాజుపయినా నీపరాక్రమము?

చ. మగఁటిమి గల్గెనేని రిపుమారకుఁ డైనకిరీటితోడఁ బో
రఁగవలె నాతనిం గొనఁగ రాజసమక్షమునం బ్రతిజ్ఞ చే
యఁగవలె నాతనిం జెనకి యాశశితారక మైనకీర్తి పొం
దఁగవలెఁ గాని యీపవిత్రిన ధర్మమె ధర్మజుఁ బట్టితెత్తువే.

విశ్వా—(బిగ్గరగా) తమ్ముఁడా! అచ్చట ధర్మరాజునవస్థ యెట్లున్నది? ఎచ్చటను గిరీటిజాడ కనఁబడదు గదా?

కృష్ణా—"భ్రాతృవత్సల! అజాతశత్రుండు పట్టువడియెఁ బట్టువడియె" నను సర్వజనాక్రందనంబు విని కిరీటి వచ్చుచున్నట్లేయున్నది. ఏమన నీదెసఁ బాండవసేన పెల్లురేఁగు చున్నయది (తేఱిపాఱఁజూచి)

ఉ. అల్లదిగో! కపిధ్వజ మహార్పతికిం దలచూపు, నల్లదే
తెల్లనిగుఱ్ఱముల్ గలుగు తే; రదుగో! నారి గొల్లపాగతో
నల్లనిమేనితోఁ గరమునం గొరడా గొని కూరుచున్నవాఁ
డుల్లమునందుఁ దల్లడిల కూఱటఁ జెందును ధర్మజుం డిఁకన్.

(తెరలో)

ఉ. చంపుదు మర్జునుం దొడరి, చాలక చత్తును రెండుగాక నిం
బెంపఱిపాఱిపోయి రణభీరులమై గురువాన; యింత మా
తెంపు, గురుండు లావున యుధిష్ఠిరునిం గొనితెచ్చుదాఁక సై
రింపుము పార్థుని న్నిలువరించెద మో కురునాథ! పంపుమా-

కృష్ణా—అన్నన్నా! ధర్మరాజుం బ్రోవఁ గొంపరతోఁ జనుదెంచుచున్న పార్థునకు నారాయణ గోపాలసంశప్తక గణంబులతో సురథసుబాహుసుధన్వసుశర్మ లడ్డుపడుచున్నారే ఇఁక ధర్మరాజుగతి యేమగునో? (విశ్వావసువంకఁ జూచి) అగ్రజా! నీవు నీవైపు వకేరమ్ము. భీమాదులందఱీ దెసకే వచ్చుచున్నారు.

(పరికించి) బలే! భగదత్తా! భీష్మునితరువాత నీవలెఁ గృష్ణునిట్లు నొప్పించిన వారే లేరు. నరకపుత్త్రుండవుగదా! (ఆశ్చర్యముతో) భగదత్తప్రయుక్తం బగు వైష్ణవాస్త్రంబు శౌరికిఁ బూలమాలికగాఁ బరిణమించినదే! (వినుట న టించి) తనపైకివచ్చు నస్త్రంబునకు లక్ష్యమైన వాసుదేవునితోఁ బార్థుం "డిది తగదు దీనికతన నన్ను రిపులేసగింతురు. ఇదిగాక దయచే నీవు సారథ్యం బొనరింప నంగీకరించుటయే చాలు. పయి పెచ్చిదికూడనా" అనుచు దానికి సమాధానంబుచెప్పి భగదత్తుపైఁ బురికొల్పుచున్నాఁడు. (విచారముతో) అక్కటా! భగదత్తుఁడు తన సుప్రతీకముంగూడ సమీకమునకుఁ బురికొల్పు చున్నాఁడు. (సంతోషముతో) ఔరా! యీనీలుని పౌరుషము? (తత్తరపా టుతో) "నేనెవరితోడనో పోరాడుచుండ నీవునీవై నన్నుం గొట్టుమని పిల్చి తివిదిగో? కాచికో" మ్మని యశ్వత్థామ శిరమ్మునకుఁ గుఱిచూచి యొక క్రూర భల్లంబు ప్రయోగించుచున్నాఁడు. (నిరూపించి) ద్రౌణి యాశస్త్రంబును ఖం డించి "నేనెందులకుఁ బిల్చితినో యాఫలమియ్యది తెల్పఁగల"దని క్రోధహ సమ్ములుప్పతిల్ల నొక్కవాడిభల్లమ్ము నిగిడించుచున్నాఁడు (విచారముతో) అక్కటా! నీలుండు కాలుండుండుచోటికిఁ బోవుచున్నాఁడు.

విశ్వా—(ఆకసమువంకఁజూచి) సంధ్యాకాలమాసన్నమైనది. నిన్నటితోపాటు నేఁ డుకూడ ద్రోణునిప్రతిజ్ఞ వ్యర్థమయినట్లే మనమనుకొనవచ్చును. భీమాదులు చుట్టును గాపాడుచున్న యీమహారాజు ద్రోణునికిఁగాదుగదా! స్థాణుని కైన నజయ్యుఁడే? (పరికించి) కర్ణార్జునులు తాఁకుచున్నారు. పోరుఘోరంబగు చున్నది. (తత్తరపాటుతో) అయ్యో! అయ్యో! శిఖండిధృష్టద్యుమ్నులుసా రథిని జాపంబును నరకిరి. ఇఁకఁ గర్ణుఁడేమగునో కదా! (దృష్టించి) భయ ములేదు. రారాజుద్రోణసైంధవులతో నరిగి కాపాడుచున్నాఁడు (విచారము తో) పాపము! ఇదేసమయమని కర్ణబాంధవులఁ బదివేవుర నొక్కపెట్టున నడగుడి తన గదాధిదేవతకు బలివెట్టుచున్నాఁడు.

కృపా—(వినుటసూచించి) రేపుజరుగు యుద్ధక్రమము గడువిచిత్రముగా నుండును క. ఛద్మంబువేచి విపక్ష, కుద్మంతుండేచి కుంతికొడుకులను మహా

పద్మగర్భులఁ గావింపఁగఁ, బద్మవ్యూహంబు పన్న వాఁడఁట వింటే.

విశ్వా—ఔన్నౌఁగా! ఈవ్యూహము భేధింపఁ దగినవారిందుఁ గృష్ణార్జు నాభిమన్యు లున్నారని యభ్యూహకుఁ డెఱుఁగఁడా!

కృపా—ఆయన కీమాత్రము తెలియదా? తెలిసి యున్న బన్నుచుండుటచేతనే యిం దుల కేనో మఱియొక పన్నుగడ గూడ నుండునని మన మూహింపవలయు

విశ్వా—ఊహించినట్లే యున్నది. సంశప్తకులు కృష్ణార్జునుల నరికట్టెదరనియు నభిమన్యుఁ డీవ్యూహ విభేదనమున సమగ్రముగా నెఱుఁగఁడనియు వారియభిప్రాయము కావచ్చును. కానిమ్ము తినఁబోవుచు రుచు లెందుకు రేపకడ సర్వమును స్పష్టమే యగునుగదా?

కృపా—ఏమీ? సమగ్రముగా నెఱుఁగఁడనియా? యెఱుఁగకపోవుఁగాక.

మ. అభిమన్యుం డభిమాననమ్యుఁ డతఁ డయ్యాచార్యు గీచార్యవీ
రభయుండించుక లెక్క సేయఁడొక పద్మవ్యూహమే కాదు తా
నభవుండించుకదియేని వ్యూహమున యుద్ధాసక్తిమై వచ్చెఁగా
క భరంబందుఁ బలంపఁ ... డొక్కండాప్త కోదండుఁడై.

విశ్వా—అవును. నీవు చెప్పిన దించుకయు నతిశయోక్తి కాదు బాగుగ యోజించిన స్వభావోక్తియుంగాక పోవచ్చును. ఏమంటివా?

తే. గీ.- ఖండించిరుచు ... ధన్యమూర్తి, ... యును గొంతయు ... విధమ్మెఱుంగు
మేనమామను పాత జగానఁగాన, మన్యరా...డగను రభిమన్యునకును.

(నిష్క్రమింతురు.)

గద్య. ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరు లొనర్చిన పాండవ
విజయ మనునందు ద్వితీయాంకము.



శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవ విజయము.

## తృతీయాంకము.

(అంత ధర్మజ భీమ నకుల సహదేవులు ప్రవేశించుచున్నారు)

ధర్మ—భీమసేనా! ఈపద్మవ్యూహంబు భేదించుట మన యభిమన్యుం డెఱుంగునని తొల్లి ప్రసంగవశంబున వాసుదేవునిచే వింటిని. అతని బంపుదుమా?

భీమ—మనము చేయవలసినపని యిదితప్ప నొండొకటిలేదు. కృష్ణార్జునులకోపపడినఁ బైసంగతి విచారింతము.

నకు—సుభద్రతో నైనఁ జెప్పి పంపించిన శ్రేయము.

ధర్మ—అవును. సహదేవా! నీవుపోయి సుభద్రతోఁ జెప్పి యభిమన్యు నిటకుం దోడుకొనిరమ్ము?

సహ—(పోయి యభిమన్యు సహితుండై ప్రవేశించును)

ధర్మ—(అభిమన్యుం గౌగలించుకొని) నాయనా! సౌభద్రా!

ఉ. "కయ్యము వేయరమ్మని త్రిగర్తులు పిల్వఁగ గెల్వఁబోయె మీ
యయ్య; గురుండు కొనికథ యంబిడ "నన్గొనితెత్తు" నంచుఁదా
నొయ్యన; నెంచుఁజొత్తుఁ? బ్రబలయోగుఁ డనంగ వెలుంగుచున్నవాఁ
డయ్య నఘాత్ముఁ; డేది తెరువయ్య! వచింపుము మాకుఁ బుత్రకా.

నిన్నటిరణంబున నే సత్యజిత్తు సూర్యదత్తుఁడు మొదలగు పెక్కురు యోధులు మడిసిరి. తక్కినవారు తమయథాశక్తిఁ బెనంగుచున్నను—

శా. మా కవ్వారి కభేద్యమైనయొకపద్మవ్యూహముం బన్ని క
న్నాకై వాకిలి గాచి యుండె గురుఁడన్నా! యెట్లుపోసేర్తు! మే
మీకం గొల్వద? మింతసేపు సమరోర్విం "గిరీటియుం గృష్ణుఁడుం
డీకోకుండిన నత్తరి" యానుపదంతిం బాపి కాపాడుమా.

భీమ—(బుజ్జగించుచు)

గీ. మదిపలితోఁడఁబోరాట ...ంచి, పంకిలినటంచుఁగోపింపవలదు తండ్రి!
పెద్దవారుఁడ నీకేల చిన్నవాఁడ, ననచుఁ గా నీవు చాలే ... చుడు.

నేఁడు మాత్రము పెద్దవారము కాకపోతిమా? బలవంతులము కాకపోతిమా?
అయినను—

చ. పెనుగదఁబూని శత్రువులఁ బిప్పియొనర్చుట తప్ప నెన్నఁడుం
బనివడి యిట్టివ్యూహములు పన్నుట విప్పుట యేనెఱుంగ; నా
కనువుగ వాఁడిసూది మొనయంత కవల్చితి వేఁగఁ జొచ్చి య
మ్మొనఁ గలగుండు వెట్టి పడ మొత్తెద మత్తగజంబు చాడ్పునన్.

నకు—కుమారా! పద్మవ్యూహంబు భేదించువిధ మెఱుంగ ననుటకే కాక మానోట
నిన్ను యుద్ధమునకు బాసట కమ్మనుటకుఁగూడ లజ్జపొడముచున్నది.

చ. "ఒరులకుఁ జేతగాదు దాని నొండెడ కర్జునుఁ" డంచుఁ జిత్తమం
దరసి గురుండు పన్నిన మహాకపటం బిది; మొగ్గరంబులోఁ
జొర వెర వొందు చూపి మము శూరులఁ జేయఁ గదయ్య! నేఁటి సం
గరమునఁ గుంతిభోజసుతకంటెను గోడలు వీరమాతగన్.

క. మాయెడకంటెను గురునకు, నీయెడఁ గలకూర్మి హెచ్చు నేనెఱుఁగుదు నీ
కే యెదిరిన నిమదృఢతర, సాయకముల సేయఁ డెట్టి సమయమునందున్.

సహ—తండ్రీ! వంశోద్దీపక!

గీ. చేతిలావు చూపి చిన్నన్న దగ్గఱ, లేకయున్న వెలితి లేకయుండ
మొగ్గరంబుసొచ్చి మొనసించి పాండుభూ, పాలుకీర్తి నిలుపఁజాలుదయ్య.

"మొగ్గరంబు సొచ్చుట తప్ప వెడలుట యెఱుంగఁ"డని సంశయించిన మావారితో "ధృష్టద్యుమ్న సాత్యకి ప్రముఖులతో మేము వెనువెంటఁ గావాడుచుందు మింతలో మాయన్న రాఁగలఁ"డని చెప్పి యొప్పించితిని.

ఉ. దారియొనర్చి మొగ్గరము దాఁటినపిమ్మటఁ బెక్కుమంది యు
న్నారము చంపఁ జాలఁగ; రణంబున నీవు వహింపఁ దగ్గదీ
భారము; మోచి కీర్తి నిలుపందగునయ్య కుమార! మమ్ము నా
శౌరియు నన్నయున్ బరవసంబున మల్లస మాడకుండఁగన్.

అభిమ—తండ్రులారా! గాయాలంటి కార్యమునకు నన్నింత బతిమాలవలయునా? పుట్టినది రాచపుట్టువుగాదా! ఈదుర్యశంబు నాకుమాత్రము రాదా! రాచబిడ్డ రణంబు సేయుట కాఁడువాండ్ర యంగీకృతి కావలయునా? వేయేల ఇదిగో నాప్రతిజ్ఞ వినుఁడు.

రములు వెలువడినవి. ఆశీర్వాక్యమునందమంగళార్థము స్ఫురింపఁగూడదు. “పనువు లేకయయినను నీకేజయము సుమీ” యని యీయన ఘుని తాత్పర్యము. “పనుగురు నిన్నుఁజుట్టుముట్టుదురుగాక! నీకు జయములేకపోవుఁగాక” అని యశ్లీలార్థము స్ఫురించుచున్నది. ఇంతియుకున్న కుమారునివాక్యమున “పోయి వచ్చెద” ననుటకు బదులు “పోయెద” ననిమాత్రమే నుడువుటచేతనే కొంత సందియపడి యుండుమున్న నాకిది మఱియును వెనుబాటు కల్పించుచున్నది. కానిమ్ము, మాకరదఅకేడుగడయు విశేషంబుగ నితనికి మేనమామయు నగు మురాంతకుని యనుగ్రహంబున్నంతవఱకేమియు లోపంబు రాఁగూడదు. (ప్రకాశము) దేవా! యుధిష్ఠిరమహారాజ! ఈమాకౌర్యభుజచతుష్టయ రక్షితుఁడవై నీవిచట నే నిలువుము. నేనుం గుమారుండును జనియెదము.

ధర్మ—నాయనా! భీమసేన!

ఉ. అంచితసత్త్వులౌ మనమహారథు లీవును నాల్గుపక్కలం
బొంచి కుమారు నేమఱక ప్రోచుచుఁ దామర మొగ్గరంబు వో
జించినవెంటనే రిపులఁ జింపరవందర చేసి మాట ద
క్కించుఁడి! క్రమ్మఱ న్సుతునిఁ గృష్ణసహోదరికిప్పగించుఁడీ

భీమ—దేవా! అంతయు దేవరసన్నిధానమే కాపాడఁగలదు. (కుమారసుమంత్రులతో నిష్క్రమించును)

ధర్మ—నకులసహదేవులారా! భీమసేనునకుం గోపమువచ్చునని నాసంరక్షణకై మిమ్ము నిలుపుకొంటేం గాని వేఱు కాద.

చ. కదనములో బలం బగలఁ గండలు రాల్చుచుఁ గిరీటిపోలికం
బదుగుర నొంపఁ జాలినకుమారులు మీరిచ యేల? బాహుసం
పదఁ గురుసేనఁ దాఁకుచు భీమున్న్యన కోఁతను గండు పాండు నే
నోదిగెద నిచ్చ లేని హరియుం జినతమ్ముఁడు వత్తురింతలోన్.

కావున నాకుం బాంచాలీశిబిరమునకుం దోడ్పచూపియంతఃపురసంచారయోగ్యుండగు మన కరండకుని చేఁ గుమారయుద్ధపరిచారంబు తెలిపింపుఁడు—

నకు—(జనాంతికము) సహదేవా! పాంచాలీశిబిరమునకుం ద్రోవ చూపుమనుటవలన మనము నిశ్చింతముగా సమరమునకు కుటుకవచ్చును. మహారాజు నొంటిగావిడిచి వచ్చితిమని భీమన్న తాను గోపమురాదు.



సహ—(ధర్మరాజుతో) దేవా! దేవరయానతి శిరసావహింతును అదిగోఁ బాంచాలీ శిబిర మిచ్చటి కనతిదూరముగా నున్నది ఇట్టిటు (కొంతదూరమునడిపించి) ఎవ్వఁడురా?

ద్వారపాలకుఁడు—(ప్రవేశించి) దేవా! నేనుబకోటకుఁడను

సహ—ఓరీ! పాంచాలరాజపుత్రికిం దెల్పియీమహారాజునులోనికిఁదోడ్కొనిపొమ్ము. (ధర్మరాజుతో) దేవా! యింక మాకు సెలవొసంగుము.

(ఇరువురు నిష్క్రమింతురు)

ద్రౌప—(బకోటకునితో ధర్మరాజు నెదుర్కొని) ఆర్యపుత్రా! మీ మొగఁబు చింతాక్రాంతమై బడలినట్లున్నది. నిరంకుశప్రతాపులగు మీతమ్ములు నలువురుఁ గుశలమే కద?

ధర్మ—(నిట్టూర్పుపుచ్చి) చెలీ! యాచార్యభాస్కరుం డస్తమించుటలకు మాకుఁ గుశలమెక్కడిది! ఇప్పుడింకొక యుపద్రవము తటస్థించినది.

ఆ- సవ్యసాచి నారియు సంశప్తకులమీఁది, కేగఁజూచి ద్రోణుఁడేపుమిగులఁ
బంపినాఁడ మనసుభద్రకుమారుని, దురము నేయ భీముఁ దోడొసఁగి-

ద్రౌప—మహారాజ! రాజకుమారులకు సమరశాత్రవగర్వనిర్వాపణము విహితకృత్యమే కదా! దానికింత పొగుల నేల?

ధర్మ—పాంచాలీ! అట్లుకాదు- మాయర్జునుం డొకనాఁడు "నేను దగ్గఱలేనిచోఁ గుమారు నెవ్వరు సమరమునకుఁ బురికొల్పకుఁ" డని యొత్తిచెప్పెను- దానంజేసి మనసు కలగుండు పడుచున్నది-

ద్రౌప—అదియు విచారణీయాంశమే- అతఁడుమాత్రము "క్షత్రియకడుపునఁ గుఱంగిపోతయు జనించు" ననుకొనునా! అట్లనుటకుఁ దగిన కారణముండకపోదు- కానియేలయంత తప్పనిపనివచ్చె-

ధర్మ—(తనలో) స్త్రీలకడ లజ్జాకరంబగు కడచినవృత్తాంత మేమనిచెప్పుదును.

(తెరలో)

ఉ- పాండవయోధులార! యిటు ఖండనభూమికి ఫల్గునుండు రా
కుండినఁ గట్టిపెట్టెద సుయోధనుముందఱ ధర్మపుత్త్రు మా
ర్తాండుఁడు గ్రుంకకుండ సమరంబటె పాటకయుండ సేఁ; యి
వ్వాం డెడ సొచ్చినన్ దునిమి డైచెద శీర్ష మెంతొక్క డూపునన్-

ధర్మ—(విన్నటు సూచించి) పాంచాలీ ! వింటివా ? ఆచార్యుని ఘోరప్రతిజ్ఞ! అను సరిపాటుఁ మేఘగంభీరస్వన మెంతదూరము వినఁబడుచున్నదో?

ద్రౌప—(తనలో) ఈమహారాజున కంతఃపురప్రవేశకారణమిదియే కాఁబోలును-

(ప్రకాశముగా) దేవా ! జయముకు జయముకుఁ- సమరభూమి నర్జునుండొకటి యు నభిమన్యుఁ డొకటియునా ? ఇదిగాక సంగర మంతయున్నచోఁ గదా సల్పుకొనుట"

బకో—(ప్రవేశించి) దేవా ! రణరంగమునుండి కరండకుఁడు వచ్చి ద్వారమున నున్నవాఁడు

ధర్మ—(ఆస్థతో) త్వరగా ప్రవేశ పెట్టుము-

కరం—(ప్రవేశించి) దేవా జయము జయము

ధర్మ—కరండకా ! కుమారుని సంగరరంగపరిచారము వినిపించి మాచెవులకు రసాయనముఁ గావింపుము-

కరం—దేవా! చిత్తము- దేవరయానతింగొని కుమారుండరదంబున నుదయదంబు నాలి తెఱంగున నంబు బ్రకాశించుచు సమత్కృతిసంబును జ్యాకిణాంకితంబును గాని గాండీవిభుజాదండంబునుం బోని భుజార్గళంబున వింటిత్రాడు సంధించి దిగ్గజశ్రవణ బధిరీకరణంబుగ గుణంబు పారించుచు శంఖంబు పూరించుచు మేమందఱము చూచుచుండ నాలీలఁ దమ్మిక్రొగ్గరంబు చించి లోనికిం బ్రవేశించి యేనుఁగులమీఁదికిం దుముకు కేసరికిశోరంబు చందంబునం బొలిచి యాచార్యప్రముఖ యోధవరులపై కుఱుకుచు "రమ్మ" నిలువు, మాఁగు, మొనఁడు రా! నీవా! నేను, వాఁడు నీఁ" డనుచు నొడ లెఱుంగక పిలుచుమంటలోఁబడు శలభమ్ముల మాఱి ననురుపదాతుల మారిమసంగినగతి నొక్కొక్కతూపునకు గుదులుగుదులుగఁ బొరిమాల్చుచు విజృంభింప దుర్యోధనుండు చూచి నలుదెస లగ్నిదరికొన్న కుప్పశరసణంబు భాతిఁ బలుచనైన తన సేనయవస్థకు మండిపడుచుఁ గుమారుండాఁకె-

ధర్మ—కరండకా ! ప్రథమకబలంబుననే మక్షికాపాతమన్నట్లు మొదటనేసుయోధనుం డెదురుపడెనా! తరువాత?

ద్రౌప—ఆర్యపుత్ర ! అదిమక్షికాపాతముగాదు సుధాపాతమే.

కరం—తరువాత ద్రోణుండెలుఁగెత్తి "యో ధరాధిపతులారా ! అభిమన్యుండు కురు

నాథుం డాఁకుచుండ నూరకుండెద రేమి- అతఁడు పసివాఁడను కొంటిరేని
అర్జునాత్మజుఁడు సుఁడీ! ఒరులకు దుర్భేదంబగు పద్మవ్యూహము నొక్క
తెప్పపాటులోఁ జించుటయైనఁ జూడరా!" యని తన రథంబతని నీఁడకిఁ
దోలింప నశ్వత్థామ కృపదుశ్శాసనకర్ణవికర్ణకృతవర్మశల్యపౌరవశలభూరిశ్ర
వఃప్రముఖులు చుట్టుకొనిరి-

ధర్మ—కటకటా! కుంభసంభవ! నీవే యిట్లు క్రూరకృత్యమున కొడిగట్టుచున్నా
వా! ఒక్క-కుమారునిం బదుగురు చేఁదాకించుట ధర్మమా! కంచియే చేను
మేసినఁ గాఁ పేమి చేయఁగలఁడు! తరువాత?

కరం—తరువాత సౌభద్రుండు తన సుందరవదనారవిందంబున కంపంబుఁ జెందించు
చిఱునవ్వునవ్వి తేలుకుట్టిన నాఁడలంతయుఁ జూలుక్కుమనట్లొక్కొక్క బా
ణంబున నయ్యోధవరుల నాటించి విశేషంబుగ ద్రోణునిం బదునేను నారసంబు
ల నీరసంపడఁ జేసె.

ధర్మ—(సంతోషముతో) బళే! కుమార!

* గీ. కులము చెఱుపంగ నూర్వురు కొడుకులేల
యొకఁడు చాలఁడె నీవంటియుక్కలుండు
ఊరకుక్కలు పదివేలు చేరనేల
చాలదే వేఁటకై యొక్క జాగిలంబు.

* ఇయ్యెడ నీచోపమయని యనేకులు ప్రాజ్ఞులు సంశయించినట్లు వినియుంటి
మి. కాని వారింకను బరిశీలింపఁ బ్రాప్తితులు వస్తువెట్టిదియైనను అందలిగుణమేదో
మంచిదియున్న దానినే పురస్కరించుకొని వాల్మీకి మొదలు నేఁటివఱకును గవులుప
మానముగాఁ గైకొనుచు నేయున్నారు. ఇందులకుఁ బ్రయోగములు—వాల్మీకి రామా
యణమున యుద్ధకాండమున (దృశ్యేతే శల్యకాపప) శ్రీరామలక్ష్మణులు సమ
యోచితముగ నేదుపందులతోఁ బోల్పఁబడిరి. మఱియు భారతమున (శరాచి
తాంగస్సౌభద్రః శ్వావిద్ప్రత్యదృశ్యత) అభిమన్యుఁడు పెనుకటి పలెనే
పోల్పఁబడినవాఁడు. మఱియు భీష్మపర్వమున 8 ఆశ్వాసమునఁ ప్రబలోద్ధతలులా
యలులితంబులైన కమలకైరవోత్పలంబులగు కొలంకులు) ఇటు లులా
యము (దున్నపోతు) భీష్ముఁడే కావలసియున్నది- మఱియు ద్రోణపర్వము 4 ఆశ్వా

కరం—తరువాత గురుండు వెల్లఁదనము చిఱునగవుగనుఁగన్నీ రానంద బాష్పంబుగను
బరిణమింప "బాపురే కిరీటినందన ! మాకుందగిన సత్కారంబు గావించితి"
యని బగ్గుబగ్గునయుండు కాయమూ పాదమస్తకము సవరించుకొనుచుండ వృషభం
బుపై దుముకు బాలవ్యాఘ్రంబు పోలికఁ గురురాజుపైఁబడు కుమారున క
శ్మకేశ్వరుం డడ్డపడియెను

జ్యోప—ఓఁడశ్మకుని కొడుకే గాఁడా! వీనికి వినాశకాల మాసన్నమయినది. "మ
హాగజానికి ఎలాకుంతే మశకానాంతు కాకథా" వీఁడు కుమారునడ్డువాఁడు?
తరువాత తరువాత?

కరం—తరువాత నో దేవీ! రథాశ్వమాతంగకేతనంబులతో నాతనితల భూతలంబునకు
బరియిచ్చి కర్ణుని వీఁదికిం దుమికి యాతని కవచం బీడిగినంతనే యాసరికి
దూసిపోనేసి యతని సహోదరుఁ గనిమసంగిన దుర్యోధనాదులు వెన్ను చూ
పిరి. "శల్యుండుమూర్ఛిల్లె" నని యతనికి సహాయపడిన యతని యనుజుఁడు
మడిసె. ఇట్లు మహాసంవర్త సమయశూలపాణిం గేళిసేయుచు నేనుఁగుల
నుచ్చిపోనేయుచు నరదంబులఁ గూల్చుచు హయంబులం బిండిసేయుచుఁ
గేతనంబులు రాల్చుచుఁ బదాతుల మేనులు నెత్తురుకాలువలపైఁ దేల్చుచుఁ దీ
నుఁగు పెంటలుగాఁ జేసినఁ జిక్కుపడియుఁ జీకాకుపడియు గగ్గోలుపడియుఁ

---

సమన—గురుఁడామిస్యుమ్మనకు వేమ దోగసందమ్మన—మఱియు సైంధవవధఘట్ట
మున (పార్థః...నివారయామాస లోభ న్సర్వగుణానివ) అర్జునుఁడు లోభగు
ణములతోఁ బోల్పఁబడె మఱియు మాఘకావ్యమున (కఠోర తారాధిపలాంఛన
చ్ఛవిః) చంద్రుని కళంకముతో శ్రీకృష్ణుఁడు పోల్పఁబడియె. మఱియు అనర్ఘరా
ఘవనాటకమున (అయమపిశిఖరమోషీ కంకకాషాయగౌరం... అర్చిః)
సూర్యకాంతి ఆఁడగాడెద కంఠకాంతితోఁ బోల్పఁబడియెఁగాని యిర్యుడ వ్యా
ఖ్యాత (న్యూనోపమాదోషః శంకతవ్యః) అనివ్రాసినాఁడు. అతని తాత్పర్యము
న్యూనోపమయైనను ఔచిత్యముంబట్టి గ్రహింపవచ్చునని యే కన్పట్టుచున్నది ఇట్టి
వింకను అనేకములు చూపవచ్చును. ఇప్పటికే గ్రంథవిస్తరమైనది. కావున నింత
తో విరమించుచు దీనిచేతఁగూడ సమాధానమునొందని దోషజ్ఞులకొఱకై పాఠాంత
రములు రెండుదాహరించుచున్నారము.

{ 1 కలుషరాల్పందచెక్కుటకన్న ముక్కు, కలకుఁజాలదెయొకమగత్రాటిముక్క }
{ 2 తిక్కలెత్తేసియునఁజెలరేఁగ నేల, చాలదేచీఁకటికినొక్కచందిరేఖ }



నొలంగియు వెలచలచియు మూర్ఛిల్లియుఁ బరవసంబేది దీనదశకువచ్చు తన
సేనఁజూచి యాచార్యుండు ప్రల్లదుఁడు "పాండవపక్షపాతి" యని యతనిం
దూఱుచు దుశ్శాసనుం డెదుర్కొన నాఁటిసభలోని దౌర్జన్యం బుగ్గడించి
మించి విక్రమించి ప్రాణమాత్రావశేషుంజేసి పాఱఁగొట్టె. వృషసేనుండు రథం
బుమీఁద నొఱగె. లక్ష్మణకుమారుం డెదుర్కొన ద్రోణాదులసమక్షమ్మునఁ
బ్రతిజ్ఞాపూర్వకమ్ముగ యమాలయమ్మునకనిచె.

ధర్మ—(విచారముతో) అక్కటా! లక్ష్మణకుమార! తెలిసియును నీవు సౌభద్రు
నెదుటికి కేలపోతివి తండ్రీ! (కోపముతో) ఓరీ మూఢ సుయోధన! యిప్ప
టికైన నీకు బుద్ధివచ్చెనఁ దక్కిన పరుకుమారులేని బ్రతుకుదురుగదా!

కర—దేవా! యింతయనగానేల? పుత్త్రుని బుట్టినబుద్ధి పుడకలతోఁడ నేకదా
పోవలసినది.

ధర్మ—అవును. నీవనినట్లే తరువాత నేమిజరిగెను.

కర—పిదప బృహద్బలుండు రూపుమాసె. అశ్వకేతుండు చదిసె. ఈగతిం బ్రళ
యవారివాహఘటుల నిర్ఘోషతుల్యంబుగ మ్రోగు వలయీకృతకోదండ మం
డలంబునడుమనుండి వెడలు వెడిదంపుపిడుగుటంపర సహింపక కురుసేన చె
ల్లాచెదరై నుగ్గునూఁచమై పంచబంగాళమాయె. బెదర మనకుమారకంఠీరవంబు
యుద్ధంబునం దనివితీఱక హతశేషం బగుదళమును వెనుదగిలి కనిమసంగి నా
ల్గుటికాలున లేక నైతరణీసమానం బురణింప మింటఁ బొటలుగురియు మధ్యా
హ్నమార్తాండునకుం దోడై వెలుఁగుచు ద్రోణునిపై కరదంబుఁ దోలించి పె
ద్దయెలుంగుతోఁ దాత! "యర్జునుండు సమరభూమికి రాకుండెనే" యని యు
పహాసమ్ముంచుకొని "మామహారాజుం జెఱపట్టి కురుపతికుం గలఁ బెట్టెద"
నంటివిగదా! బీరంబులాడితి "విదిగో! నేనేయవకాశంబు లేకుండ మీయందఱు
జూడ మీమహారాజుం బట్టుకొని మా పెద్దతండ్రియొద్దఁ బెట్టెద" నని బెబ్బు
లియట్లు మరలఁ గురురాజుపయిం గవిసె.

ధర్మ—తండ్రీ! చాలు చాలు పదుగురువినుచుండ గురువరుండు నాకుం జేసిన పరాభ
వంబునకుం దగినమాట మాఱుచెప్పితివి.

కర—అంత మద్రరాజకుమారుండు రుక్మరథుండు రాజుతో నేమో ప్రగల్భములు
పల్కి "యీతనిం బ్రాణములతోనే పట్టువాఁడ" నని చెప్పి విక్రమించి

శరంబు లంబరమార్గంబున నెత్తుటియలు గావించుకొనుచు జగడంబు చేయు చుండ నపరాహ్ణంబగుడు నట్టిటు తిరుగు క్రవ్యాదపటలంబునకు శత్రుంజయు సూర్యభాను మేఘవేగ సువర్చశ్చంద్రకేతు ప్రముఖుల మాంసఖండంబులు ఫలాహారంబులుగను శోణితంబు పానీయంబుగ నుపయోగించె. అట్టియెడ వికసత్కోకనద చారువిలోచనుండగు నాసౌభద్రుం డాదుశ్శాసనతనయు నేడు బాణంబుల నొప్పించి రథాశ్వసూత కేతనంబు లవనిం గూల్ప నతం డొండు రథంబు నెక్కి పలాయితుండయ్యె. ఇట్టులయ్యేకవీరుండు సర్వనిరోధంబుగా విజృంభించుటం జూచి కర్ణుండు ద్రోణుతో యోజించి యాచార్యునొద్దకు వచ్చి "కుంభసంభవా! యిదేమి చోద్యము పిల్లపిడుగు మనవారల కెల్ల బిల్లలపిడుగయ్యె నెవరి యాకారుప మిన్నకుండుటకన్న యధర్మమున్నదే" అని యనేక ప్రకారంబులం బ్రార్థింపం గొంతవడి నేమియుననక యతండు "వీని విల్లు దునిమి విరథుం జేసినం గాని యీతని ఫాలాక్షుండేని యెదిరింపలేఁ"డని యుత్తరం బిచ్చె. పిదప దుష్టచతుష్టయం బేదియో యోజింప మొదలిడిరి. నేనీ యుదంతము దేవరకు విన్నవించుటకై వచ్చితిని.

ధర్మ—హా కుమార! బోనలోఁబడిన కొదమసింగమవైతివిగదా! ఓ భారద్వాజ! ఏం డ్లుగడచిన నీకుసయితమిట్టిదుర్బుద్ధి వొడమెనా.

ఉ. చిన్నతనంబునం దొడను జేయుక "రార! కిరీటిపుత్ర! నా యన్న" యటంచు నెత్తి శిరమంటుచు మూర్కొని "తండ్రికన్న పే రున్నతి గల్గువాఁడ వగుదోయి! చిరాయువు గ" మ్మటంచు నీ వన్నది నీవ నేఁటి కయథార్థము చేసెదవయ్య బాపఁడా.

ద్రౌప—ఆర్యపుత్ర! ఏలయీయధీరాలాపములు. తథాస్తుదేవరలు తథాస్తనుచుందురఁట

ధర్మ—పాంచాలీ! ఇఁక నెక్కడికొడుకు? (గురునుద్దేశించి)

గీ. చదువు చెప్పుమనుచు సంధ్య నేర్పుమటంచు, వేఁడి యప్పగించినాఁడవాఁడు
చంపుమంచు నొద్దికంపించినాఁడ నేఁ డౌర! నీకుఁ జేసులారఁ గురుఁడ.

ద్రౌప—మహారాజ! ఆచార్యుఁ డేమి చేసె. ఆ సైంధవాపశదుం డడ్డుపడకయున్న నింత మునుఁగునా.

ధర్మ—(పండ్లుకొఱుకుచు) ఓరీ! దురాత్మ! మాదుస్సహ విధవశుండయగునని కని కరించినందుకుఁ దగిన ఫల మనుభవించితిమి

ద్రౌప—దీనికొకటికేమి. పుట్టినింటినుండియు మీకనికరమునకే ఫలమనుభవిం
చుచున్నారము.

ధర్మ—మానినీ! చచ్చిన బురదపాముం గొట్టెదవేమి?

కరం—మహారాజ! ఏల యింతొందర? ఎందులకీవిచారము- పర్యవసానము తెలియక
దుఃఖింపరాదు.

ధర్మ—కరండకా! ఇంకనుం బర్యవసానము తెలియవలయునా. తెలిసినట్లేయున్నది.

గీ. అనిలసుతునకు సైంధవుం డడ్డుపడుట
యొక్కరుండు మొగ్గరంబునం జిక్కుపడుట
పదుగు రొకటయి యతనిం జంపంగ దలంచుట
యట్టి ప్రత్యుత్తరము గురుం డానతిడుట.

(ఆకాశమున)

ఓసురగరుడోరగ విద్యాధర కిన్నరకింపురుషులార! ఇంద్రాదిదిక్పాలకులార!

ఉ. చూచెదరేమి మీరయినం జొచ్చి తటాలున బ్రోవరయ్య! సం
కోచము లేక క్రీడికొడుకుం బదిమందియు నాల్గువైపులం
గాచి హయంబులం దునిమి కార్ముకము న్విదళించి సారథిం
ద్రొచ్చి రథంబు నేలంబడం ద్రోసిరి కౌరవయోధులక్కటా!

ధర్మ—(విని) హా భరతయాదవకులాధార! కుమార! నీయాపద్దశకు విమానచారులును సయి
తమెట్లుకుందుచున్నారో!

సీ. కంసాదివిమతులఁ గసిమసంగినవాఁడమేయప్రభావుండు మేనమామ
ఖరజరాసంధాది బలవద్రిపులఁగూల్చి పేరు చెందినవాఁడు పెద్దతండ్రి
కాలకేయాది రాక్షసరాజులం జంపి గణుతికెక్కినవాఁడు కన్నతండ్రి
ధనదాదు లూడిగమ్మొనరింప విష్టపత్రయ మేలువాఁడు పితామహుండు

తే. గీ. దురములోన విజృంభించి ద్రోణముఖుల, వెన్నుచూచిన జగదేకవీర్యశాలి
యక్కటా! తుట్టతుద కిట్లు దిక్కులేక, దక్కితే పగవారిచేతులకుఁ దండ్రి.

కరం—దేవా! రథాశ్వసూతకేతనంబులు తెగినంత నే శత్రువులకు దక్కినట్లె తలపో
యుదురా! నియుద్ధప్రవీణుఁడగు కుమారుండు ముష్టియుద్ధముచేతనే రిపులఁ
బరిమార్పఁగలఁడు

ధర్మ—ఓరీ! కరండకా! ఎంత వెఱ్ఱివాఁడవురా!

గీ. రథము తెగిన నొండురథ మిచ్చుదిక్కు-ను, విల్లుతెగిననొండు విల్లొసంగు
దిక్కు- లేనివాని కెక్కడివిజయంబు, ముష్టిరణ మిఁకేటికె ముష్టిరణము.

ద్రౌప—ఆసైంధవహతకుఁడే దీనికంతకును బ్రథమకారణము. లేకున్న ధురంధరు
లైనభీమాదులతో నున్నకుమారు నెవ్వరయినఁ దేఱి చూడఁగలరా?

ధర్మ—(గ్రక్కునలేచి కోపముతో) పాంచాలీ కరండకులారా! నన్ను వారింపవలదు.
తక్షణమే పోయి యాసైంధవరాజబంధువుం బట్టిబరిమార్చివచ్చెద. (ధనుస్సు
చేఁకఁబోవును)

కరం—దేవా! వలదు వలదు. తమరుపోయిన రాఁబోవు నపవాదముతోఁ గూడను
యొక యుపద్రవము రావచ్చును. (ఆకాశమున)

క. అమయి విరథుండయి ను, గ్రామున ఘనపుండు మరల ద్రౌణ్యసనితో
సామజపోతముగతి ము, ష్టీముష్టిరణంబుఁ జేయ డీకొనియె బళే!

ధర్మ—(ఆలించి యాశతో) కరండకా! వింటివా! నియుద్ధంబునకే తొడరెనఁట
నివవనములు సమస్తదేవతలు పాలింతురుగాక- నీవాక్కు-మ్మృతవాక్కు-గుఁగాక

ద్రౌప—ఆర్యకులదేవతలారా! ఇప్పుడైనఁ గుమారునకుఁ దోడ్పడుఁడు- ఓవిమాన
చరులారా! మీకు శక్తిలేదేని యీమాటలు పాండవమధ్యమునకు వినఁబడు న
ట్లయినను బలుకుఁడు-

(ఆకాశమున)

చ- గదలెవి కెరా రణస్థలిని గప్పడ వాలిలి గొంచు నిన్వురుణ్
గదన గౌరుర్చుమండఁ గృపకర్ణ ముఖుల్ "నరుపట్టి మధ్య సం
నొదవిన నేరిపై నుఱుకునో" యని భీతిలునంత ద్రౌణితే
రడ పొడి యర్యో నాకథికుఁ డాపలిమోమయి దాఁటె నుర్వికిన్-

ధర్మ—తండ్రీ! ఇప్పటికిని నిన్నుఁజూచిన కోమలమనంబులు జలదరించు నేయున్న
వా! కానిమ్ము- మేమవ్వష్టసంతుల మేని నీకేజయము కలుగవచ్చును-

(ఆకాశమున)

ఓగీర్వాణసుందరులార! మీరందరు నందంబగు పారిజాతకుసుమ మాలికా బృం
దంబులతో సిద్ధపడుడు,

ధర్మ—(ఆలించి) హృదయమా! తొందరపడకుము- ఈవిమానచారుల పలుకులు కు
మారవిజయసూచకంబు లేమా (ఆలోచించి) ఈపాపాత్మున కీర్తిమేలు తట
స్థించునా?

(ఆకాశమున)

క- ఈసునారోసముగలడు, శ్యాసనసుతుతోడ నిట్లు సమరం బమరన్
జేసి యభిమన్యుఁడా దా, శ్యాసనితోఁగలసి మెలసి స్వర్గముచేరెన్-

ధర్మ—(విని) హృదయమా! యింకనుసి గ్గులేక యూరటపడెదవేల చేయవలసినపని చేసితివి- వినదలచినమాట వింటివి- హా! భరతాన్వయరత్నదీపమ!

ఉ- తామరమొగ్గరంబునకు దారియొనర్చి కుమార! నీవు పోఁ
గా మన భీమునంగొలిచి మన సైంధవుఁడా గి దేవతా
ధామము నేఁడు చేరుటకు దారి యొనర్చి గమించుమన్న నీ
నో ముము పిల్లలొక్క పొగిడెదోడ్డ సిహాస్త్ర మరల్పఁడెవ్వఁడున్.

(మూర్ఛవోవును)

ద్రౌప—(పట్టుకొనుచున్నది)

ధర్మ—(లేచి) పాంచాలీ! పుత్రఘాతినగు నన్నంటఁబోకుము

(తెరలో)

శా. సంతోషించెదవేల యోడ్వక కురుక్ష్మానాథ! వేమందితో
నుంతైనం దరిపలేక బాలుని గతాసుంజేసి తీ వన్నవ్వ
త్యాంతము విని సైంధవ నే విజయనాశ్యక్షంబు! హాహాస్మ! మీ
యంతం బాతనిచేత నున్న దిదిలేరా! నేఁటితోఁ దీఱు న

ధర్మ—(వినుట నటించి) ఇవి యుయుత్సుని యుపాలంభవాక్యములు. (స్మృతినభినయించి) ఓహో! యామాటలువిని దురాత్ముఁడగు సుయోధనుండీ వైశ్యాంబాపత్యమున కేమియుప్పు కల్పించునో కదా! సంగరారంభసమయమున నేను విలామహాదుల సందర్శించి తదనుజ్ఞాతుండనై మరలివచ్చునప్పుడు—

ఉ. "మమ్మనరేని జేరఁగల మానసు లుండిన వారలిప్పుడే
క్రమ్మరివచ్చి చేరుదురుగా కలవారిని సేనఁజూచెదన్
దమ్ములతోడి పా" టనినఁ దా నిటఁడొయ్యన వచ్చి చేరె న
త్సన్మతు నాసుతాత్ముఁ డిటి పాకుగఁ జేసి వధించు నేమొకో!

(సంరంభముతో) ఓరీ ధనుస్సు, ధనుస్సు.

కరం—(నేపథ్యాభిముఖముగాఁజూచి) దేవా! అత్యాహిత మేమియునులేదు. అయ్యనఘుఁ డిక్కడికే వచ్చుచున్నాఁడు.

ధర్మ—కరంతకా! అట్లేని నీవరిగి పుత్రశోకమ్మునఁ గుందు సుభద్రయుఁ పతిశో
కంబున సోగులు నుత్తరయు జీవించు నుపాయము వేచియుండుము.

కరం—చిత్తము (నిష్క్రమించును)

యుయుత్సుఁడు—(తత్తరపాటుతోఁ గన్నీటితోఁ బ్రవేశించి తెరవంక గిరిగి)

క. ఒకకలగనఁ దెలవారెనె? యకటా! యిల్లలికినంత నయిపోయెనె పా
తకుకారి! పందు; వీమా, వికవికలివియెల్ల దెఱపువీక్షింప మొకో-(సమీపించును)

ధర్మ—(యుయుత్సునిం గౌఁగలించుకొని దుఃఖముతో)

మ. సగలుం బట్టలలంకరించుకొడ యానంబెక్క చో నాడువోఁ
బగలు న్రేలును భోజ్యముల్ గుడుచుచోఁ బన్నుండుచోఁ గాని ముం
దుగ నెవ్వానికిఁ బ్రీతి సల్పరుదు పార్థుండ్ వాని నాబిడ్డలా
నిఁగటా! యందఱికంటె ముందనికి నేనే పంపి చంపించితిన్.

యుయు—(తనలో) ఈయనకు నేమని యోదార్పఁగలను (ప్రకాశము) అన్నా! ఊ
రడిల్లుమూరడిల్లుము.

ద్రౌప—హా! భువనైక ధనుస్సార కిరీటికుమార! నీకొఱకుఁ బెక్కుపాట్లుపడి పెరిం
చిన శశిరేఖయందైనఁ గరుణలేకపోయెనా! దుర్భరగర్భాలసయు గోలయున
గు విరాటపుత్రి నెవ్వరికప్పగించితివి! ఎవరెన్ని యిక్కట్లు పడినను నాగర్భ
శ్రీమంతురాలవగు నోసుభద్రా! మాలదైవము నీకడుపుమంట కల్పించెనా
నీ మొగమెట్లు చూతును? ఏమనియూరడింతును?

ధర్మ—నాయనా! అభిమన్యుఁడ! పద్మవ్యూహనిర్భేదనంబగు నీపౌరుషంబు తెలు
పుటకు మాఱుగా నీతండ్రితోఁ జావా తెలుపవలసినది.

క. పకపకనవ్వుచు "సంశప్తకులం జంపితి" మటంచుఁ దగుమోము నాయొ
ద్దికివచ్చు పార్థకృష్ణుల, నెంకసులు నేనెట్లు చూడఁ గొనయుదు తండ్రీ.

యుయు—ఊఱడిల్లుము! జగదేకవీరులగు పార్థకృష్ణులు శత్రువులం జంపి చెండాడి
తుదకుఁ గాలధర్మము నొందిన కుమారునకై వగతురా! శత్రువుల కోపాటిల్లిన
వగతురు! చంపుటయుఁ జచ్చుటయుఁ గాక సంగరంబునం బువ్వులచెండ్లు విస
రుకొందురా యేమి? విపరీతకాలమున నేమిచేయఁగలుగుదుము- పగఱకొడుకు
లు మనకొడుకులవంటివారుకారా? వారుమాత్రము దుర్భరంబగు పుత్రశోక
మనుభవించుటలేదా!

ధర్మ — ఓయీ యితరకురుకుమారులకు నభిమన్యునకును సాటియగునా?

శా. ఆకర్ణాంతము లైన యా కనులసోఁ పా మోము సింగార మా
మోకాల్మీఁదికి జాఱు కేలు గన యా యుద్దీన చెక్కిళ్లు నా
యాకారంబు దలంచినన్ మఱల నెక్కెంబే? కటా! యెట్టు లీ
శోకం బుం దిగమ్రింగువాఁడ! కరుణాశూన్యు లుభద్రార్జునుల్.

సీ. సొమ్ముప్రాఁతేకుఁ జందముగల్గి చెవిఁదాఁకు వెడఁద కన్నుందోయి బెడఁగుతోడ
నిండుజాబిల్లి వెన్నెలవంటిచిఱునవ్వు తొలకించు కెమ్మోవి కులుకుతోడ
గండుతుమ్మెద రెక్కగమిచెల్వమును బిల్వసాగునూగుఁ మీసములతోడఁ
గొదమసింగముఁ బోలెఁ గొమరారుకుమరైనచదురుగల్గి నసోఁగనుదురుతోడ

తే. గీ. జక్కఁదనమునకిక్కయై చంద్రబింబ,మునకు సహపాఠి యైనపుత్త్రుని మొగంబు
పడయ నేరని పరమనిర్భాగ్యపురుష,గణములోఁ జేరెనే కుంతికాను పకట!

యము — అన్నా! ఏలవిచారింతువు? ఎవరిపిల్ల లెవరికి మంచివారుకారు? హెచ్చు
తగ్గులు మనకుఁ గాని మృత్యుదేవతకుఁ గలవా! అదియునుంగాక, పెక్కుజన్న
ము లొనర్చి బ్రాహ్మణుల సంతృప్తిపఱచెనా, లేక దేవతలచేఁ బసిఁడివానగురి
పించుకొనెనా? షోడశమహాదానములు గావించెనా? లేక సప్తద్వీపములు జ
యించెనా? శివునివిల్లు విఱిచెనా, లేక గంగానదిం దెలయించెనా? శతాశ్వ
మేధములొనర్చెనా, లేక పండ్రెండేడ్లప్రాయమున భూమికంతకు నేకచ్ఛ
త్త్రాధిపత్యముఁ గాంచెనా? వర్ణాశ్రమధర్మములు నిల్పెనా, లేక విప్రులకు మృష్టా
న్నమిడి మణులు దక్షిణయొసంగెనా? లక్షమందిభార్యలనుపలాలించెనా, లేక
యగ్ని నారాధించెనా? సత్రయాగంబు గావించెనా? లేక చిన్నప్రాయమున
సింహశరభాదమృగముల నెక్కి తిరిగెనా? భూమిసావుం జేసి పాలుపితికెనా? లే
క యిరువదియొక్కమాఱు రాజులం దునుమాడెనా? ఏమియు లేక పూపప్రాయ
మునఁ గ్రాళ్ళిన కుమారునకై యింతవనటతగునా?

ధర్మ — తమ్ముఁడా! సమస్తభోగము లనుభవించి ముదిసిచచ్చిన షోడశరాజచక్రియు
తోఁ బసివానికి సాటిలేనగునా?

ఉ. “పాండుకులంబు నిల్పఁదగువా”డని యెవ్వనినమ్మి క్రీడి యీ
ఖండన మాచరించుటకుఁ బాల్పడె నట్టికుమారరత్న మా

గండరగండఁడే మొదటఁ గాలవశంబును జెంద భూమియం
దుండి యేఁకేమి చూచుకొని యుద్ధమొనర్చెదరయ్య పాండవుల్?

ద్రౌప—(కన్నీరు తుడుచుకొనుచు) హా! కుమార! పాండవకులాంకురమని తలఁచిన నీవే ముదిసిన ప్రాణమైతివా? తల్లిదండ్రుల కేసుద్దు చెల్లించితివి? ఇఁక నుత్తర కడుపులోనున్న జరాయు పిండమా మాకు దిక్కు?

ధర్మ—పాంచాలీ! ఎంత వెఱ్ఱిదానవు? ఏల మిథ్యామనోరథంబులు తలపోసికొందువు? దుర్భరంబగు వియోగదుఃఖంబున భరించి యుత్తర బ్రతికినప్పటిమాటగదా? ఓ భీమసేనకులసహదేవులార! మీకయిన సమయోచితముగు తెలివిలేకపోయె

ఉ. అప్పఁడలంచి పోరికి వృథా సుతు నంపితిఁ జంపుకొంటి నే
నప్పుడు పోరిలో నిలిచినంతఁ బరాభవమబ్బఁగాక మా
యప్పయు నప్పయుం గలసి యప్పుడ నన్ను వదల్పకుందురే!
యిప్పుడు వానిఁ దేఁగలుగునే! భగవంతుఁడు వచ్చె నేనియున్.

(తెరలో)

చ. పడమటి కొండదాపునకు భానుఁడు చేరెఁ దహంబు సుంత వె
ల్వడె విహగవ్రజంబులు కులాయకులంబున కేగుచట్టు లే
ర్పడె ఖవరంబు మాని శిబిరంబుల కేగుఁడు సేనలార! మీ
రొడయలతోడ రేపకడ యుద్ధముచేయఁగ రండు మెండుగన్.

యుయు—(ఆకించి) ఆర్యా! భాస్వంతుండస్తమించె. ఇరుదెగలవారును బటకుటీరములకుఁ జేరుచున్నారు. మన మీ యుంటిపురంబు విడిచి కుమారమరణాభిద్యమానమానసులగు భీమసేనాదుల నూరడింపఁబోదము

ధర్మ—తమ్ముఁడా! ఒక సూర్యుఁడే కాదు నాముదిరిజగమంతయు నస్తమించినట్లేయున్నది. హా! భుజనైకవీర!

గీ. కలకలని నవ్వుముద్దు మొగంబుమఱపు, వచ్చునే తండ్రియున్నతనయుకు మాకు నెన్ని
జన్మంబు లెత్తననిన్ను గంటి, కొమరుగలవానిఁ గాంతు మే కొమరుగుఱ్ఱ!

ఓ పాంచాలీ నాకై విచారింపకుము. ప్రజ్వలితంబు లగు వహ్నిజ్వాలలంబడి "తండ్రుల రాజ్యము వల" దని పితామహుని రాజ్యమేలఁబోయిన కుమారుం జూడ నేగెదను

గీ. "ఎవరురాఁడేమి సాధుప్రిడేఁడి" యనుచు నడుగుకిఁడికి నేనేమినుడువువాఁడఁ
"గొమకునంపితి గురునాకు జడిచి" యనుచు, నతనితోఁబల్క నాకునోరాడదకట!

అదియునుంగాక.

చ. "కొడుకును బల్వురేకమయి కూల్చిరి ఘాతుకు"లంచు నెవ్వఁడో
పడిచపువార్తయు న్వినుచు, విన్నఁ గిరీటికి మేనఁ బ్రవ్వదీ
గడబిడయేల? యా వెనుకఁ గాఁచులు శ్రీగిలిరిపువ్రిజంబు పాం
ల్పడుటకునున్న యీ చెనఁటిపాపఁడను న్విని సుఖించు నంగనా!

దాసి—ఆర్యపుత్రా! మేమిదంతయును నీతోడివారమే. కాని నాకు వగచుటకుఁ బని యేమున్నది?

ధర్మ—తమ్ముఁడా! నీవుపోయి భీమసేనాదులతో సావధానులుగా నిట్లనుము—

ఆ. శక్తి గలిగిరేని సమరంబు సేయుఁడు, శక్తి చాలదేని శరణమనుఁడు
లేక యున్న రెండు లేఖలోకంబున, యందఁ గలిసియుంద మందఱమును

యుయు—అన్నా! ఈసందేశమును నేను జెప్పఁజాలను ఇతరులును జెప్పఁజాలినది కాదు. (వినుటనూచించి తనలో) అవిగో? దేవదత్తపాంచజన్యస్వనంబులు వినఁబడుచున్నవి. సంశప్తకారణ్యంబు దహించియర్జునానలంబు వెలుఁగుచుండం బోలు? పాప! నూతఁడిప్పటికీవార్త వినియుండఁడుకదా!

(అంత దేవదత్తపాంచజన్యంబులు పూరించుచుఁ గృష్ణార్జునులు ప్రవేశించుచున్నారు)

(ద్రౌపదీధర్మజులు శోకాతిశయమును సూచించుచుందురు)

అర్జు—(సంశయముతో) బావా! ఏమిది నాయెడమకన్ను వదరుచున్నది? కాళ్లు తడఁబడుచున్నవి. స్వరము గద్గదపడుచున్నది. కుంభసంభవుఁడు ధర్మసంభవున కేమి కీడు కలుగఁజేసెనోగదా! ఈశిబిరమువంకఁ జూడుము—

సీ. వందిమాగధులు కైవారంబు చేయుచున్నారేల నీజరవాథ నేఁడు?
ఆలు వేళల మ్రోయ నగునగారామ్రోఁత వినఁబడదేల గోవింద నేఁడు?
మునలఁ గన్గొని వెంక లనుసరంపరు నమస్కృతులు సేయరిదేల కృష్ణ నేఁడు?
ముత్తైదువులు మనమోపాలనుండి యారగు లెత్తరేల చక్రిధర నేఁడు?

గీ. తోయజారాతిఁ గలవిధుంతుఁడుమూఁడు, వంశుబు గ్రసింప వెలవెలఁబడిన పగిదిఁ
గానఁబడుచున్న దకట! నాకన్నఁగవకుఁ, బటకుటీరము శేలగోపాల నేఁడు?

ఏ యశుభ్రపలబు రాకుండ నామనంబిట్లు క్షోభింపను— విరాట మ్రిపదాదు లేమయినారో? కవరెల్లున్నారో? ధర్మజునిగతి యేమయినదో?

కృష్ణ—(తనలో) నాకు గ్రుచ్చుచున్న యుపాలంభ వాక్యములు విన్నది మొదలుగ నభిమన్యునివిషయమునఁ బూర్ణముగా ననుమానము తగిలియున్నది. ప్రతిక్రియ చేయుఁబూనుట కిప్పటికిప్పుడే సమయముగఁ దోఁచినది. ఆయుయుత్సుఁడంత కొక్కొంతయున్నా యామాట లుపయోగించినఁ గుమారుఁడు విధిగా నిక్కునా. ఇఁకఁ గుమారునివార్తయు. ఇటఁ గర్తవ్యమేమి? ఇక నిక్కముగాఁ దెలియుటయు నేఁగాని యిప్పుడే తెలియఁగూడదు. కావున నిట్లు చెప్పెదఁగాక. (ప్రకాశము) అర్జునా! ఏల యిట్లు దైన్యపడియెదవు?

క. నీయున్నలకుం గుశలము, నీయనుజులకున్ శుభంబు నిక్కంబుగ నే
నో యొకకొంచెము సైస్తం, బీమెడ నగు దానికింత యేటికిఁ బొగులన్.

అర్జు—(స్మృతి నభినయించి) నే నాసంశప్తకసంగరపుటలజిక్కిలోనుండ నొక్కుమ్మడిగఁ గౌరవులసింహనాదంబులు వినవచ్చినవి. అందులకుం గతమేమైయుండునో? (పరిక్రమించి శిబిరమువంక తేఱిపాఱఁజూచి కన్నీటితో)

చ. రణమొనరించి నేను శిబిరమునకుం జనుదేరఁగా వకా
రణముగఁ జంద్రబింబ మెదురం బడు పోలికఁ గన్నుఁదోయి పా
రణ మొనరించుచు న్మృదుకరంబుల నన్నుఁ గవుంగలించు న
ద్గుణములప్రోవు నేఁ డి కృపాతోరణమం దభిమన్యుఁ డిక్కటా!

(యోజించి)

గీ. గురుఁడు పన్నినతమ్మి మొగ్గరమభేద్య, మనుచు మనవారు సౌభద్రునంపిరటకుఁ
గటగటా! వాఁడు దానిఁ జించుటయె గాక, మొనవెడలివచ్చు తెఱుఁగక మోసపోయెను

కృష్ణ.—ఏల యూరకత్తలపాటు! ఇది ద్రౌపదీశిబిరముగదా! ఇక్కడ నభిమన్యుఁ డేల యుండఁగలఁడు.

అర్జు—(ఎదుటఁజూచి) నాదు దేవా! మనశిబిరంబునకు మాఱుగా ద్రౌపదీశిబిరంబునకు వచ్చితిమేమి? కలఁతఁబడిన మనంబులో నేఁ దెలియక పోయితిని. నీవునుఁ జెప్పవైతివి?

కృష్ణ—(తనలో) నామనము మాత్రము స్వస్థముగా నున్నదా యేమి. (ప్రకాశముగా) ఔను. ఇది ద్రౌపదీశిబిరమే? ఇచటఁ బాంచాలియుండునుగదా! అమెనడిగిన సర్వమును విశదమగును.

అర్జు—(స్మృతి నభినయించి) నాకుఁ బాంచాలీసదనమునకు రాఁదగినసంవత్సరము కాదు

గదా ! అయిననుఁ గనుఁగొందము. ఎవఁడురాయక్కడ?

బకో—(ఎదురొచ్చి) దేవా ! నేను బకోటకుఁడను.

అర్జు—(ఆత్రముగా) అన్నగారెక్కడ?

బకో—(తనలో) అక్కటా! యీవార్తను నే నేమని తెల్పుదును (కన్నీటితో వాక్స్తంభమును నటించుచు) దేవా అదుగో అక్కడ నేయున్నారు.

ధర్మ—హా! యభిమన్యకుమార ! హా! భువనైకశూర! (విలపించును)

ద్రౌప—అయ్యో! యెంతదురవస్థ వచ్చుచున్నది ప్రతిక్షణ కాతురుఁడై కిరీటి లోనికిఁ వచ్చునేమో? మరల భూప్రదక్షిణము చేయవలసి వచ్చును.

అర్జు—(విని శోకముతో) వాసుదేవ! ఇప్పుడైన నిజము తెలిసెనా? హా సుభద్రాకుమార!

మ “ చతురంభోధిపరీత మైనధరణి న్పాలింతు వీ” వంచు న
మ్మితి నీరీతిగ దిక్కుమాలి రణభూమిం గూలితే ! కేశవ
ప్రతిరూపం బగునీపరాక్రమము వ్యర్థంబాయె నే పోర! నా
కుశుకంబంతయు పిటేఁబుచ్చితివిగా!కృష్ణాజగన్మోహనా!

కృష్ణ—(దుఃఖమాపుకొని) అర్జునా! శోకింపకుము రణమునం దోహటిల్లకపోరు రాచవారందఱు సంతసింపఁదగినచావు శోచనీయము కాదు.

అ నీకుఁ బుత్రకుండు నాకు మేనల్లుండు, శోక మొక్కరూపనూ! యిరువుర కేడ్వ లేకపోతి నేయేను నీవలె, ధైర్యశాలి కిట్లు తగదు తగను.

గీ రాచబిడ్డకు మరణంబు రణమునందు, తప్పదని నిర్ణయించిరి ధర్మవిదులు
పలువురం జంపి చచ్చినబాలునకయి, వగవ నేఁటికి నీవంటివాఁడు పార్థ.

ఏడ్చియేడ్చి ప్రాణములు శోషించి యున్న ధర్మజునిబ్రతుకు విచారించుకొనుము.

బకో—దేవా నిజము. దేవర యోదార్పకున్న నది మొదటిచే యిది రెండవదియునగును “ఆసహాయుంబుగఁగుమారునసకింబంప నంపించితి నేఁకఁగిరీటి వెనుక మెట్లు చూతు”నని కుందుచున్న యన్నగారి నోదార్పుఁడు.

అర్జు—హా ధర్మరాజ! ఎంతపని చేసితివి?

గీ. ఎక్కడకుఁబోయెయుమనభీముఁ! డమిమైరి, కవలు; పార్షతుఁ డేమయ్యెఁగనికరంబు
లేక పసివానినొంటిగా నీకుమారుఁ, బంపఁదగునయ్య ! సంగ్రామభారమునకు-
ఓరిబకోటకా! కొడుకు పడియున్న చోటైనఁ జూపింపుము రా ?

ఉ. గాసిలియుండియుం గరడుగట్టిన నెత్తుటిలోనఁ బ్రాణముం
బాసియు వానికాంతి కనుమాయదు నిక్కము వీసమేని; రా
కాసులు వాల్గుఁ గంకల పికావిక నవ్వఁగఁ జంద్రమండలం
బే సురిపోవువాని మొగ మేగతి బూజిదఁ దోఁగియున్నదో.

(శోకావేశముతో)

మ. అకటా! దిక్కఁటి వోయెనే! నారికి మేనల్లుండు గాండీవిపు
త్రికుఁ డాచార్యునకుం బ్రశిష్యుఁ డఖిలాస్త్రజ్ఞాత గీర్వాణనా
యక పౌత్రుండు విరాటు పెండ్లికొడుకు కన్యాకుంబు గొంతెమ్మకో
రిక లిట్లాయెనో సుభద్రకుఁ గార్చిచ్చింతఁ దాకొల్పుమన్-

ధర్మ—(తెలివి తెచ్చుకొని) పాంచాలీ! కరండకుఁడేడీ!

ద్రౌప—ఉత్తరా సుభద్రల ప్రాణసంరక్షణకై నియోగింపఁబడెఁ గదా?

అర్జు—(కోపముతో) ఓరీ బకోటకా! త్రాఁచుపాముపిల్లతో సయ్యాటములాడియట్టి సా
హసమునకొడిగట్టిన మహాపాతకియెవఁడురా? వానినిప్పుడే— (అనునర్ధోక్తిలో)

ధర్మ—(సమీపించి కన్నీటితోఁ గౌఁగలించుకొని)

మ. వనజాక్షుండును నీవు శత్రువుల గెల్వన్ బోవ నాచార్య బు
ద్ధినిబద్ధం బగు నిమ్మొగ్గరము భేదింపంగఁ బంపించి నీ
తనయున్ జంపఁ దెగించె నెవ్వఁడు పుత్రద్రోహి యాబుద్ధిపా
యినవాఁ డాయవివేకి యాచెనఁటి నేఁడే చంపుమో యర్జునా!

కృష్ణ—ధర్మపుత్రా! ఊరడిల్లుమూరడిల్లుము. వానికాయువుమూడిన నీవేమి చేయఁగలవు
కాని భీమాదులు కూడఁ బోయి కావలేక పోయిరా? లేక పోనేలేదా?

యుధి—అక్కటా! పసివానినొక్కనిన్ బంపి యూరకుండుమా!

తే. గీ. గురునిభయమున రాజంతిపురము చొచ్చె, భీముఁ డాదిగ మేమెల్ల వెంటఁబోతి
మడ్డుపడె సైంధవుండట నభవదత్త, వరముచే దారిలో మాకవార్యుఁడగుచు-

అర్జు—(పండ్లుగొఱుకుచు) ఆ! సైంధవచండాల! ఎంతపనిచేసితివిరా? శత్రుశేష
ముంచు గొన్నందులకుఁ దగిన ప్రాయశ్చిత్త మొనర్చితివి.

కృష్ణ—(తనలో) ఇతనికిశోకము వీరముగా మాఱుఁగాక (ప్రకాశము) అర్జునా! "అ
గ్నిశ్శేషం ఋణాచ్ఛేషం శత్రోశ్శేషం నశేషయే' త్తని పెద్దలూరక పలుకుదు
రా? అప్పుడు పూర్తిగాఁ జంపకుండుటయే మనకీవిపత్తునకుఁ గారణమైనది.

అర్జు—(ఎదుటనున్న కేయిపై చుకొని)

మ. హరి సారథ్యము లేదు లే దకట! దివ్యాశ్వంబు లెప్పట్టునం
దిరమౌ తేరును లేద యక్షయపుఁదూణీరమ్ములా లే వొరుల్
నఱకన్ రానిధనస్సు లేదు పడఁగన్ లంకాదియున్ లేఁ డటుల్
దురమం దింకజేఁ గూల్చితయ్య కొడుకా! ద్రోణాదు లగ్గింపఁగన్

క. ఇట్టి యసహాయశూరునిఁ, బట్టినిబోఁ గొట్టుకొనియు బావా! యింక నేఁ
డెట్టులు సుభద్రఁ గనుఁగొను! నెట్టులు పాంచాలిఁ గాంచు నెటు జీవింపన్.

కృష్ణు—(తనలో) తిరిగియు నితని మనసు శోకమునే యనుసరించుచున్నదే- అవును- పుత్రశోకము దుర్నివారము- (ప్రకాశము) బావా నీపుత్రఘాతి మరణంబునన్ గాని నీకీశోక ముపశమింపదు-

అర్జు—(స్మృతి నభినయించి) అవును కృష్ణా! ఇదిగో? యిప్పటికి నా నిశ్చయము వినుము ఈ సైంధవ హతకుఁడే నా పుత్రమరణమ్మునకు మూలకందము కావున—

ఉ. కావుమటంచు ధర్మజుని కాళ్లపయిన్ బడకున్నఁ జేర్మిమై
నీవు ధరింతునం చభయ మీయక యున్న గురుండు కాఁడు గా
రీవరుఁ డడ్డమై నిలువరించునుగాక ని వెన్నుచూపుచున్
బోవక యున్న సైంధవుని బోకడఁతు ద్రవి కుంకునంతకున్.

కృష్ణు—కానిమ్ము అననేకూడదు గాని యన్నమాట చెల్లనేర్పు కోవలయుఁ గావున నీవి పుత్రశోకము మఱచి శుచివై రహస్యప్రదేశమునం బాశుపతమహామంత్రం బుపాసింపుము- ధర్మపుత్రా! నీవు నిజశిబిరంబునకుం బోయి భీమసేనాదుల నోదార్పుము నేను బుత్రశోకాతుర యగు మాచెల్లెలి నూరడింపఁజనెద

(అందఱు నిష్క్రమించుచున్నారు)

గద్య

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరు లొనర్చిన పాండవ
విజయమునందు తృతీయాంకము.



# పాండవ విజయము.



## చతుర్థాంకము.

(తెరలో)

గీ. చిత్రముగఁ బ్రొద్దుఁ జక్రంబుచేఁ గప్పి, హరి ప్రొద్దు గ్రుంకెఁగదా యిఁక బోలియు నర్జు
నుండనుచు మోసమున సైంధవుం దునిగిడి, చూడఁ దునిమించె దలకౌంతి క్రీడిచేత.

సీ. బంతి మాదిరిగా సింధుపతి శిరంబు, నటుకి యాభ్రము నుండి క్రింద బడకుండ
త్రిప్పుచున్నాఁడు కృష్ణుఁడు చెప్పినట్లు, ప్రీతిన శరవేర్పుకొన్న యాఫల్గునుండు

(ఇది చూళిక)

(పిదప యథోక్తముగాఁ గృష్ణునితో నర్జునుఁడు ప్రవేశించుచున్నాఁడు)

అర్జు—వాసుదేవా! యీతల యెచ్చటఁ బడవేయవలయునో వేగముగ సెలవిమ్ము!

క. ఒక బాణపుంఖమున వే, రొక బాణపుమొనఁ దగిల్చియుంచితి నీసా
యకమయి శ్రేణికపై, నకటా! యిటు లెంతకాల మాడింతు హరీ!

కృష్ణ—దీనికిఁ జేయదగినపని నీబాణములకు సాధ్యమగునది కాదు- "వీనితల యేమతి
పాటున ద్రుంపఁబడు" నని మున్నొకప్పు డంబరవాణి యానతీఁగా

చ. "ఎవని కరంబునుండి యిది యీయిల పైఁబడు నంతఁ దచ్ఛిరం
బవును సహస్రఖండము" లటంచు శపించెఁ దపస్వి యైన సైం
ధవజనకుండు తా; నిపుడతండు శమంతకపంచకంబుగా
న విమలనిష్ఠ నియ్యెడ ననారతమున్ జపియించు ఫల్గునా.

కావున సమంత్రకంబుగాఁ బాశుపతంబు సంధించి వృద్ధక్షత్రియుండగు నావృద్ధ
క్షత్రుని దోసిలిలోఁ బడవేగుము. అతండు ఛీ! యని రోసి నేలకుం ద్రోయఁగ
లఁడు. పదపడి వాని వ్రేలు పెట్టి వానికన్నె పొడిచినట్లగుఁగాక.

అర్జు—(అబ్బురముతో) దేవా! మంచిది. (పాశుపతము సంధించి)

గీ. క్రీడి నిష్ఠ ద నమ్మిన భృత్యుఁడేని, నీవు పశుపతి యస్త్రంబవేని దీని
సింధుపతి తండ్రి దోసిలి జేర్పుమమ్మ, వసుధఁ బడకుండ నో పాశుపతమ! నీవు

(విడుచుచున్నాఁడు)

(తెరలో)

ఋషిబాలకులారా! ఆశ్చర్య మాశ్చర్యము!

గీ. మొండితల మొండు నడుమింట నుండి యెగిరి
వచ్చి మనరాజఋషి సంధ్య వార్చుచుండఁ
జేతిలోఁబడ వాఁడు క్షితికిఁద్రోచెఁ
ద్రోయఁగాఁ దల చెక్కలై పోయె ఋషికి.

కృష్ణ—(విని) ఫల్గునా! యిఁక గృతకృత్యుండ వైతివి.

క. కురుబలమశాదు దేవా, సురబలములు వచ్చియనికిఁ జొరఁబడినను నీ
శరవహ్నిలోన మిడుతల, కరణింబడి మ్రగ్గి బూదిగ నుండురొకో.

అర్జు—దేవా నీయనుగ్రహము నే కొనియాడుకొనను. నన్నేలపొగడెదవు?

ఉ. నీదయకల్మి నే గెలువ నేర్చితిఁ గాక పురారికైన ద్రో
ణాదులు మాడ సింధుపతి నట్లొనరింపఁ దరంబె? నీవు తో
డీఁది తరింపఁజేయ నవ రెట్టిప్రతిజ్ఞను దాఁట లేరు దా
మోదర! దాసవర్గమున కూరక యిట్టిపొగడ్త చెల్లునే.

కృష్ణ—అర్జునా! యట్లుగాదు. ఓడ యెట్టిదైనఁ జుక్కానేమి చేయఁగలదు?

ఉ. ఆహవదోహలుండయి పురారి కిరాతునిభంగి నీరణో
త్సాహము చూచునాఁ డెవరు సాయము వచ్చిరి? దేవవైరి సం
దోహము నాఁగి యింద్రునకుఁ దోడ్పడునాఁ డెవ రూఁతమైరి నీ
సాహసధైర్యశౌర్యగుణసంపద గాక ధనుష్మదగ్రణి

ఇన్నిటికన్న నేఁడు నేను రణరంగమ్మునఁ దురగంబులను నీరువెట్టుటకు విడిచినపు
డు పవాతివై నీవొనర్చిన యాత్మాదిరక్షణము వేయిరెట్లధికముగఁ బొగడఁద
గినదసుమా? (చేతనిర్దేశించి) చూచితివా? కురుబలమెట్లునశించినదో?

అర్జు—(పరికించి) దేవా! ఇట్టిమిథ్యాస్తుతు లొనర్చి నన్ను సిగ్గుపఱపకుము.

తే. గీ. రాత్రి స్వప్నమిషమ్మున రజతభూధ,రమ్మునకుఁ దీసికొనిచని రాజవరాళి
చేతఁ బాశుపతాస్త్రసంసిద్ధియూధి, పఱపకున్న; నేఁ జేసి వీఁసియుఁగలదె-

అది యట్లుండనిమ్ము-

గీ. ఖరకరునిమండలంబు చక్రంబుచేత, నప్పుడ టంకశాలంబు కప్పకున్న
నాఁటలం బఖిమానము నాప్రతిజ్ఞ, తెలిపి తేట లీపాటికిఁ దెలియకున్న

మఱియు నుచితసల్లాపంబులాడి నమస్కరింపించుచు నరదంబుఁ బ్రదక్షిణంబుగాఁ బోనిచ్చి శిష్యవత్సలుం డగు నాచార్యుచేఁ గొంచెము నుగ్రహింపఁజేసితివి.

కృష్ణ—ఔను. నాలుగుపాయంబులం బగరఁ సాధింపవలయుఁ గాని యొక్క పౌరుషంబునకు సాధ్యు లగుదురా!

ఉ. ద్రోణునకుం బ్రదక్షిణముతోఁ దయవచ్చెఁగదా! యటంచు నేఁ
బ్రాణముకాచుకోఁ దలఁచి పర్వునఁ దేరటు త్రిప్పుచుండఁగా
బాణము లేయ నీవు బిగువునఁ జేతులు ద్రోయిలింప వాఁ
స్థాణుసఖుండైన మోహరము దాఁటఁగ శక్యమె నాతెఁ దక్షిణా

అర్జు—(రణరంగము చూచి విచారముతో) అక్కటా! కృపాచార్యు లిప్పటికిని మూర్ఛ దెలియనే లేదు.

మ. విలువట్టించె విశేషముల్ దెలిపె నీవిప్రోత్తముం డక్కటా!
కలన న్నన్నెదిరించఁగాక గురునిన్ గారింపఁగా నొప్పునే?
కలుషాత్ముండును బ్రహ్మఘాతి మహాకష్టుండు దుష్టుండ ని
య్యలఘుం డభ్యుదయాభిలాషి మన కయ్యాచార్యుతోఁ బాటుగన్.

కృష్ణ—ఫల్గునా! నీవితనిం గుఱిచేసినవాఁడవు కావుకదా? యాదృచ్ఛికముగా నిది తటస్థించినది. ఏలవిచారించెదవు (నిరూపించి) అదుగో నతండు మూర్ఛదేరినాఁడు. ఇఁకఁ బోదము. పద (పరిక్రమింతురు)

అర్జు—కేశవా! సుయోధను నోరికన్నఁడు గాని మాటలు వచ్చినవి? నిమిత్త మేమో!

కృష్ణ—రణాభిలాషంజేసియు ఘోరప్రతిజ్ఞాభంగ భయంబునను నీవు వెనుకఁ జూడకుంటివి గాని నేనంతయుఁ బఱికించుచునే యుంటిని. శ్రుతాయుధుఁడు తన గదచేతనే హతుఁడైనపిదప నీవు కాంభోజపతిం దెగటార్చి శ్రుతాయుర్ముఖులతో సమరము సేయుచుండఁ గురురాజాచార్యుని యొద్దకుం బోయి—

గీ. "సింధురాజును నేనురక్షింతు" ననుచు నభయమిచ్చియు నిటు సేయ న్యాయమగునె
యుతని దయచేత విడిచితి వంతె కాక, పగ్గె చేతను జొచ్చెనే యొగ్గరంబు.

ఉ. ఊరక మేను చంపుకొనుచుంటిమి కప్పములుంగు సామువై
చేసిన నిన్ను నమ్మితిని సింధునృపాలుని; లేక యున్న నీ
సోఁకి వచ్చునే యతఁడు! పుణ్యమొ పాపమొ పౌరుషంబొ ని
ష్పౌరుషమో మఱొక్కయెడఁ జాఁటున డాఁగినఁ గ్రొంద్దుగ్రింకదే.

నీ యభయప్రదానముకతనఁ గాని యతఁడు పూర్వమువలెనే యాపాండవులన్ శరణుఁ
జొచ్చు నేమో!" అని యేడ్చిన నయ్యాచార్యుం డిట్లుత్తరము చెప్పెను-

అర్జు—ఆచార్యుఁడిచ్చిన యభయము మనకు సాహాయ్యమే చేసినది. తరువాత ?

కృష్ణ—తరువాత గురు "ఓయీ దుర్యోధన! సురాసురులయినఁ గిరీటిం గెలువలేర
ని నీతోఁ బలుమాఱులు నుడివితిని. నామాటట్లుండ నీతాత గాంగేయుం డెట్టి
చింతతో శరతల్పము నలంకరించెనో యెఱుఁగుదువా?

ఉ "ఖండనమందు నాసనొక పాండవు లెంతటివారు శౌరి రా
కుండిన: నాము విల్లొకఁడె యుక్కడఁగింక యున్న యక్కటా!
దండుగ జోదులేటి? కరవంబులు నేఁటికి వాజులేల? పే
దండములేల? యింతకును ధర్మము నెగ్గక యెట్లు మానెడిన్."

ఇట్లు రోదించుచుండ దేవతలయ్యనఘుని "నీవీవీరకర్మమ్ము నుండి యుపరమింపుట
యుక్త"మ్మని హెచ్చరించిరఁట నేనంతకన్న నధికుఁడను గానుగదా?

ఉ పాపములాడెదేల కురువల్లభ! పోరఁగరాదె నీవు నీ
ప్రాపగు కర్ణుఁడుం బడుచువారలు; నే నిపుడేమి సేయుదుం
బాపఁడ వృద్ధుఁడన్ దురభిమానము చంపుకొనంగ లేక యీ
చాపము చేతఁ బట్టుకొని చావఁగ వచ్చినవాఁడఁ బోరికిన్.

అనియుల్లసమాడెను-

అర్జు—నాయందలి వాత్సల్యమే కాని యామహానుభావునియందు నేనింతవాఁడను. నిజ
ముగా నమ్మహితుఁ డభయమే యిచ్చినచో మన మాసైంధవు దెసకేనిఁ బోఁగలు
గుదుమా? ఏదో? యాయనయొద్దికిఁ బోయియేడ్చిన లోకముతోపాటు "మే
ముండ నీకేమిభయ"మని యూదార్చియుండును. తరువాత.

కృష్ణ—నీవనినట్లే పదపడి సమంత్రకం బగునొకకవచంబొసఁగి "యీనాఁడు రణంబు
న నిశ్శంకముగాఁ దిరుగు"మని యనిచె. దానన్ జేసి యాతఁడట్టి ప్రల్లదములు
నీయెదుట నుడువఁ గలిగె.

అర్జు—అదియా కారణము. ఆకవచధారణము గురుఁ డరుందుతప్ప నొరు లెఱుఁగరు.
ఆయ్యనఘుకతన నాకును నాకతన నీమేనల్లునకును నదియెఱుకపడియె (దుఃఖ
మాపుకొని స్మృతినభినయించి) నేఁడు మనయుత్తమౌజోయుధామన్యులొన
ర్చిన విక్రమము కడుశ్లాఘనీయము సుమా?

కృష్ణ—తనకత్తి విసరి యక్కటిన నిరాయుధుండై మఱియు దాఁటెనఁట. ఆయుధ
మున్నచోఁ గర్ణుఁ డవమానింప గలఁడా? (యోజించి) కత్తి చేఁజాపము తెగక
యున్న నితని నతఁడు రాకుండ వారింపఁ గల్గునేమో యని యెంచితిం గాని
గురునియెడఁ జూపినసాహస మాసందియమును దీర్చినది (నవ్వి) అరులఁ జంపఁ
మీ యన్నకు దున్నపైఁబడు చినుకులునుం గావుసుమా బావా!

అర్జు—అత్యంతఘుఁ డమాయికుఁడు గావున నే మీమీఁహాస్యవచనముల కప్పుడప్పుడవ
కాశ మిచ్చుచుందును.

కృష్ణ—అమాయికుఁడు గావున నేఁ గర్ణుడగపన్నన సె యెక్కటిఁ దాఁగియున్న న
య్యది గని పెట్టనేరక పోవుటయుఁ దుద కవమానితుఁడగుటయుఁ దటస్థించినది
లేనిచో నీవు మున్నొనర్చిన ప్రతిజ్ఞనుగూడ నితఁడప్పుడు చూచువాఁడు కాఁడు
సుమీ. దీనికేమి "పులిమీఁదపుట్ట" యన్నటులెట్లో సైంధవవధ ప్రతిజ్ఞను
నిస్తరించితిమనుకొనుచుండఁ గర్ణునితో మీయన్నకొనర్చిన యవమానమునకు బ
దులుచెప్పి యంతఁ బోక యభిమన్యువధనుగ్గడించి—

క. అని నీవు చూచుచుండఁగఁ, దునిమెద వృషసేన నీసుతుని ననిపల్కినన్
బొనరించితి వద్దానిని, మనమున స్మరియింతె? యిట్టిమాటలు పనునే.

మీ యమ్మ కడుపు చల్లగ నిందుఁ గాలనిర్ణయముమాత్రము చేయ మఱచితివి.

అర్జు—వాసుదేవ! జగదేకరక్షకుఁడ వగునీయనుగ్రహము గలనాకుఁ గాలనిర్ణయమొన
ర్చినను నయ్యది మస్తరము కాదు (స్మృతినభినయించి) బావా! దారుకుఁడు నీ
రథమ్మును సన్నద్ధపఱచి తెచ్చెనుగదా? కారణమేమి?

కృష్ణ—అర్జునా! రాత్రియట్లు చెప్పితిని. పనిపట్టినచో నేనుగూడ రథినై యుద్ధంబొ
నర్చుటకు నిశ్చయించుకొనియే యున్నాడను. నీవు జగదేకవీరుఁడవుగాన నెవ
రిసాయమును నపేక్షింపవైతివి. కాని సన్నద్ధపఱచి తెమ్మన్నందులకు భూరిశ్రవ
స్సుతో ననోన్యరథాదిపరికరమారణంబుగఁ బోరియున్న నీశిష్యుఁడు సాత్యకి
కది తిరిగియుఁ గర్ణునితోఁ బోరియోడించుట కుపయోగించినది. లేనిచో సా
త్యకి రథస్థుఁ డగుకర్ణునికి నోడవలసిన వాఁడగును.

అర్జు—ఆనాఁడీనాఁడొనర్చిన విజయములు గణించినచో నిరాయుధుఁడైకూడఁ గర్ణు జ
యింపఁ గలుగననియే నానిశ్చయము (పశ్చాత్తాపముతో) వాసుదేవా! నేఁటి
నొక యధర్మమునకు నామది కంపించుచున్నది సుమా!

కృష్ణ—భూరిశ్రవస్సు చేయి నఱుకుటకేనా? సమయజ్ఞుఁడవు కావుసుమీ? అంతపా
టియధర్మమును లేకుండ బవరము సేయువారెవ్వరు?

చ. వెదరెద నీయధర్మ మొకపెద్ద యొనర్చె రిపులగ్రణంబునం
బదుగురు కూడి బాలుఁడె యభిమన్యుఁ జంపఁగఁ జచ్చునేమి? దు
ర్మదమున నాతఁ డొత్తి నరరం బడి త్రుంపక కంటి కామయ
ప్రిదమయి వార్లు సాత్యకికబంధము చూచెదవా ధనంజయా!

అర్జు—పోనిమ్ము కృష్ణా! అంతటితోఁ బోనీక మనసాత్యకి ప్రాయోపవేశఁబున ప్రాణ
ములు విడువ నిశ్చయముకొఱకు దుముకుటకేని వ్యసనపడ వలదా?

కృష్ణ—పడవలసినదే. కృపునికై వ్యసనపడి యేమి చేయఁగల్గితివి? భూరిశ్రవుని విషయ
మునఁ బూర్వజన్మగాథగూడ గలదు. అది సావకాశముగ నీకుఁ జెప్పఁగలను.
ఆపై నీకీసందియము పోవుటయేగాక యీనాఁడు ద్రోణకర్ణాద్యనేక యోధుల
నుక్కడఁచి సర్వవిధముల నిన్నును నన్నును మెప్పించిన సాత్యకికీయుపవాస
మెందులకు ఘటిల్లెనోకూడఁ దెలియఁగలదు. దీనికేమి? ఆచార్యు నెదిర్చి నవసి
యున్న నీ పెద్దయన్నకు సైంధవవధప్రకారంబు వినిపించి యోదార్పుదము
రమ్ము. (పరిక్రమింతురు)

అర్జు—(స్మృతినభినయించి సాత్యకినుద్దేశించి) సాత్యకీ! ఎంతపని చేసితివి? నిన్ను
నమ్మిగదా? మాయన్నను ఒంటరింజేసి వచ్చితిని? (ధర్మరాజు నుద్దేశించి)

క. నలుగురుతమ్ముల మనియో, పలనుంచియు నిన్ను గురునిపాలిఁ బ్రోవం
గలవారి కాకపోతిమి, దలితాంతర్వైరిపీర ధర్మకుమారా!

కృష్ణ—ఫల్గునా! సాత్యకి రాకపోయిన భీమసేను నోడించి నీచోక్తులు పల్కిన కర్ణు
నపలించువారెవ్వరు? మనము ప్రతిజ్ఞానిర్వర్తనత్వరాయమాణ మానసులమయి
సైంధవునికొఱకు మొగంబై యుండ—

ఉ. రిపుబలమెల్ల నొక్కఁ డెదిరెన్ బెదరెం గురునాయకుం; డప
త్రప విడనాడి పాఱె యువరాజు; సుదర్శనుఁ డాదియైన భూ
మిపతులు సోమదత్తుఁడు నిమీలితలోచను లైరి కానిచోఁ
దపతపలాడదే ప్రబలతాపము చే మనచిత్త మర్జునా!

అర్జు—కృష్ణా! సైంధవవధోత్కర్షామర్షంబునఁ జూచినదియు జూడనియట్లేఁ యున్న

ఉ. కౌరవసాధుకోటిచెలికారము పెంచినకండక్రొవ్వున
న్నారుతమూతి కట్టులవమానము సేయఁగఁ బోయినావురా
మారక! నిన్ను దీనిఫలముం గుడిపింపఁగ లేకయున్న నా
పేరు కిరీటికాఁడు రిపుభీముఁడు భీముఁడుకాఁడు పూజ్యుఁడున్.

కృష్ణ—(తనలో) ఓహో! యీజిష్ణునిమనంబప్పుడే కర్ణవధపర్వము నన్వేషించుచున్నది. కాని యస్యెడ కరుగుటకు ద్రోణపర్వతము దాఁటవలయునను విషయమే యితఁడు మఱచినాఁడు. (ప్రకాశము) ఫల్గునా! మనమీ యుదంతము మహారాజునకు వినిపింప నేగుదము రమ్ము. (నిష్క్రమింతురు.)

(ధర్మరాజు జకోటకునితోఁ బ్రవేశించును)

ధర్మ—జకోటకా! తరువాత.

జకో—తరువాత వారిలోవారికే పెద్దకలహము జరిగినది.

ధర్మ—ఎవరెవరికి ?

జకో—ద్రోణదుర్యోధనులకు

ధర్మ—ముఖ్యులగువారికే? కారణ మేమి?

జకో—దేవరతమ్ముఁడు సైంధవుని దెగటార్చుటయే కారణము. భావుకమరణంబునకు శోకించుచు మొదటఁ గురురాజు భారద్వాజుకడకుంబోయి "కుంభసంభవా నాఁడట్లు శిఖండి నెదుటం బెట్టుకొని శాంతనవుం దెగటార్చిరి. నేఁడు సైంధవునిం జంపి మాటచెల్లించుకొనిరి. ఈయాలములో జలసంధసుదర్శనాది మహాయోధులు పెక్కురుమడిసిరి. నేఁటికి వాఁసేన సురక్షితముగానే యున్నది. మనబలం బేడక్షౌహిణులు రూపుమాసినది. ధనురాచార్యుండ వని పేరు పెట్టుకొని పిల్లవాఁడు చేయఁదగినపనియైనఁ జేయఁదలఁపవైతివి అన్నమాట చెల్లించుకొనలేక పోయితివి. నిగ్రహానుగ్రహములు రాజులకుఁ జెల్లుఁగాని బ్రాహ్మణులకుఁ జెల్లునా? కాక యిట్టికపటాత్ముండ వగునీవు బ్రాహ్మణుఁడవా! నీవుశత్రుపక్షమున నేయున్న బ్రతికిపోవుదుము- ధురంధరుండగుకర్ణుని వదలి మొదటనే నీకు సేనానాయకత్వమిచ్చినందులకుఁ దగినఫలముంగుడిచితిమి, నిన్నఁ "బదుగురుప్రౌఢులై యభిమన్యుని విరథుంజేసి చంపుఁ"డని యుచ్చరించితివి- నేఁడు శిష్యవాత్సల్యమున నర్జునుని మోహారంబు చొరనిచ్చితివి- సర్వవిధంబుల నీచే మోసపోయితిమి" అనియనరానిమాటల దూషింప గురుఁడరుణసరోజంబుల కనయుగు కందో

యిట్లో "నోయీ! మూఢదుర్యోధన! ఇదియంతయును నా సేనానాయకత్వమున కా! ఫలము? జూదములోనఁ దబ్బిబ్బుపాచికలాడించినందులకుఁ గాదేమి? మహాసభలో ద్రౌపదిపుట్టము లొల్చినందులకుఁ గాదేమి? సంధిచేయవచ్చిన వెన్నుని పలుకులు విననియందులకుఁ గాదేమి? చాలుఁజాలు- పాండవపాంచాలురయంపగను లోకదండ నొడలు పండింప నందుపైగడియగడియకువచ్చి నీవిట్లుడికించెదవేమి? చేతనైనయుద్ధము చేయుము. లేదా? ధర్మరాజు శరణుజొరుము, నిక్కముగాఁ బాండవులనంతలు చేసిన కరినాశ్మునకు రణసాహాయ్యము చేయవచ్చిన నేను బ్రాహ్మణుడనే కాను- అని యేమో కనలి మరలశాంతము దెచ్చుకొని కానిమ్ము. నేనిదె యుపాంచాలురం జంపక కవచంబూడుచువాఁడఁగాను. కృపాశ్వత్థామలనిట్లే యుడికింపక చని యుత్సాహంబు కల్పింపుము- నా చేతికిఁ దాఁటినవారల వారలడఁగింతు" రని యోదార్చె.

ధర్మ—అక్కటా! అట్లయిన నిఁకఁ బాంచాలురు మనకు దక్కరు కాఁబోలును. (యోజించి) పాంచాలురఁత పైపైలేరు అందులో ధృష్టద్యుమ్నుఁడసాధ్యుఁడు. అతఁడీగురునకు లొంగువాఁడు కాఁడు-

ఉ. చిన్నతనంబునం దనకుఁ జేసినయొగ్గుఁ దలంచి శిష్యసం
పన్నుఁడు కుంభజుండు మనపార్థునిచే ద్రుపదక్షితీశపుత్రునిం
బన్నువనొందఁజేయ నభిమానముచే నతఁడీకుమారునిన్
గన్నము చేసి యాగురుని జంపునిమిత్తము గాంచె వహ్నిలోన్-

బకో—నేఁడేమోకాని యితఁడు ద్రోణుని బారికగ్గమై ప్రగ్గుచు సాత్యకిచే రక్షింపఁబడియె-

ధర్మ—ఒకప్పుడెంత వారికిని బరాభవము రావచ్చును (మెచ్చుతో) శినిసోదరా? నీఋణ మెట్లు తీర్చుకొందును?

ఉ. అన్నలఁ దమ్ములన్ గలన నన్నిటఁ గాచుకొనంగఁజాలి మా
యన్నను గాచెనే యనుచు నర్జును ద్రోవది దెప్పకుండ నా
పన్నత ద్రోణు బారిఁ బడుపట్టునఁ బార్షతుఁ గాచితీవహో!
కన్నన. నిన్నుఁబోలునుపకారులు మాకెవరయ్య సాత్యకీ.

బకో—తరువాత నేఁడు కర్ణునియొద్దికరిగి "ద్రోణుఁడే! మన సైంధవు మృతికిఁ గారణుఁడయ్యె" నని దూఱనారంభింప నతఁడు "మిత్రమా! అట్లనజనదు. దైవచే మన సైంధవుని జంపె మనకన్న నన్నివిధములఁ బాండవులు లొచ్చైనను దైవబలమందు మిక్కిలి హెచ్చు. లేనిచో లాక్షాగృహదహనాదికంబు వారల కించుకేని కీడుఁ గల్పింపకుండునే" యని సమాధానపఱచె.

ధర్మ—వీరికింత తెలిసియు సంధి కెందుకుఁ గుదురనీక చెడఁగొట్టెనో!

బకో—(తెరవంకఁ జూచి) దేవరతమ్ముఁడును శ్రీకృష్ణుండును వచ్చుచున్నారు.

ధర్మ—అట్లయిన జయలక్ష్మీశోభితులగు వారిని మనమరిగి గౌరవింతమురమ్ము.

(నిష్క్రమింతురు)

గద్య

ఇది శ్రీ...తిరుపతివేంకటేశ్వరులొనర్చిన పాండవ
విజయమునందుఁ జతుర్థాంకము.



# పాండవ విజయము.



## పంచమాంకము.

(తెరలో)

శా. దీపంబుల్ వెలిఁగించి రెల్లెడల, హేతివ్రాత సందీప్తులై
బ్రాపయ్యెన్ నృపమౌళి మౌళులెసఁగెన్ భాస్వంతులై; రేయిఁ గన్
లోపించెన్ బగలయ్యె సేనలకు; ద్రోణుం డాచి భీతిల్లుచున్
వేసారెన్ యమనందనుండు కపిసెన్ వీరుల్ గురున్ గ్రీడియున్.

(ఇది మాలిక)

ధర్మ—(ప్రవేశించి లజ్జతో) ఈవిమాన చరులతప్పేమి? నేను బలాయితుండననుట యబద్ధమా?

(మరలఁ దెరలో)

మ. అను మామా! యనుమయ్య యాతులువ నేఁడంతంబు నొందింతు నా
ల్కను ఖండించుటకే నొసంగెదను ద్రోల్లంజేతు శీర్షంబు, రా
జునకున్ గల్గిన యుద్ధభారమది తీర్పన్ గాక నాయస్త్రశ
స్త్రనికాయంబు వృథాపరిగ్రహములు మీఱన్నికను నీకర్ణునిన్-

ధర్మ—(విని) రామాయణములో పిడుకలవేట్లాడుట బయలుదేరినదే? కృపగురుపుత్ర కర్ణులకేదో యవాంతరకలహము గల్గినట్లున్నది. (సంతోషముతో) మనకీ యంతఃకలహములే చాలవఱకు దైవముతోపాటు తోడ్పడుచున్నవి. నిక్కముగా నీబ్రాహ్మణత్రితయమే విజృంభించిన మనలో నెదురువారెవరు?

ఉ. కౌరవనాథుఁడుం దనకుఁ గర్ణునిబాసట గెల్పు చెందఁగాఁ
గారణ మంచు లోఁదలఁచుఁగాని నిజంబది పార్థవృద్ధికే
కారణ; మాఖలుండటుల గాఱులు పేలకయున్న నెందు దు
ర్వారులు బ్రాహ్మణు లీరణపరాఙ్ముఖు లౌదురె మాటిమాటికిన్.

(తెరలో)

గీ- అర్జునునితోడఁ బోరి సూతాత్మజుండు, విరథుఁడై యొక్కఁ గృపుతేరు, వీఁకఁ బార్థు
దాఁక నెంచు సుయోధనుదర్పధనుఁడు, ద్రోణివారించెమిగుల గౌరవమెలర్ప-

ధర్మ—పాపము! కర్ణుడు తానోడుట కంత విచారింపడుగాని కృపాచార్యుల తేరే
కనకుగతియైనందులకు లజ్జించునుగాఁబోలు (విని) తన్ను బ్రతికింప గాంచిన గు
రుపుత్రుని రారాజేమో దూఱుచున్నాఁడు-

(తెరలో)

ఉ- ఫల్గునుఁడన్న మీకుఁ గడుపక్షము తండ్రియు నీవు వానిపై
నల్గరు మీరు పార్థుతుల నాప్పుడు నేను వధింతుఁ బార్థునన్
గల్గెదుఁగాక మృత్యువో యఖండరమావిభవంబో నాకు; మీ
రల్గనుచుండుఁగాక కురురాజుపరాక్రమ ధైర్యశౌర్యముల్

ధర్మ—వారిప్పుడు కొట్లాటగాఁజూడ నక్కఱలేదు- నీవు పార్థునెదుటను నేను ద్రో
ణు నెదుటను లేళ్ళమేఁకఁ బసికిరాము-

(తెరలో)

గీ- కలదు పాండవులందుఁ; బక్షమ్ము మాకు, నయిన నదియుద్ధపుంబట్లవలికేగుఁ
జూడుపాండవసేన దూఁగాడఁజేతు, నేనుగల్గ యుద్ధమ్ము నీకేల రాజ-

ధర్మ—(విని) ఓహో! ఈగురుపుత్రుఁడు గురుని కప్పట్లను దీసిపోవువాఁడు కాఁడు
(తెరవంకజూచి) యుద్ధము కడుసంకులముగా జరుగుచున్నది- ఎవరేమి చేయు
చున్నదియు విస్పష్ట మగుటలేదు-

(మరలఁదెరలో)

తే- గీ- ఇదియులంబసుతల నీకు నిలఁచుమిత్రుఁ, డిప్పటికి డీఁకొనెఁ గొంతమింతలోన
నీదుప్రాణమిత్రుఁతెతల నీరథంబు, పైనిబడు సిద్ధమిది తాటిపండుపగిది-

ధర్మ—(సవిమర్శముగా) ఈయలంబసుఁడు మున్నరణ్యంబున యాజ్ఞసేనికి మాకును
హానిగావింప నెంచిన జటాసురుని కొడుకు కావలెను- బకాసురుని తమ్ముఁడు
ను నిజవైరివాఁడును నగు రక్కసుఁ డీహిడింబాసుతుని చే నింతకుమున్న మడిసె
ఆరక్కసుతల కురురాజు రథముపైఁ బడవైచి సింహనాదమొనర్చి కర్ణునిపై
కి గుమారుఁడరుగుచున్నాఁడు. ఇది రాత్రియుద్ధమగుటచేఁ నీరాక్షసీపుత్రు నెవ్వ
రును నెదుర్పఁజాలరు (విచారముతో) తప్పక తనప్రాణసంరక్షణకై కర్ణుఁడిం
ద్రదత్తంబగుశక్తి నీయానిలపౌత్రునిపైఁ బ్రయోగించును గాఁబోలును అయ్యో
దైవమా! నిన్నటి పుత్రశోకముపై నిదియొకటి తెచ్చిపెట్టదలఁచితివా!

చ. అరు దగుశక్తి నేఁ దలఁపుటోత్కచుపైఁ బడవైచి దానికిన్
బరు వెడఁగించుకొన్న నిది పార్థునిపై నడరించు టొప్పవాఁ
డొరిగిన యుద్ధమే యడఁగు నుర్వియు నేనికి దక్కుఁ, దక్కు భూ
వరులకుఁ జావు దప్పు, మనపార్థివు నప్పును దీర్చినట్లగున్

ధర్మ—(విని ఆత్రముతో నింద్రునుద్దేశించి) దేవా పురందర!

చ. కొడుకును బ్రోవఁగాఁ గవచకుండలముల్ హరియించితీవు వి
ప్రుఁడవయి; సైన్యమంచుఁ దలపోయక; నేఁ డదియుల్లు దీసి కొ
ల్లడఁచిన భంగియయ్యె నకటా! యిపుడీవిడిపట్టిశక్తిచే
నడచెదనందుఁ దాఁకునఁట! యాలను గోపలఁ గర్ణుఁ డర్జునున్.

హా! పార్థ! సైంధవునిం దునిమి యొకగండము దాఁటితి వనుకొనుచున్న నీకై యింకొ
కగండము వేచియున్నదా? కానిమ్ము. సర్వదా మన కార్తశరణ్యుండగు భగ
వంతుఁడే దిక్కు. ఓ వాసుదేవ!

ఉ. కావు మటంచు నీపదయుగంబు మనంబులఁ బాదుకొల్పుచుం
దేవరఁ గొల్చుచుంటిమి త్వదేకశరణ్యుల మాజిలోన మా
యేవురప్రాణముల్ నిలుపు మే దెటులైనను నంత చింత లే
దావిలమయ్యె నాహృదయ మోపడిఁ బాపఁగదయ్య కేశవా!

(తెరలో)

తే. గీ. ఎట్టకేలకుఁ గర్ణుఁ డయ్యింద్రదత్త, మైన శక్తిని భీమసేనాత్మజాతు
పైఁ బ్రయోగించుచున్నాఁడు ప్రతికెఁ బార్థుఁ డవని కైవసమయ్యె యమాత్మజునకు

ధర్మ—(విచారముతో) అక్కటా! విమానచరులార! యేమి మీ యానందము. ఆతఁడు
రాక్షసీపుత్త్రుఁడే యైనను మాభరత సంతతిలోని వాఁడే కదా? సహజవైరము
చే మీరును శౌరియు సంతసించినను—

గీ. బ్రతికెఁ దమ్ముండటన్న సంబరము కొంత, పడియెఁ దమ్ముని కొడుకన్న వంత కొంత
రెండు దెసలకు వ్రాలక యుండఁ జేయ, నడుమ నల్లాడుచున్నది నామనంబు.

(తెరవంకఁ జూచి) ఉభయసైన్యంబులును ననివార్యంబగు నిదురమత్తునఁ దమతమవాహ
నంబులపై విశ్రమించుచున్నవి. నేనును గొండొక నిదురింతుఁగాక (నిదురనటిం
చును.

(తెరలో కలకలము)

ధర్మ—(ఉలికిపడిలేచి దెసలుపరికించి)

క. తనవంశము క్షీణించెకి, ననుఁగన్నతఁ బోలెఁ జంపెఁడదె సగమైమి
ల్లన దివికిఁ బ్రాఁక నిరువాఁ, గనుసమరంబునకుఁ గవిపెఁగుంభినియుడిపెన్.

(తెరలో)

చ. దుపదుని జంపితి న్విరటుఁ దుంచితిఁ దుస్మదనింకఁ బార్థతున్
గృపవిడనాడితిం బరకుభృచ్ఛయకూలవవాగ్ని నైతి భూ
మిపతి "పృథాసుతాప్తులరుమీ" రని దూఱఁగనేల? నేఁడు శౌ
ర్యపటిమ ధార్తరాష్ట్రులజయాపజయంబులు నిర్ణయించెదన్.

ధర్మ—(విచారముతో) హా! బంధుపనుపులారా! విరాటపుపనులారా! అల్లుండ
కొఱకుఁగదా మీకీపాటు తటస్థించినది?

ఉ. అల్లునిఁజూడఁగా విరటుఁ డస్త్రిలిచేత దివంబుఁ జేరుఁగా
కల్లరపేర్మిఁబోవిడిచి హాద్రుపదక్షితిపాల! నీకుఁబోఁ
జెల్లునె? కుంభసంభవుని చేతికి లక్ష్యము చేసె నే నిసుం
దెల్లముగా నెఱింగియు మదింవలపోయక పార్థుఁడక్కటా!

ఔరా! యీదినమెంత దుర్దినము. ప్రభాతంబుననె యిట్టి బెట్టిదపువార్త వినవలసె.
ఇంకేమి దుఃఖములు తెచ్చిపెట్టునోకదా? (కోపముతో) పరమకుత్సితుఁడగును
యోధనుఁడు మాటిమాటికింబోయి పురికొల్పుటంబట్టిగాని లేనిచో నయ్యనఘుం
డు మనయెడల నింత నిర్దయాత్ముఁడు కాఁడు. (చింతించుచుండును)

ఒక సేవకుఁడు—(ప్రవేశించి) దేవా యుధిష్ఠిరమహారాజ! కృష్ణభీమార్జునులు మిమ్మొక
సారి ధనుర్బాణములు ధరియించి సమరభూమికి రమ్మనుచున్నారు.

ధర్మ—(తనలో) ఇదియేమియుపద్రవమో? గురునితో నన్ను యుద్ధము చేయుమనుటకుఁ
గాదుగద? కానిమ్ము. యథాశక్తిఁ బెనఁగుదుఁగాక (ప్రకాశము) ఇదిగోవచ్చు
చున్నాఁడను. అల్లదె ధనుస్సు, దాని నిటు తెమ్ము.

సేవ—(తెచ్చియిచ్చి) దేవా! యిట్టిటు (ఎదుటఁజూచి) మహారాజ! వారుమువ్వురు
నేలొకో సమరభూమి విడిచి యామఱ్ఱిచెట్టుక్రింద నేమేమో యాలోచించు
చున్నారు. సమీపించెదము రమ్ము. (పరిక్రమింతురు)

(అంతటఁ గృష్ణభీమార్జునులు ప్రవేశించుచున్నారు)

కృష్ణ—(ఎదురుకొని) మహారాజ! మేము నీయొద్దకు రాక నిన్నుఁ బిలువనంపినందులకు క్షమింపుము. మేమందరము నోపినకాలఁది రణంబునఁ బోర్లాడుచుంటిమి. నేఁటికి నీవంతువచ్చినది. (చేతి నాకసము చూపి) ఈయుద్ధాపన్నమార్తాండులాక నూర్ధ్వకన్న మిన్నయై కుంభసంభవుం డేగకిని దేఱిచూడరాకున్నవాఁడు. కావున నతని మాయించుటకుఁ దగినయుపాయ మాలోచింపుము

ధర్మ—వాసుదేవా! నీయుపహాస్యమునకు నేఁటికిఁ బాత్రుఁడనైతినా? గురునకు జడసి యిల్లుఁదూఱితి నని యుపేక్షించెనవారేమి? కాని మందభీతులు భరియించు మహానుభావుఁడవు నీ వేయుంటివిగదా?

భీము—భ్రాతృవత్సల! కోరిమీతో నెన్నఁడయిన నెక్కసక్కెములాడనా?

ఉ. కాలము దాఁపరించిన ప్రకారముగా నడఁగించె నెల్లపాం
చాలబలంబుఁ గుంభభవచాపవినిర్గతబాణకీల; నూ
కేలు పడంకుచున్నది చికీర్షిత మేమియుఁ దోఁచ దో మహీ
పాలక! జీవరం బిలువఁ బంపితిమయ్య రణంబులోనికిన్

కావునఁ గర్తవ్యంబు నాలోచింపుము.

ధర్మ—ఓ భీమార్జునులారా! ఓయీ వాసుదేవ! గురుండట్లు కనికరంబుమాలినను మీరు సమరనిరుత్సాహులరైనను నేనేమి చేయఁగలను? వినుఁడు—

ఉ. ఏ నెదిరింతుఁ గుంభభవు నేకరథంబునఁ బంపుఁ డట్లు కా
దేని రణంబు మాని వనదేశములందు సుఖింత మీదురా
శానిగళంబుఁ ద్రెంచుకొని సారతపోధను లెల్లకాలమున్
మానులు ధర్మశాస్త్రవచనంబులసార మునభ్యసింపఁగన్

కృష్ణ—(నవ్వుచు) బావా!

గీ. రాజు రాజుతోఁ బోరుట ధర్మంబు గాని, తదితరులతోడఁ బోరుట తగదటంచు
నాఫు గురుతోడఁ బోరుటన్ మానిరించి, యిప్పుడగ్గురుపైకి నిన్నెట్లుపనుతు.

నీవీ రెండును జేయనక్కరలేదు- కొంచెము నాకుసాహాయ్యము సేసినంజాలును-

ధర్మ—అనృతమాడుట తప్ప మఱి యేది యేనియుం జేసెద.

కృష్ణ—నాకదియే కావలసినది. వినరానిమాటలు వినిన గురుం డస్త్రసన్న్యాసము గావించును గావున నతనియొద్దకుబోయి "అశ్వత్థామ చచ్చె" ననియనవలయును.

అతండిప్పుడు తండ్రికిఁ గనుచాటగు ప్రదేశమున సమరము చేయుచున్న వాఁడు కావున నమ్మును.

చ. అడవుల కేగిన న్విభుఁడు డాగురుఁ డాపయి వీరు రాజ్యముం
గుడుతురొ? కానకేగుదురొ? కొండొక కార్యము నేయవచ్చు ని
ప్పుడు గలగండముం గడచిపోయినఁ జాతము మాఱుత్రోవఁగా
నడువకు మీనఁ గాచియును నక్కులపాలొనరింపఁ బాడియే.

మ. చదిసెం భీమగదాప్రహారమున నశ్వత్థామ పేరింటి దే
గద మాలంగను; దానిమీఁద నెపముం గల్పించి మందస్మ పై
" నదిహాస్తింద్రి" మటన్న మెల్లఁగ; ననత్యాలాపదోషంబు నుం
డదు కార్యంబు ఫలించు నంత భవదిష్టప్రాప్తి చేకూరెడున్.

అర్జు—(నిర్విణ్ణుఁడై యధోముఖుఁడై యసమ్మతి నటించుచుఁ దనలో)

క. తుచ్ఛ మగు రాజ్యమేటికి?, స్వచ్ఛం బగుయశము లేనిసౌఖ్యము ఘనమే?
విచ్ఛిన్నధర్ములైన జ, యేచ్ఛలు వెలియౌదు రకట! యిహపరములకున్.

భీమ—ఇంతకు మున్నొకసారి నేనుబోయి చెప్పితిని. గాని కార్యకారికాలేదు. ఈ శౌరి మాటలకన్న మనకాగమములును శాస్త్రములును నెక్కుడు కావు.

ఉ. బొంకని వాఁడవౌట నినుఁబోలినమానిసి లేని యాట ని
శ్శంకముగా గురుండు తనుజాతునిచావెద నిశ్చయించి యా
యంకణముం ద్యజించు నిజ మాటలఁ దెల్పుము కానఁ బాండవై
ణాంక! స్వకార్యసిద్ధి కటు లాడితి గా! యని యల్గఁ డాతఁడున్.

ధర్మ—(చెవులుమూసికొని) నారయణా! ఎంతమాటాడితిరి? ఎంతసాహసముచేసితిరి- కుమారుని చావు విని యాచార్యుఁడు బ్రదుకు ననుకొనుచున్నారా యేమి?

ఉ. తిండికి లేకపోయి పరదేశము లేగిన నచ్చుఁగాక పి
ప్రిం డడిగాక దేశికుఁడు పూజ్యుఁడు రిత్త వచించి చంప బ్రి
హ్మాండము లన్నియుం దిరుగువాఁడవె? కుచ్ఛలతోడిపాటు కా
కుండునె? ధర్మసంభవుఁడు నూరక యిట్టు లసత్య మాడినన్

ఉ. సత్యము చేతనే జగము సర్వము క్రుంగక నిల్చె సత్యమే
నిత్యము సత్యమే శుభము నీరజబంధువు నీరజారియున్

సత్యముచేత నెగడు లజస్రముఁ దప్పక యున్నవారు సౌ
మత్యము సత్యమంజెడినత్క్షపతి కెందు జయంబు గల్గునే?

అదియునుంగాక బొంకనివాఁడ ననిగదా? "నీమాట గురుండు నమ్ము" నని నుడివితిరి
నేననృతవాదనేని నా కాగౌరవ మేల యబ్బును.

శా. సత్యంబే విడనాడినం గహన వాసం బేలొకో? రాజ్యభా
గత్యాగంబది యేలొకో? చెలువకుం గారాని పాట్లేలొకో?
ప్రత్యాసంబుగ నొక్క రాజుకడ సేవావర్తనం బేలొకో?
యత్యాలోచన శాలు లీపలుకు లేలా! వీనిఁ జాలింపుఁడీ.

ఉ. "ఇంతపరాక్రమంబు వహియించిన మేము ధరింపములేము శా
సంతతయనుగ్రహింపు" మని యాయన పాలికిఁ బోయి వేఁడి నే
శాంతుని జేతుఁ గాఁగల, నసత్యము లాడఁగఁ జాల, మున్ను నా
శంతనుపుత్రి బాహుబల సంపద పెంపున గెల్చినారమే?

కృష్ణ—యుధిష్ఠిరా! నీ వజాతశత్రుఁడ వనుమాట నేఁటికిఁ దెలిసినది, ద్రోణుఁడును
భీష్మునివంటి వాఁడనుకొంటివా? భీష్ముఁడు పదియవనాఁటి యపరాహ్ణంబున
యుద్ధమిషమ్మునఁ దేరు నీయొద్దికి రానిచ్చి—

ఆ. వె. ధర్మరాజ! నీవు తప్పక నాదు హి, తమ్ముఁ గోరెదేని తడయ కిపుడె
వారువీరు నాక వీరులందఱు నొక్క, పెట్టఁ జుట్టి ముట్టి కొట్టుఁడయ్య.

ఇట్లుబోధించెఁగదా? దీనియర్థమేమి? అతఁడు నీకుఁ బితామహుఁడు, నీమేలుఁ గోరు
వాఁడు అంతేకాదేని యసహ్యనఘుండు పెనంగుటకు హేతువు కురురాజునకుఁ
దనయిచ్చినబాస విస్మృతిఁగాకుంటకుఁ గాదా? ఇఁక ద్రోణునో? నీవు శాంతుని
గావింప వారు కుపితుని గావింతురు. ద్రోణశాంతనవులకుఁ గల భేదము వీరివీరి
ప్రతిజ్ఞలను బట్టియే నిర్ణయించుకొనవచ్చును. "ఎవరినో రథికులను పదివేవురను
సంహరింతు"నని యతఁడు ప్రతిజ్ఞ చేయ నీబ్రాహ్మణుండో తనకు సేనాధిపత్య
మిచ్చెనుగదా? యని యుబ్బి నిన్నుఁ బట్టికొనుటకుఁ బ్రతిజ్ఞం బూనెను. భీష్ముం
డింతకన్న నసమర్థుఁడా? అతఁడు పూనినచో నీవుగాని నీతమ్ములుగాని నేనుగాని
బ్రదికిపోవువారమే? వా యోచింపుకొనుము—

ఉ. అనృతము లాడఁ గూడ దనునంతవివేకము లేక తాము నీ
యనుజులఁ బ్రోచినంచి సుఖులై నయుపాయము చేసినాఁడ, నీ

పని సెలవేర్పవే నీఁ జనవాడను ద్వారక కేమి లాభ? మీ
పనుజులఁ గాచికొమ్ము నిజ మాతిరియు లే కసృతంబు పల్కుటో.

ఉ "ప్రాణము పోవుపట్టున నబద్ధమునుం జను" నంచుఁ బూర్వ గీ
ర్వాణగురుండు వ్రాసె ననివార్యపరాక్రముఁ డొక్క పే ల్మిడిం
ద్రోణుఁడు రూపుమాపు మనతో యను; నల్ల వ విన్ము ద్రోణ ని
ర్వాణము లేగతిం బరిశయగర్జితము ల్పలె ప్రోఁగుచున్న వో?

భీము—మహారాజ! ఇంటికును మనయుపాయము ద్రోణకోపానలంబు చల్లారుటకుఁ
గాని ద్రోణవినాశనమునకుఁ గాదుగదా? ఆజ్ఞయుఁ గాక. అయినను,

క గురుఁడుగ దైవము చుట్టము, సరసీజాక్షుండ మనకు సకలం బిపు డా
హరి సెప్పినట్లు చేసిన, దురితము వాయుటకు బదులు దురితమనయునే.

ధర్మ—తమ్ముడా! మీరిందఱు నేకీభవించుటం జేసి యనవలయు ననుకొన్నను
నానాలుకకుద కామాటరాదు. కావున నేపాట్లు పడిమో గురుని రణరంగము
నుండి మరలింతును- మీ కందుకు? మిన్నకుండుఁడు-

కృష్ణ—(నవ్వి) ధర్మతనూభవా! నాకొఱకు జెప్పుచుంటి ననుకొంటివాయేమి?

చ గురువరుమ్రోల కేగ మది గొల్పెద వక్కట! జైసి యాలి నీ
వరిగినచో మఱింత చెడుగా నినుఁగట్టఁ బరిగ్ణ చేయఁడే
కురుపతి యొద్ద; ద్రోణు నెడకుం జనుకే ధరణీంద్ర! పాండుభూ
వరునికులంబు నిల్ప "కొకపల్కనృతం" బని గూలఁ ద్రోసెనే.

ధర్మ—వాసుదేవా! నాపల్కు లాలించి నన్ను మన్నింపుము-

చ. పలువురఁబోలి నేను బలవంతుడనై విలుపూని బుద్ధికా
శలమున మార్తురంగెడపఁ జాలుదుఁ గాని పరాక్రమింప నా
కలుకజనింప దట్లు లసమర్థుఁడ నయ్యు యశంబుఁ గొంటి నే
బలమున నట్టి సత్యమును బాసిన నేఁ దల యెత్త నేర్తునే.

భీము—కృష్ణా నే నేపోయి యింకొకసారి చెప్పిచూచెదను-

(నిష్క్రమించును)

(తెరలో)

ఓఁహో వాచాల! మారుతతనయ! ఏలపదిసారులు వృథాశ్లీలము లాడెదవు?

శా విశ్వంబు ల్చటిక్రేచెమగాఁ బడి దిశాపేదఁడయు ల్గూలి స
ప్తాశ్వంబుం గతిఁబాసె చంద్రుఁడు ఖిలుండై తార లల్లాడియు

న్నిశ్వాసంబులు లేక శోకముల బోనీ! యెన్నఁడేఁగాని నా
యశ్వత్థామకుఁ జావు లేదు గురుఁ డీ మాలాపము ల్విన్ననే

గీ. ఆడి బొంకనివాఁడు నీయగ్రభవుఁడు, వచ్చి చెప్పిన నమ్మఁగవచ్చుఁగాని
యనృతవాది వధర్మమార్గానుసారి, వేమి చెప్పిన నమ్ము నో భీమసేన!

కృష్ణు—(విని) మహారాజ! వింటివా? నీవు పోయి నిజమని నుడువకున్న భీమసేనుఁడ
నృతమాడెనను కోపంబున నుండినాడు గురుమహాతేజను నియంత దాపాలితకాఁగలఁ
డు. కావునఁ బ్రద్యుమ్ని బ్రదికించుకొనుము.

ధర్మ—(తనలో) హా! భగవంతుఁడా! నాకెంత యాపదఁ దెచ్చిపెట్టితివి.

ఉ. బ్రతికిన నాల్గునాళ్ళు "యుధిష్ఠిరుఁడు" "సత్యవాది" "ధర్మస్థిరుఁ" డన్న మేటికీ
ర్తిగలవాఁడనై ధరఁ జరించి తుద న్నృపకోటి మెచ్చు దు
ర్గతిఁ గనకుండ స్వర్గమునఁ గాఁపుర ముండఁ దలంచు నాకు నీ
యాతు కొనరించెదే కటకటా! యదునందనా పేరుమీఁదుగన్.

(ప్రకాశముగా) కేశవా! అనృతము లాడువారివంశము లంతరించుంగాని సత్యవాది
కులంబున కెన్నఁడును గీడు రాదు.

శా. సత్యం బింతయుఁ దప్పకుండిన హరిశ్చంద్రావనీంద్రుం డిటు రా
జ్యత్యాగం బొనరించియుండు దుదకు సర్వైశ్వర్యము ల్బొందఁడే
దైత్యధ్వంసక! సత్యవాక్యము సమస్తశ్రేయము ల్గూర్చు గో
హత్యాపాతకికైన శుద్ధియగు సత్యాలాపి లోకంబునన్.

(స్మృతినభినయించి తనలో) ఇట్లుగుఁ గాక. (అంజలిఘటించి ప్రకాశము)

చ. మొదటిదినంపుయుద్ధమున మోకులు వ్రేలఁగ వైచి జోడులన్
మదిఁ గని "యేను భీష్మునికి మారిన బోరు త్యజింతు" నన్న "నేఁ
జదివెద మీకు మించినయసాధ్యుల" నంటివి కావె దేవ! యి
య్యదనున నేదియో యొకయుపాయము చూడుము నన్ను వీడుమా.

కృష్ణు—ధర్మజా! ధర్మజ్ఞుండవయ్యును పొరఁబడుచున్నావు.

క. ఒకవంక ననృతదోషం, బొకవంకఁ గులక్షయంబు నుంచి గురుత్వా
ధిక మెంచి చేయుమిఁక? తా, వకనీతి కార్యంబు వెక్కువాదము లేలా.

ధర్మ—(అర్జునునిదిక్కై కోపముతో) నీ వేమియు తెలుఁగవట్లుండి వాసుదేవునిచే నా
కుఁ జెప్పించుచున్నావు కాన నామనోనిశ్చయము వినుము.

చ. ఒడఁబడఁ డీపృథాగ్రతనయుం డనృతంబు వచింపఁ; బోయి కా
రడవులలోనియద్రిగుహాలందుఁ దపంబున సర్వకాలమున్
గడపఁ గలండు గాని; భుజగర్వము చాలిన ధార్తరాష్ట్రులం
గెడపి యశోభరంబున సుఖింపఁడు శౌరియు మీరు రాజ్యముల్-

(లేచిపోవుచున్నాఁడు, సేవకుఁడు వెంటఁబోవును)

అర్జు—(తనలో) అకటా! అన్నగారు నామనంబు గుఱితింప లేక పోయిరే?

కృష్ణ—ఫల్గునా! మనపలుకులు ధర్మజునిమది కెక్కవయ్యెను. ఇఁక కర్తవ్యమేమి?

అర్జు—ఏమున్నది? సర్వజ్ఞుండవయ్యు నన్నడుగుచుంటివా?

చ. బిగుతుకఁగ నేగుదెంచునొకో? భండన మెవ్వరికేనిఁ "జాతి పో
యితి" మనుదుర్యశంబు మనకేటికి? రమ్మరదంబుఁ బోరి కా
యితి మొనరింప మాగురునియేడ్తెఱ చూతము చేతగాండీవం
బు తెగకయుండుదాఁక రణభూమి త్యజించుట వీరధర్మమే-

భీము—(పటాక్షేపముతోఁ బ్రవేశించి పండ్లు పటపటగొఱుకుచు) ఇంకను మహారాజుచే "నశ్వత్థామ చచ్చె" నని యనిపింప కూరకున్నారేమి?

క. అవనీతలంబు నిప్పాం, డవ మగు నొకక్షణమున కుంభనందనబాణో
ద్భవదావకీల లార్పం, దివురక మన మంటిమేని ధీనిధులారా!

కృష్ణ—ధర్మపుత్రుఁ డంగీకరింపమిచే నితికర్తవ్యతామూఢులమయి యూరకుంటిమి

భీము—హా! దైవమా! మమ్మీధర్మజస్వరూపమున సర్వవిధముల వేధించుచుంటివిగదా?
(ధర్మరాజు నుద్దేశించుకొని హా! మహారాజ!)

ఉ. ద్రోణుఁ డహంకరించుచు నగుంభిత మావిశిఖంబుఁబూని ప్ర
క్షోభణము న్బెట్టఁబోలు రిపుకోటిఁ గాలునిభంగి దీర్ఘని
ద్రాణముఁ జేసె ద్రోణుఁడు; విదారితదేహుల మైతిమేము; మా
ప్రాణము లీవ పాపఁగదె పాలునిచేఁ బడకుండ నగ్రజా-

(తెరలో)

క. సంశయము పలచె రాజక, వంశక్షయముల్ బొనర్పవచ్చునె? మాకం
ద్రాంశంబ కాపొకో నీ, "వోం శాంతిశ్శాంతి" యనుచుకుంటివొ యిపుడున్

కృష్ణ—(విని) ఇవి ఋషులపలుకులు. శాంతి నుపదేశించుచున్నారు. అయినను విరమించువాఁడు కాఁడు. ఇందుల కుపాయమిది (చెవిలోఁ జెప్పును.)

భీము—కృష్ణా! చక్రనిదారి చూపించి [illegible] పుత్రి

యున్నదిగదా! ఆమెకతన మనప్రి సుల [illegible] తివు.

హిడిం—(ప్రవేశించి) హా! హిడింబభాగినేయ! హా! పరిప్లు [illegible] దా! హా!

రాక్షసరాజ! ఘటోత్కచ! నీమాయలన్నియుఁ గర్ణునియెడల మాయమ్మయి పో

యునే? దైత్యవిరోధి యగు దేవేంద్రుఁ డాలుండు నిన్నుఁ జంపుటకై కర్ణుని

శక్తి యొసఁగియుండెను- ఓరీ! కర్ణ! నీనెత్తురు త్రావెదను- నీమాంసము మె

సవెదను- (ముందుఁ జూచి) ఓరే నాపతియు మఱఁదియు నన్నయు నేమేమో

యోజించుచున్నారు- గిరియన్న మీద నేకర్ణుని జంపుదుఁగాక- (సమీపించి)

ఆర్యపుత్రా! నమస్కారము కృష్ణా! నమస్కారము-

అర్జు—వధూనికా! నమస్కారము-

హిడిం—సుఖివై చిరకాలము బ్రతుకుము- (భీమునితో) మత్పుత్రఘాతి యగుకర్ణుం

జంపుటకు నన్ననుమతింపుము- దానంగాని నాకడుపుమంట చల్లాఱదు-

భీము—అందులకు నీవెందుకు? ఇది వినుము- (చెవిలో నేమో చెప్పును)

హిడిం—(శాంతించి) ఎంతపని ఇదిగో? నాయనుచరులచే మీయభీష్టము నెఱవేర్పిం

చు చున్నదానను- తప్పక కర్ణుని జంపించి నాశోకము తీర్తురుగదా?

(నిష్క్రమించును)

(తెరలో)

హాకుమార! భరద్వాజకులాంకూర!

చ. ఎడముడి యొంత చెప్పిన భవన్మృతి నమ్మకపోతిఁ గాని యి

ప్పుడు "నిజ" మంచు ధర్మజుఁడు బొంకనివాఁడు వచించె నక్కటా!

కొడుక! "చిరాయువౌదు" వని కొండికనాఁ డసినట్టిపలుకటిచ

ప్పుడు వితథమయ్యెనే? వెతలఁ బోయెనె? నాసుకృతంబు లన్నియున్.

కృష్ణు—(విని) భీమార్జునులారా! వింటిరా! ఇఁకఁ గుంభసంభవుం డస్త్రసన్న్యాస

మొనర్పగలఁడు-

పార్థ్య—(పటాక్షేపమునఁ బ్రవేశించి విచారముతో)

చ. "తనయునిచావు సత్య"మని ధర్మతనూజుఁడు వచ్చి చెప్పినపో

యివతరువాత నస్త్రగురుఁ "డీధను వేటికి దూపు లేటి" కం

చును విడనాడి కొంతవడి నూనునికై వగఁజెంది చెంది దై
వనియతి బ్రహ్మరంధ్రమునఁ బ్రాణము వాసెను యోగపద్ధతిన్.

అర్జు—(దుఃఖముతో) హా! జగదేకధనుర్ధర! హా పరశ్శతాంతేవాసివినియుక్త ధనుర్వే
దపార! హా శిష్యవత్సల! ద్రోణాచార్య!

ఉ. మంచియుఁ జెట్టయుం గఱపి మాకు ధనుర్ధరు లంచుఁ బేరు దె
ప్పించిన వాఁడవీవ మముఁ బెంచినవాఁడవు నీవ నిన్ను వం
చించి యసత్యకల్పన రచించి దురాత్ముల మైనమేము చం
పించితి మాసుయోధనుఁడు పెట్టినపో రొక కారణంబుగన్.

సాత్య—(నిరూపించితత్తఱపాటుతో) అయ్యో! అయ్యో!

క. కరవాలము గైకొని కం, ధరముం బెగఁగోసి తల యదల్చుచు మొండెం
బరదంబునుండి క్రిందికి, దొరలించెన్ వీని సెప్పుడురె పార్షతునిన్.

(కోపముతో పండ్లుగొఱుకుచు) ఓరీ! క్షత్త్రియచండాల! పాంచాలకులకలంక!

మ. దురహంకార మడంతుఁ గాచికొను మో దుష్టాత్మ! ఛీ! ఛీ! యుధి
ష్ఠిరభూపాలుఁడు విన్న నిన్నడమనుచ్చేక్ గొట్ట కట్టుండు? భూ
వరులెల్లం గని మెచ్చ ద్రౌపదియు "నీపాపాత్ముఁ డెట్లొయ్యె నో
దరుఁ" డంచుం దల వంపఁ బాండవుల కంతిస్తోమము స్రుంపఁగన్.

(ధృష్టద్యుమ్నునిపై కుఱుకఁబోవ భీముఁడు పట్టుకొనును)

ధృష్ట—(సంరంభముతోఁ బ్రవేశించి) సాత్యకీ! ఊరకున్న కొలఁది నోరికివచ్చిన ట్లెల్లఁ
బ్రేలుచుంటివి. కాని యీమహారథులలో నేరమి కావింపనివాఁడెవ్వఁడు?

చ. ఎదుట శిఖండి నుంచుకొని యేసినతూపులచే జయింపఁడే
ముదుకని భీష్ము నర్జునుఁడు; మూర్ఖ! యెఱుంగమె సోమదత్తి నీ
చదివినరీతి; ధర్మజుఁ డసత్యము లాడిన సేటివార్త; మం
చి దనకయుండురె యెవరు చేసినతప్పును వారు దుర్మతీ!

సాత్య—ఓరీ! బ్రహ్మఘ్నా? మహాపాతకీ! ఇంకను నీతల పగులకున్నదేమి? నీనాలుక
చీలికలు గాకున్నదేమి? పీనుంగుతల ద్రుంచినవాడవే నీవుఁగవు నీకభిమాన మెక్క
డిదిరా? పాండవసాల్యలకుండ వగుటచే బ్రతికిపోయితివి. లేదని—

క. కౌరవులకుఁ బాండవులకు, గౌరవ మొనరించి ఖ్యాతిఁ గన్న ధరాభ్యం
దారకునకుఁ గావించిన, నేరమికిం బ్రతుకవచ్చునే యొక్కనికిన్.





అర్జు—(నిట్టూర్పు విడుచుచు) పార్థ తా! క్షత్రియోచితము గానిపనిఁ గావించి ద్రుపద కులముఁ గూడ నలుపు గావించితివి గదా?

చ. అనృతము లాడి మేము భరతాన్వయమంతయు నిందపాలు చే
సినయది చాలదే యిటు లిసీ! దళవాయివి నీవు చేయుదే
ఘను లగు రాజు లిట్లు శపకంఠము ద్రుంచుదురయ్య! ద్రోణియున్
జనకపరాభవంబు విని సైఁచునె నీతలఁ ద్రుంప కుండునే?

భీమ—అర్జునా! మునీశ్వరులు చెప్పవలసిన నీతులు చెప్పుచుంటివి?

చ. "అనృతము లాడి మేము భరతాన్వయమంతయు నిందపాలు చే
సినయది చాలదే" యనుచు సిగ్గులు మంటివి పాప! మీవు; నీ
తనయుని యాల్గు టెవ్వనికతంబుననో తెలిపించుకొన్న చ
చ్చినవిత విప్రరేని బరికిలన చేసినఁ బోరు సాగునే-

వాసుదేవు నెదుటఁ గూడ ద్రోణిశ్లాఘనీయుఁడేమి? మీకంత యనివార్యమైనచో నతని పరాక్రమము నేను వారించెదను లెండు-

ఉ. ఎఱిఁగి యెఱుంగలేవు మదహీనపరాక్రమ మొక్క వేళ్లిల్లడిన్
న్నలుకఁ గౌరవప్రజము; నాతని మొనర్చిన కల్లలోకముల్
మారిపోయెఁ ద్రుంతు నయ్యనలు మార్పుదు సందియము మ్రిందఁజేతు నీ
గురుతనయున్ వృథామతులఁ గూర్చెదు కోరికఁ గూడ సిగ్గగన్-

ధృష్ట—(విచారముతో) అర్జునా! మీకులశీలస్వభావంబు లెఱుంగక బిడ్డ నిచ్చినప్పుడే ద్రుపదకులంబు నలుపు గావించుకొంటిమి- దానికేమి?

ఉ. బందుగ లంచుఁ దోడ్పడఁగ వచ్చిన బావమఱంది నెవ్వఁడో
ముందఱ రజ్జు లాడఁగఁ బ్రమోదము చెందుట కాక నిందసే
యం దలకొందు రయ్య భవదన్వయలు కాని! యెవర్పఁ బోలు మీ
కందనగాయ యాకనకగర్భుఁడు స్నేహము లేనిరాతి చేన్

అదియు నటుగాక—

చ. గురుతనయుండు నాశిరముఁ గూల్పఁగఁ జాలినఁ గూల్చుఁగాక నీ
వరయక యిట్లు పల్కఁదగునయ్య! గురుం గెడపింపఁగాదె యు
ధ్వరమున నమ్మఁ గాంచె ద్రుపదక్షితిపాలుఁడు; చంప కుందునే
దురమున ముక్కుమూసికొని దొంగజపం బొనరించుపాతకిన్-

క. ఈఁడితని ద్రోణభీష్మ ము, ఖలోద్ధతి; "జయమబ్బ" నంచు నుప్పొంగితివి న
య్యో! దైవము! గోష్పదమం, దేవంగా నొసఁటవ్రాసితే పార్థులకున్.

కృష్ణు—(ధైర్యముతో) ధర్మనందనా! భయపడనక్కఱలేదు క్షణమోపిక పెట్టుము. (బిగ్గఱగా) ఓ సేనాపతులార! సేనలార! అది గురుపుత్రప్రయుక్తమగు నారాయణాస్త్రంబుగలనిమఁట. కావున మీరందఱు నాయుధంబులు విడిచి వాహనంబులు డిగ్గి నిటలఘటితకరాంజలులై మ్రొక్కుఁడు. ఇదె మేము వచ్చుచున్నారము. (భీమాదులతో) ఈ నారాయణాస్త్రంబునకు నమస్కారంబు తప్పనొండు ప్రతీకారంబు లేదు. నమస్కరింపుఁడు. (అందఱు నట్లొనరింతురు)

భీము—అర్జునా! శాంతపద్ధతిప్రియకులసంభూతుండగు నీగోపాలుని మాటచొప్పున నీ పౌరుష మేటఁ గలుపుకొందువా? ప్రత్యర్థియస్త్రంబునకు శరణుచొచ్చుట ప్రత్యర్థిని శరణుచొచ్చుట కాదా? (బిగ్గఱగా దొరవంకకుఁ జూచి)

చ. అడఁచెద ద్రౌణిసాయకదవానలకీలలు సేనలార! కే
ల్మొడుపకుఁ డేను వచ్చితి (ధృష్టద్యుమ్నునివంకఁ దిరిగి)
"నమోనమ" యంచు విరోధియస్త్రమున్
గడచుట పాడి గాదు బలగర్వము చాలినఁ జాలుఁ జాలదే
నడఁగెడ మేగుదెమ్ము సమరావనికిం ద్రుపదక్షితీంద్రజా!

(ధృష్టద్యుమ్నుని చేయిపట్టి లాగుకొని పోవుచుండఁగా)

కృష్ణు—(వెంటనేపోవి పట్టుకొని తత్తఱపాటుతో) అర్జునా! అప్పుడే యస్త్రజ్వాల లితనిఁజుట్టు ముట్టుచున్నవి లెమ్ము పశాంతికై వారుణాస్త్రంబు నడ్డంబువైచి ధర్మజాదులతో నీవుఁగుండ నిటు రమ్ము.

క. చేతులు జోడింపింతము, వాతతనూజాతు చేత వడివడిగాఁ; ద
జ్జాతానలమున భస్మీ, భూతుం డగుఁగానిచో నిముసమునకింకన్.

అర్జు—(అస్త్రప్రయోగము నటించి యట్లొనర్చును)
భీము—(అందఱిని విదలించుచు మ్రొక్కక పెనఁగును)

కృష్ణు—క. ఇదియేమి నెత్తితిన మి, య్యది వారింపక విశంబ రైయునది యేనిన్
మదమతి మ్రొక్కఁడు మే మే, మదనెత్తిఁగి చరింపకున్న నసువులుకలవే.

భీము—(ఆనాకర్ణితముగా నందఱి నీడ్చికొనిపోవుచు నిష్క్రమించును)

## గద్య

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వరు లొనర్చిన పాండవ
విజయమునందు పంచమాంకము.

శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవ విజయము.



## షష్ఠాంకము.

(అంతట రథముతో శల్యుఁడు ప్రవేశించుచున్నాడు)

శల్యు—(తనలో కటకటా! ఈదుర్యోధనుండు నా రాచకొలమునఁ దలంపక నా రాచవిద్యయైన గణింపక సూతపుత్రునకు సారథ్యము చేయ నియమించె. ఇందులకు నేనంగీకరించువాఁడనుగాను గాని యీనివార్యాధుర్యమునకు లొంగిపోతిని. (సంతోషముతో) ఎల్లరాజులును విన "వాసుదేవునికన్న ఘనుఁడ"ని రారాజు నుతించుటకన్న జన్మసాఫల్యమేముండును (స్మృతినభినయించి) మున్నమోఘవచనుండగు ధర్మరాజు "మామా! నీకుఁ గర్ణసారథ్యంబు రాఁగలయది. నాఁడు పార్థునిఁ గాపాడవలయుఁ జుమా" యని పలికినపలుకులు యథార్థంబులయ్యె. నేను పాండవపక్షపాతినై సమరంబునకుఁ దోడుపడుటకై వచ్చుతఱి మధ్యేమార్గంబున సేవకాకారంబుతో నుచితాతిథ్యంబు గావించు నెపంబున నన్ను వంచించి తనవానిఁగాఁ జేసికొనిన రారాజును వంచించినను దుష్కృతంబులేదు, కర్ణుని తేరు నడపునపుడు సమరోత్సాహంబు డెంచుటకు మారనుచితంబులాడి కుంచించెదను. ఇదిగోఁ గర్ణునిపటకుటీరము? (పరిక్రమించి) ఎవఁడురా యక్కడ? రారాజు పంపున మద్రపతి రథచోదకుండై సర్వోపస్కరసంయుతం బగునరదంబుతో మొగసాల నిలిచియున్నాఁడని చెప్పుము

కర్ణు—(ప్రవేశించి సంతోషముతో) మద్రేశ్వరా! ఏమి నాసుకృతము ఇంక మిత్రకార్యంబు నిర్వర్తించుటకు సందేహమేమి? (కౌఁగలించుకొని)

చ. నలువ పురారిస్యందనమున న్మొగ లెక్కినచంద మొప్ప నా
తలి దివిషత్కులాధిపురథంబునఁ జోదకుఁడైనరీతిఁ గాఁ
జలజవిలోచనుండు తనసారథిగా నని సేయు ఫల్గునుం
దలఁపడఁ బోవు కర్ణునరదంబునఁ జేయుదె సూతకృత్యముల్.

గీ. ఏనుమూర్ధాభిషిక్తుఁడ, నితఁడుసూత, కులమువాఁడని మది రోయకు మహీంద్ర
సూతకృత్యంబు చేయుటచేత నేఁడు, కలుపుకొంటిమి చుట్టఱికంబు మనను.

చ. హరివలె నీవు సర్వహృదయజ్ఞుఁడవై నొగలెక్కియుండ సం
గరమునఁ గవ్వడింగొడరఁగాఁ గలఁక సందియమేల నాకు; గు
ర్వరభుజవిక్రమంబుఁ బరిపంథికులం బడఁగింతు మద్రభూ
వర! నరపాలగౌరవ మహంధ్యమొనర్చితి వింత యొప్పదే?

—(పైకి సంతోషము నటించుచు) రాధేయా! నీవు నుడివినపగిది మనకును మహాత్ములగువారికిని బింబప్రతిబింబభావమెక్కడిది? రథారోహకత్వరథచోదకత్వరూపధర్మంబుల నుపమ వచ్చిన రావచ్చునేమో.

కర్ణు—(నవ్వుచు) మాద్రీసోదరా! దేవతలమాటటుంచుము- కృష్ణార్జునులకైన సాటి రాకుందుమా!

శల్యు—కృష్ణార్జునుల కా దేవతలుసాటియనుటకే నాకుసందేహము- ఇఁక మనమా?

కర్ణు—(లేనిసౌహార్దముతో) సఖా! అభిమానవంతు లగునీవంటివారి కిట్లు మార్తురంబెద్ద గావించి పొగడుట తగవుగాదు-

గీ. చండభుజగర్వమున సవ్యసాచివోలె, నేను సమరంబుఁ గావింపలేనొ నీవు
తోయజాక్షునివలెఁ దేరుతోలలేవొ, సములమెటు కాము వారికో శల్య! మనము?

శల్యు—సూతపుత్ర! తోయజాక్షునివలెనో యంతకెక్కుడుగనో నేను రథంబుఁ గడపుదునేమోకాని యా యర్జునువలె నీవు సమరంబు చేయుటమాత్రము కల్ల.

కర్ణు—మద్రేశ్వరా! నా భుజబలము నేను బొగడుకొనుట కాదు- చూచెదవుకదా? కొండంతలు పలికి గోరంతలైనఁ జేయక గతించిన భీష్మద్రోణు లనుకొంటివాయేమి?

శల్యు—(ఎకసక్కెముగా) చూడకేమి? ఇన్నిదినంబులనుండియుఁ జూచుచుంటిని.

కర్ణు—చ. చపలవికీలజాలము నిదాఘమునందు వనౌఘమెల్లఁ గా
ల్చువరుస నే మహాహవములో దివినుండి సుపర్వులెల్ల సం
స్తవమొనరింప నొక్కవరుసం గడికండలు గాఁగ నేఁడు పాం
డవబలమెల్లఁ ద్రుంతుఁ గురునాథుఁడు పెంచినయప్పు దీఱఁగన్

శల్యు—కర్ణా! పేలనోరికివచ్చినట్లెల్లఁ బ్రగల్భంబులాడెదవు జయించనక్కఱలేదు

మ. గదచేతం గొని భీమసేనుఁడు మహోగ్రస్ఫూర్తిమైఁ దాఁకుచో
నుదితార్కప్రభ కన్నులం గ్రాలఁగ మన్యుజ్వాల దీపింప నీ

నను రాకవ్వడి వాఁడితూపుగములన్ గుప్పించి నొప్పించుచో
నెమరై నిల్చినఁజాలు నేల యిపు డిన్ని! యిట్టి యాలాపముల్-

కర్ణ—(తనలో) ఇతఁ డేలొకో మొదటినుండియు నసంబద్ధాలాపములే మొదలిడి యెను- సుందేయప్రకృతి గావింపనున్నాఁడో? (ప్రకాశముగా కోపముతో) శల్యా! నాకు సారథివై వచ్చి చేయవలసిన యుపదేశ మిదియా! నిన్ను నితర సారథ్యంబునకు వెక్కండ్రు మహారథులను జయింపలేదా? ఇంత దుష్టబుద్ధి వని యెఱుంగక రాజు సూతకృత్యంబునకు నిన్ను నియమించుటంజేసి బ్రతికి పోతివి. లేదని—

క. ఈశరవాలముఁ గైకొని, నీకంఠముఁ దునుమకుందునే? యాలములో
నాకరదము గడపుచు రిపు, లోకము నుతియించునంతలోఁ గపటాత్మా!
ఇఁక నోరుమెదపక తేరు వోనిమ్ము- కాదేని ప్రాణంబులకుం జెడదవు-

శల్య—రాధేయా! నేనొనర్చిన దోసఁ గేమి? సారథికి రథికహితాహితోపదేశంబు కరణీయంబు గావున నుడివితి- నీవు కుపితుండ వైనంతఁ గలదలు కలుపుటకు వెఱతువా యేమి? కలుపకున్న నన్ను లోకము నిందింపదా? ఇంతమాత్రమునకే యింతకన లేసవు నేనింకను హంసకాకీయోపాఖ్యానాదికములు పెక్కులుగా ధలుపన్యసించి నీకు హితము చెప్పవలసియున్నదే? దానికెంత కనలెదవో కదా! శాంతింపుము శాంతింపుము-

ఉ. ఉంటివొ లేవొ నీవు నరుఁడొంటరియై పసులన్ మరల్చి నీ
కంటికడన్ భవత్సహజుఁ గ్రాచినయప్పుడు; ఘోషయాత్ర వె
న్నంటినచిత్రకేనునకు నర్పణఁజేసితి దృష్టి యున్నదే?
గెంటి రిపున్ నృపాలు బ్రతికించెఁ గృపాళుఁడు క్రీడియేకదా?

ఉ. ఫల్గున పాయకాగ్ని శలభంబవు కాకుము సూతపుత్ర! నీ
వగ్గిన నింద్రసూతికి భయంబిసుమంతయు లేదిఁకాతఁడే
యగ్గిన నీకుఁదప్పదు భయం బపుడాతనయుంబుఁ జేయఁగా
కీల్గఁగఁ బోరు దేని జను మేనిదిగో నరదంబుఁ దోలెదన్

కర్ణ—(పరికించి తనలో) మనశ్శల్యాయమానంబు లగునితని ప్రతికూల వచనంబు లకు దోడు మరుత్పాతంబు లుప్పతిల్లుచున్నయవి. (ప్రకాశము)

మ. హితమంచుం బరుషోక్తులాడెదవిదీ! యీనాఁడు సారాయి త్రా
వితివో? మీకది తప్పుగాదు పతి నీవిశ్వాసము న్నమ్మి స
న్మతివంచు న్నిను సూత్రగాఁ బనుప నస్మద్వైరిఁ గొండాడుచుం
గతుకం బంతయుఁ గూలఁ ద్రోసెదవుగా? కుచ్చెళ్ళలోఁ బామవై

ఉ. ఆహవమందు నేనొరులయుక్కణఁ గోరను మద్రరాజ! క్రూ
రాహితరం బొకంట జమదగ్ని సుతాస్త్ర మొకంటఁ గృష్ణులం
దేహము బాయఁజేయుదును నిశ్చితమీమొది; యెంతగా నిరు
త్సాహునిఁ జేసెదో బరవసంబునఁ జేయుము పల్కులేటికిన్

శల్య—(కోపముతో) వెలవచ్చినఁ గులకాంతలను గూడ విక్రయించుకొను ప్రజల
కెలికవై యంగదేశ మేలుచూ తాధముండవు నన్నుఁ గల్లుత్రావితి వని యధిక్షే
పించినంత నాపరువుపోవునా? వేవురు కర్ణులు వేయి నాగబాణంబులు విడిచి
నను గిరీటికి భయములేదు- ఈయసమర్థాలాపములవలనఁ బ్రయోజనయేమి? ప
ర్యవసానం బేనెఱుంగుదును- చెప్పెదవినుము.

గీ. రథము దిగఁబడదే బవరంబు నేయు, నెడల బ్రాహ్మణశాపంబు గడవఁదగునె
కలదు భార్గవాస్త్రంబని కులుకుచుంటె, నాపరశురామ శాప మేమౌనొ కర్ణ.

కర్ణ—(తనలో నిర్వేదముతో) అర్జునపరాక్రమప్రశంసకు వెఱవనుగాని నిక్కముగ
బ్రాహ్మణగురుశాపంబులకు వెఱచుచుంటిని- (ప్రకాశముగా) శల్యా! నీభయో
క్తులచే జడియువానిని భయపెట్టుము- ఇదిగో మదీయదివ్యాస్త్రంబు "లర్జునం
డర్జునం"డని నాలుకలుక్రోయుచున్న దింకనోరు విప్పకి యర్జునుదెస కరదం
బుదోలుము (ఎలుఁగెత్తి) ఓచమూపతులార! ఓసైనికులార!

గీ. దాఁగియున్నారుకృష్ణపాండవులుజడిసి, సూత సూతిపరాక్రమస్ఫూర్తి కిపుడు
వారుగలతావు చూపిన వారి కేను, పాయనముగా నొసంగెద బహుళధనము-

శల్య—రాధేయా! నీకింత యపాత్రదాన మేల? కృష్ణార్జునుల నొకరుచూపవలయునా?
గాండీవవిముక్త శరపరంపరయే వా రున్నతావు తెలుపునది- రమ్ముపోదము.

(పరిక్రమింతురు)

(తెరలో)

క. నాయంపలియభిమానం, బీయెడఁ బ్రకటింప నెంచె దేనియు నీనాఁ
డీయవనీపతిపలుకుల, కై యలుగకుమయ్య పేర్మి నాఁడయుమయ్యా!



-(స్మృతినభినయించి బిగ్గఱగా) మిత్రమా! యుద్ధబద్ధాదరం బగుచిత్తమ్మున నొ
క్కింత విస్మృతికల్గినను నీపల్కులచే జ్ఞప్తికివచ్చినది- ఇక నితఁ డేమన్నను
నేను గోపింపను- ఇదె కృష్ణార్జునులవధించి వచ్చుచున్నాఁడను

(నిష్క్రమింతురు)

(పిదప కృష్ణార్జునులు ప్రవేశింతురు)

అర్జు—బావా! గురుపుత్రుఁడు మనముగూడ సమసితి మనియేతలఁచెనుఖామి?

ఉ. నొచ్చె శరీరమింతయుఁ దనూరుహకూపములెల్ల విచ్చె నా
కచ్చెరు వయ్యెఁ జచ్చిరి మహారథులంపలు; సేనపాఱఁగాఁ
జొచ్చెభయంబునం; గడుపు చుమ్మలువారఁ దొడంగె నుగ్రుడై
వచ్చినకర్ణుచేత మనపార్థివుఁ డెట్టివిపత్తుఁ జెందెనో.

కృష్ణ—కిరీటీ! ధర్మపుత్రుని కేమియుభయములేదు. కొంచెము విశ్రమించియే మనము
కర్ణు నెదిరింతము అందాఁక భీమసేనాదులాతనితోఁ బోరుచుందురు.

అర్జు—(లేనిసంతోషముతో) బావా! గురుతనయు పరాక్రమాతిశయంబున కర్థవాదం
బుగా ముచ్చటించితి నేగాని నీదయయు గాండీవంబు నన్నంతివఱకు విడ్వమ్చ
నకు విశ్రాంతియేల?

చ. అరదము సాగనిమ్ము తునుమాడెద శూరి మసంగినట్లు మా
ర్తురబలగంబుఁ బట్టుగలతోఁ; గడతేర్చెదఁ గర్ణు; దంతిపై
కుఱుకక మానునే యలసి యుండియు సింగము; నేటియుద్ధమే
చిరముగఁ గోరుచున్నదియుఁ జేతికిఁ బండువు సేకసుతా-

(చేయెత్తి) ఓపాండవసేనానులార! కర్ణసమరోత్సాహదోహలభుజుండగువివ్వచ్చుం
డు వచ్చుచున్నాఁడు- తొలంగకుఁడు (ఎలుగెత్తి) ఓకౌంతేయమధ్యమ! ఓ
వాయుకుమార! ఓభీమసేన! ధర్మతనయుం డెచట? నీవు కాలినడకం జనుచెం
చుటకుఁ గతమేమి? (చెవియొగ్గి) ధర్మతనయుండు రాధేయకృతపరాభవంబు
నం జెన్నుమాసి శిబిరమ్మువంక కరిగె. మేమును రథాశ్వసూతికేతనంబులు గో
ల్పోయి డీల్పడియున్నట్లో పెనంగుచున్నార మనుచున్నావా? (తలపంకించి)
వాసుదేవా! పగ్గంబులు సడల విడువుము.

కృష్ణ—మంచిది- ఇదిగో రథమతిత్వరితంబుగఁ దోలుచున్నాను (అట్లొనర్చును)

అర్జు—(సమరభూమిఁ జేటిపాఱఁజూచి యాశ్చర్యముతో)

చ. గతవిశోకఁ జేయుఁడుండెఁ గలఁ కింతయుఁ జిచ్చఱకన్ను విప్పి యా
గతిఁ బడదించెనో యనఁగఁ గర్ణునిఁ గూల్చితివే ముకుంద! నేఁ
డతని జయింపలేను మనకార్యవరముం గడతేఱకుండఁగా
బ్రతికిన కపటం బడయవచ్చు జయ స్మరదంబు ద్రిప్పుమా!

కృష్ణ—హరహరా! (చెవులుమూసికొని) అర్జునా! నీనోటనుండి యెన్నఁడును వెలువడని మాటలు వెలువడుచున్నవి. రేపటిరాత్రి మీకర్ణుఁ డేమగును.

అర్జు—అట్లుకాదు. నేఁడు కర్ణుఁడు వరప్రసాదిగా నాకంటికిం దోఁచుచున్నాఁడు

గీ. మట్టమధ్యాహ్నమందున్న పెట్టు సర్వ, కాలములయందుఁ గల్గునే ఖరకరునకు
మరలఁ జనుదెంచు నొక్కొ యామంబుగడపి, తేరుమరలింపుమా వాసుదేవ! యిపుడు.

కృష్ణ—అటులేని గర్ణకృతగురుపరాభవంబున నిందురుధర్మపుత్రుఁడుందుఁ దీర్పఁ గాపంబునం బోయి కించిత్కాలము విశ్రమింతము రమ్ము. (నిష్క్రమింతురు)

(పిదపఁ బరాభవక్లేశమనుభవించుచు ధర్మరాజు ప్రవేశించును)

అర్జు—ఎవఁడురా యక్కడ అన్నగారితోఁ గృష్ణార్జునులు వచ్చిరని తెల్పుము

ధర్మ—(విని తనలో) గూతమ్ముఁడాజన్మపాండవద్వేషి యగుకర్ణునిఁ దెగటార్చి నామనోవ్యథదీర్ప రానోపు (సంబరముతో నెదుర్కొని కౌఁగిలించి ప్రశ్నము)

ఉ. ఎన్నఁడు కర్ణుఁడీల్గు! మనకెన్నఁడు యుద్ధభరంబు తీఱు! నా
కెన్నఁడు సంతసంబు ఘటియించు నికెన్నఁడెకన్నఁడంచు నా
పన్నఁడనై మురారిపదపద్మము లాఱవిభక్తిఁ గొల్వనా
చెన్నఁటి నేఁటికిం దగుట చేకుఱెనయ్య యనుంగుఁదమ్ముడా.

కృష్ణ—ధర్మపుత్రా! వాఁడెన్నఁడు మీచేతఁ బగగొనెనో వాఁడేగతాసుఁడయ్యెను.

ధర్మ—(నిట్టూర్పునించి) వాసుదేవా! వాఁడునన్నుఁ బలిచిన ప్రాల్లు మఱచెదనన్నను మఱపురాకున్నవి. జూదమాడించుట ద్రౌపదిని భంగపఱచుట మొదలగునెగ్గు లటుండనిమ్ము—

ఉ. మీరెడ యైనకాలమున మీఁదికి వచ్చి సిడంబుఁద్రెంచి నా
తేరును సారథిం దునిమి దీప్తశరంబులఁ గాయ మత్యస్ప
గ్ధారలు గాఱుగాయములుగా నొనరించియుఁ జంప కెన్నియో
నోరికి వచ్చినట్టులని నొవ్వడచెం బలుపల్కు కేటికిన్.

అర్జు—(దుఃఖముతో) కడచినపనికి వగచిన ఫలమేమి? మేమిందఱ మున్నను దమునిఁ బరాభవంబు రాకుండఁ జేయ లేక పోతిమి.

చ. కురుపతియొద్ద నిన్నుఁ గయికోఁగఁ బ్రతిజ్ఞయొనర్చినట్టి యా
గురుఁడు పరాభవించు ననుకొంటిమి వాఁడది యీఁగి తెట్లొ సా
గరములఁ బెద్దయేఱులను గాల్వలఁ బోవఁగ దాఁటి యింటిముం
దఱిచిఱుగోతిలోఁ బడిన నావికుచందము వచ్చె నక్కటా!

కృష్ణ—విధి దురతిక్రమణీయతం జేసి యొక్కొక్క తఱి నిట్టి తలఁప రానియవస్థలు తటస్థించుచుండును.

ధర్మ—కృష్ణార్జునులారా! ఏల యప్రస్తుతవిచారము? ఏల గతజలసేతుబంధనము

చ. అలయుదు మీశరీరమిసుమంతయుఁ గూలిని గ్రిణిసేయునా
కులువ బలంబునం గెలుపు దుర్లభ; మేగతి వాఁడు వచ్చెనో
బలుఁడుఁడు నాదువీనులకుఁ బండువు సేయుఁడు వానిగూర్పు క
న్నులనిదె వ్రేలుచున్నది మనోధృతి చాలనిభీతి పెంపునన్.

అర్జు—(తనలో) ఈయనఘుండు కర్ణుఁడు తెగటారె ననియే తలంచుచున్నాఁడు. (ప్రకాశముగా వినయముతో) అగ్రజా! మీకు భీమసేనుఁడేలమ్ముఁడు. కాని నేనుగాను. గురువధజనితద్విగుణీకృత క్రోధాతిశయంబున మొన్నటి నుండియు నశ్వత్థామ మండిపడుచుఁ దళ్ళుచు నన్నుండాఁకుచుండును. నేఁడెట్టకేలకు నతనిఁ గడచి భవద్వీక్షణంబు గావించుతఱి భీముండు మీపడినపాటు దెలుప జేవరనేమం బరసి పోదునని వచ్చితిని. నాతప్పు సైరింపవలయును.

చ సెలవిడి పంపినం గదనసీమకుఁ బోయి విరోధివర్గముం
గలఁచి కురుక్షితీంద్రసముఖమునఁ గర్ణని నేఁడు నేలకుం
బలిమిడి సూర్యుఁ డస్తగిరిమాటున కేగకి మున్న మీపదం
బులు విలసత్కిరీటమణిపుంజము చేత నలంకరించెదన్

ధర్మ—(దుఃఖముతో) తమ్ముఁడా! కర్ణుఁడు భీమాదులనే కాక నన్నుఁగూడ బరాభవించెనని వినియు వానిం జంపక నాసేమం బరయ వచ్చితివా?

చ. సమరమునందు శత్రువులఁ జంపక శత్రులచేతఁ జాక జీ
వను ధరియించి త్రిమ్మరుకవం బగుక్షత్రియజాతివానినే

మ మడుగ నేల? శత్రుజనమారణకర్మనిబద్ధకంకణ
క్రియు లగువారలే మడుగం దగుఁ గాక ధనుర్విదగ్రణీ.

గీ. రాధకొడుకట్టులన్నుఁ బరాభవించి, యందుఁకు నేను దుఃఖంబుఁ జెందవలట!
చేతఁ జిక్కిననన్ను హింసింపకుండ, వదలినందుల కేనింక వగవవలయు.

కృష్ణ—ధర్మపుత్త్రా! ఏల వృథాపరిసంగంబు గావించుకొనెదవు. నేను మరయవచ్చు టయుఁ దప్పాయెనా యేమి?

ఉ. ద్రోణికరక్షితంబుల ధరంపడి యుంటిమి కాన సైనిక
త్రాణ మొనర్ప నీయనుఁగుఁదమ్ముని భీముని బంచి నీపరి
త్రాణ మొనర్చి నేడటు పదంపడి యేగఁ దలంచి వార మీ
ప్రాణముఁ గాచుకోఁదలఁచి వచ్చినవారము కాము పార్థివా!

చ. అలయిక గొంటి నేను పదియారుదినంబులనుండి శత్రు దో
ర్బలమునఁ గాదె? కర్ణుఁ డొకపట్టున నిన్నలయించినంత నే
కరవరపాటుతో నొరులకష్టసుఖంబులు చూడనైతి నేఁ
డలఁతిగఁ జచ్చునయ్య వివిధాస్త్రధురంధరుఁ డాతఁ డల్పుఁడే.

ధర్మ—కృష్ణా! సమయోచితము లగుమాటలతో నేమిలే. కర్ణుఁ డలంతిగఁ జచ్చువాఁడును గాఁడు. ఈయర్జునుఁ డతని జయింపఁ దగినవాఁడును గాఁడు.

చ. అని యొనరింపఁ బోవుసమయంబునఁ "గర్ణుని గెల్చువార లీ
మొన నెవ" రంచు నే నడుగ మోసము చేసె నితండు "నేను నే"
నని నను; లేకయున్న విపినాంతరభూమికి వచ్చి తాఁక నే
ర్చునె? నిశితాంబకంబులను సూతకులీనుని బోటుమాటలన్.

చ. కొడుకులనిర్వురన్ గనియెఁ గుంతి ముదున్; బయి కాను పక్కటా!
పడుచయి పుట్టకేల మగవాఁడయి పుట్టెనొ పుట్టెఁగాక ము
న్నడఁగినపుంస్త్వ మేటికి బయల్పడెనో? పడెఁగాక యూరకే
బడుగు కరంబు గాండివము పట్టఁగ నేటికిఁ జెప్పు మచ్యుతా!

హా! పితృవత్సలులార! అభిమన్యు ఘటోత్కచులార!

మ. పినతండ్రిన్ సహదేవునిన్ నకులునిన్ బెత్తండ్రిని న్నన్ను దు
ర్జనమూర్ధన్యుడు కర్ణుఁ డట్టులు ధనుర్జ్యాబంధనోచ్చండ వా

ఘనవిర్ఘాతములన్ గలంచి బ్రతుకంగా నేర్చునే? యింతద
న్కౌను మీరిర్వుర్తో యొక్కరో తుదకు సంగ్రామంబునం ముండినన్.

—మహారాజా! సర్వధర్మంబు లెఱింగిన తమరే యీలీల నశ్లీలోక్తులు పలికినంగా
దన్నఁ జాలువా రెవరు?

చంపెద నంటేఁ, జంపెద విశాంపతు లందఱు చూచుచుండఁగాఁ
బంపుఁడు మమ్ము, భీమునకు భార మగుఁ గదనంబు, చాలు మీ
తెంపును జంపు, జానునకు దెల్పెద మద్భుజవిక్రమంబు, మ
న్నింపుఁడు తమ్ములందు దయ నింపుడు తెల్పుఁడు కోపవల్లికన్.

—అర్జునా! మరల నాయుం దేటికి మగబీరము లాడెదవు.

కుంభభవుండు నీవలనఁ గూలెనొ? భీష్ముఁ గూల్చి విక్రమో
త్తంభన మాచరించితివొ? తామరసాక్షునితోడు లేక యా
శంభువరప్రసాది యగు సైంధవుఁ దున్మితొ నీవు సంగరా
రంభమునుండి యిందనుక వ్రచ్చినశూరుల పేరు దెల్పుమా

10 బహుటచే గాండీవంబుపరువును నీకు సారథియగుటచే హరిమర్యాదయుఁ
గూడ రూపు మాసినవి—

. రథినై తామరసాక్షుఁడు, పరిధనము గావించు గాండీవంబొసఁగును సా
రథినై నడపును తేరే, విధమునఁ గర్ణుండు కుంగు వీరన్నవ్వా!

—(కోపముతో వాలుఁ బెఱికి) కృష్ణా! ఇందుల కే మందువు?

. మాలిమి మాలి యితఁ డనుమాటలకన్నిటి కింతసేపు నేఁ
దాలిమిఁ బూనియుంటి నికఁ దప్పుఁడఁగా నితఁ డన్న గాఁడు నె
వ్వేల "శరాసనం బొరుల కి" మ్మను వానిఁ; వానికంఠ మీ
వాలునఁ ద్రుంపఁగాఁ బ్రతిన వట్టితిఁ గావునఁ ద్రుంతు నీతనిన్.

(ధర్మరాజుమీఁద కుఱుకఁబోవును)

—(నవ్వి) పార్థా! ధర్మపుత్రునిం జూచి కర్ణుఁ డనుకొంటివా యేమి?

. అన్న జగత్ప్రసిద్ధుఁడు మహాత్ముఁడు ధర్మపరుండు సత్యసం
పన్నుఁ డుదారమానసుఁడు వైరిపరాభవఖిన్నుఁ డౌచు ని
న్నన్నవి పాటిగాఁ దలఁతు రయ్యా! ప్రతిజ్ఞ విరోధిమీఁదఁగా
కెన్నక యన్నదమ్ములపయి న్నెఱవేర్తురటయ్యా! ఫల్గునా!

అందును సూక్ష్మధర్మ మాలోచింపుము. హింసావిషయక ప్రతిజ్ఞ కొఱవేర్పకున్నను పాతకంబు రానేరదు. అదియునుంగాక ద్రోణవధోపాయోపన్యాసంబున మన మయ్యనఘున కుపదేశించిన పలుకు లప్పుడే మఱచితివా?

అర్జు—(యోజించి) కృష్ణా! నే నేమితప్పు చేసితినని నా గాండీవం బొరుల చేత కిమ్మనెను (ధర్మరాజుం జేయెత్తి పొడుచుచు)

ఉ. ద్యూతములోన రాజ్యము సుయోధనుపా లొనరించి కానన
వ్రాతము లేలఁ బోయిన? రాసవు నీ వని కేగ నేల? రా
ధాతనయాశుగోత్కరవిదారితవిగ్రహతాగ్రహంబునన్
నీతి వారంగ నేల? నను నెట్టన దట్టఁగ నేల? ధర్మజా!

సీ. నీమూలముననఁగదా నెలఁతకుఁ గొల్వులోఁ గారానియిబ్బంది కలిగె నాఁడు
నీమూలముననఁగదా నిన్న మొన్నటిదాఁకఁ బడరానియిక్కట్లు పడితి మేము
నీమూలముననఁగదా నిలువ నీడయులేక గొంతిగూర్తురయింటఁ గుడువవలసె
నీమూలముననఁగదా నేలఁ బాసితొలంగి పదిపదాఱేండ్లు వెంబడినకొడుకు
భరతకులగౌరవంబును బాండురాజు, గౌరవంబును దమ్ములగౌరవంబు
నో నడచెనార! నీపాలఁ బోయెతనము, దళితనిజయోధబలతేజ! ధర్మరాజ.

కృష్ణ—ధనంజయా! భ్రాతృవధోత్సాహమింకఁ జాలింపుము, నీపంతము చెల్లెఁగదా.

క. అక్కసమునఁ జంపెదనని, నిక్కముగాఁ బంతమిడియు నిందించినచో
జక్కడుట యే యగు నని, పక్కణిఁ జెప్పరు పెద్దవారు కిరీటీ.

ధర్మ—గోవిందా! ఏల వారించెదవు? కత్తి దూయనిమ్ము. కంఠము దునుమనిమ్ము.

గీ. సోదరుల బాధపఱచిన సూడు కాఁడు, పాతకుఁడు ధర్మరాజే బలబ్రతుకవలయుఁ
"గర్ణునకుఁ జాల కన్నె నే కలిమసంగె, బళిర!" యని పిరువడు తని బావమఱఁది

అర్జు—(పశ్చాత్తాపముతో) కృష్ణా! యేనిప్పు డగ్రజుం గినిసి పలికినయప్రియంబులకును నింపనుకఁ గర్ణునిం జంపకుండుటకును దగినప్రాయశ్చిత్తంబుగా నాగొంతు కోసికొనియెదను. (కోసికొనఁబోవును)

కృష్ణ—(వారించి) విజయా! మతిభ్రంశమాయెనా! గ్రహగ్రస్తుండవైతివా? లేక కర్ణు నెదిరించుటకు జంకుచుంటివా?

అర్జు—ఆర్యా! త్రిశూలపాణి యగు శంకరుండు వచ్చినను నే జడియువాఁడ గానని యెఱింగియు నన్ను గేలిదను సేయుచున్నావా? యాగార్ధం బగుహాయంబులో

సప్తద్వీపాక్రాంతం బగుభూవలయంబంతయుఁ దిరిగి యీధర్మనందనునిచే రాజ సూయంబు చేయించినవా రెవరు? ఈమహారణంబునం గించిదవశిష్టంబుగాఁ ద్రిగర్తసేననంతయుఁ జిందఱవందఱ గావించిన వా రెవరు? మున్నుత్తరగోగ్రహణ కాలంబున ద్రోణకృపాశ్వత్థామకర్ణదుర్యోధనదుశ్శాసనప్రముఖమహారథికులయు ష్ణీషంబులు తెగఁగోసి యుత్తరకు బొమ్మపొత్తికలకై తెచ్చియిచ్చినవా రెవరు? మదీయగాండీవ ప్రయుక్తశరధారచేఁ గురుసేనయెట్లు పీనుఁగు పెంటలై యున్నదో కన్నులున్నవానికిఁ దెలియఁగలదు. కానీ యీసూతాత్మజునిం దునిమిన పిదపనే ప్రాయశ్చిత్తంబుఁ గావించుకొనెదను (ధర్మరాజా దిక్కై) దేవా!

చ. కలువలదాయ యస్తగిరి గప్పరకుఁ జొరకుండఁ గర్ణునిం
బలుగురలోనఁ జంపి మురవైరి కొసంగెద గాండివంబు; నా
పలుకులు విశ్వసింపుము సభాజనయోగ్యుని నన్నుఁ గిన్కమైఁ
దెలియక కొన్ని కార్లఁబలికితిం గరుణింపుము నీకు మ్రొక్కెదన్.

కృష్ణ—(చిఱునవ్వుతో) అర్జునా! కర్ణవధయే యవశిష్టముగాని యాత్మహత్యనిప్పుడే జరపితివి. ఆత్మస్తుతి యాత్మహత్యతో సమానమయినదేగదా?

ధర్మ—అర్జునా! నేఁ గరుణించుటకు నీచేసినయపరాధమేమి? నీనుడివినపనులలో నేను జేయనిదేది? ఎన్నితప్పులేనియు నాయందేకలవు.

ఉ. ఏనసమర్థుఁడన్ ధరణి నేలఁగఁ జాలఁ దపోనిరూఢికై
కాననసీమకున్ జనెదఁ గర్ణునిఁ ద్రుంచెదవో? కర్ణుచేతనే
ప్రాణము గోలుపోయెదవొ? భండనభూమిఁ గిరీట్యజింతువో?
పూనినమానమున్ విడిచి పోయి సుయోధను నాశ్రయింతువో.

(దిగ్గున లేచి పోవును)

కృష్ణ—(పట్టుకొని) ధర్మపుత్రా! ఎవరిమీఁద నీయాగ్రహము? నిజముగా రాజ్యమేమిట కంగీకరింపవేని—

ఉ. అనుజులచేత శత్రువుల నందఱినిం గెలిపించి వాయునం
దను నవనీంద్రుఁ జేసి విపినంబుల కేగుము సంగరమ్ము కో
రి నడుమ మాన్పఁగాఁ దలఁతురే నృపవీరులు! రాజ లేచి పో
యినఁ బగవారికిన్ విజయమే యిఁకఁ దక్కురు పోర నేటికిన్.

ధర్మ—వాసుదేవా! నీసంగరంబు మాన్పుట కిది యేమఁబ్రవర్తింపఁ జేసినదా?

చ. సంధియొనర్తు మన్నను దిసంతులు గొట్టినవారు లేరె? గ
ర్వాంధులు నీవెఱుంగవె? జయాపజయంబులు నావి కావు ని
ర్బంధము చేతఁగాదె సమరంబునకుం దల యూఁచె నీతఁడో
గ్గంధుఁడు ధర్మరాజు కృపాకసముద్రుఁడు నా సుతుండు బంధు కోటిలోన్

అర్జు—(సిగ్గుచేఁ దలవంచుకొనును)

కృష్ణ—నిర్బంధము చేతనే నేఁటి కీపయనము మానుము- ఈతప్పులన్నియు నావిగాఁ దలంచి దయాంతఃకరణంబున నన్ను జూడుము- నీకివే పదివేలవందనములు- (మ్రొక్కును)

ధర్మ—(లేచివచ్చి పరిష్వంగనముతో) కర్ణశరాఘాతుల తాపహతు లగునవయవంబులవలని వికారంబునం గలుషితహృదయుఁడ నగుటం జేసి—

క. అన రానిమాట లనితి, మ్మన నిన్నుంగలఁచి నింద మోపితి నాచే
సిన నేరము నీవెమ్మన, ఘన మతిఁగావలయు నిక్కముగ మహాత్మా!

కృష్ణ—అర్జునా! తలవంచుకొని యింకను విషాదపడెదవేల? మీయన్నగారిని ప్రసన్నభావ మాలోకింపుము- (చిఱునవ్వుతో) నా పుణ్యవశమున కతంబున మీయన్నదమ్ములిరువురును బ్రతికితిరి.

అర్జు—(తలయెత్తి) అగ్రజా! నాతప్పులు సైరింపుము (కన్నీటితో మ్రొక్కును)

ధర్మ—(లేవనెత్తి) తమ్ముఁడా! నన్ను మన్నింపుము. (కన్నీటితోఁ గౌఁగిలించును)

కృష్ణ—(నవ్వుచు) బావలారా! యింక నేడ్పు లుడిగి కర్తవ్య మాలోచింపుఁడు (ఇరువురను విడఁదీయును)

ధర్మ—(చేరఁదీసి) తమ్ముఁడా భరతవంశోద్దీపక! నామాటట్టు లుంచుము-

గీ. ఒడలు గడు నొచ్చెనయ్య! సుయోధనుండు
పొడుచు ప్రమునఁ బోలు నన్నుఁ గర్ణుఁడు పొడిచిన
వింటి పోటులు; నింక నాకంటనీరు
తుడువఁ దగుఁజుమి కర్ణునిఁ దునిమి నేఁడు" అని కడగొట్టుతమ్ముఁడును—

"గీ. వెంటఁబడి వింట నాకంతమంటఁజూచె, వెక్కసము దీసి ప్రవరులు వేయువరఁ
బొమ్మనియె దిక్కుగల్గినపొంత, కర్ణుఁడ వ్యర్థముఁజంపి నాతాపమార్పుమయ్య"

అని పెద్దతమ్ముఁడును నాసుఖమ్మున నిన్నుఁ బ్రార్థించుచున్నారు-

చ. వడముడి నాల్కఁ గోయఁ జని వానికి వాఁ డొనరించినట్టి యా
గడమున కన్నిరెట్లు ప్రతికారము చేసితి గాక సమర్థుఁ డా
తఁడు నిమఁ బోలె; ముగ్గురి తాపము వాపఁగదయ్య; పేర్మి ని
ప్పుడ చని వానిఁ ద్రుంచి; నిను గ్రుక్కఁగ రా దిదె కొమ్ము దీవనల్.

అర్జు—అన్నా! యొక్కరని వక్కాణింపనేల? మన మేగారమును వానియవమానము
నంతో యింతో పొందినవారమే (క్రోధముతో) దేవా! నీపాదములతోడు—
నేఁడు కర్ణునిం దునుమకున్న మాతాపితృగతులకుం దప్పువాఁడ-(వినయముతో)
నన్ను దీవింపుము-

ధర్మ—(సంతోషముతో) కృష్ణార్జునులార! మీకు జయ మగుఁగాక-

క. విజయుఁ డనునీదు నామం, బజయ్యుఁ డగుకర్ణు నిపుడ యనిఁ ద్రుంచి జయ
ధ్వజ మెత్తించి సమస్త, ప్రజకును మాకును మహోత్సవప్రద మగుఁ గాక.

కృష్ణ—పోయి వత్తము రమ్ము. (కొంతవఱ కరిగి) ధర్మనందనా! నీవిటనుండి చూచు
చుండుము. మారాకకై వడముడి వేచుచున్నాఁడు (నిష్క్రమింతురు)

ధర్మ—(తనలో) ఏమగునో? జయాపజయమ్ములు దైవాధీనమ్ములుగదా?

ఉ. అమ్ములపూన్పునందలిరయంబున, లాఘవమందు, బాహుద
ర్పమ్మున, నస్త్రశస్త్రముల, ఫల్గునునకే గయికోఁడు వాఁ; డింకఁ
దమ్మునివంకఁ గృష్ణునిసుతారము, కర్ణునివంక విప్రశా
పమ్మును నామదిం దిగులు వాపుచునున్న విశార్యసిద్ధికై.

(తెరలో)

క. ఒక్కరుఁడ యయ్యెవడముడి, జక్కాఁడఁ బోడంగ నేనఁ; జంపుడితనితో
నుక్కడఁగుదు రప్పాండవు, లక్కడికే వేగ పోగ నగు మనమెల్లన్.

ధర్మ—(విని) రాజు పురికొల్ప శకుని వృకోదరుం దాఁకుచున్నాఁడు (నిరూపించి)
ద్యూతం బుగ్గడించి తమ్ముఁడు విజృంభించిన నుక్కడఁగి తేరుపై నొరిగినాఁడు
"స్యాలకోగ్రహనాశాయ" యని వీనిచేతనే ధృతరాష్ట్రునికొంపకిగతి వచ్చినది
వీనికిఁ జక్కని ప్రాయశ్చిత్తము జరిగినది-

(తెరలో)

ఉ. ఉమ్మలికమ్ముఁ దీర్చుకొనుచుండెఁ గటా! పవమాన సూతి రా
తమ్మునియొమ్ముఁ జీరి బెడిదమ్ముగ నెచ్చని నల్ల ద్రావుచుం

బొమ్మల పోలికం గడలఁ బొంచెదరేల నరేంద్రులార! నీ
నమ్మిక మంత్రయుం దెలిసెనా? యిఁక తేనికి సూతనందనా!

ధర్మ—(సంతోషముతో) కర్ణుఁడు చూచుచుండఁగనె పెద్దతమ్ముఁడు కృతకృత్యుండయ్యె. వీఁకఁ జిన్నతమ్ముఁడుమాత్ర మేలకాకుఁడును? నేఁటికి దుర్యోధన మాయాశట్యకయుం దొకకొ దూడినది.

(దృష్టివించి యేవముతో)

ఉ. అక్కసుదీఱ రాజసతి నంతలు చేసిన దానివక్షముం
జెక్కలుచేసిన న్వగఁ జెల్లదు గాని తదీయమాంసముం
గుక్కలు నక్కలుం దినవు క్రోలరు నిక్కము వానిరక్తముం
రక్కసు; లక్కటా! యెటులఁ ద్రావితి వేవము లేక తమ్ముఁడా!

(మఱియొకవంకఁజూచి) చిన్నతమ్ముఁడు కర్ణుఁడు చూచుచుండఁగనే వృషసేనుని తల డొల్లవేసి (యోజించి) ఈవధ కర్ణవధానంతరము కాఁదగినది.

తే. గీ. ఉన్నదే నేఁడుకిరీటికి మెన్నసింధు, రాజు నడఁచినయంత పరాక్రమంబు
యోగికైనను బంధువియోగదుఃఖ, జనిత తాపంబు కోపంబుఁ బెనుచుఁగాదె.

(తెరలోఁ గలకలము)

ధర్మ—ప్రతివిధజనితామర్షమ్మునఁ గర్ణుఁడాగ్నేయాద్యస్త్రమ్ముల నుపయోగింపఁ దమ్ముఁడవలీలగాఁ బ్రత్యస్త్రప్రయోగంబున వారించుచున్నాఁడు.

(తెరలో)

ఉ. ఎందుల కీదురాశ; మనమిందఱుఁ గన్గొన దుస్ససేను న
స్పందితుఁడై విచిత్రగతి సల్పె బకారి; యతండు చూడఁద
న్నందనుఁ డీల్గుటన్, వినెను దానుడిఁ గర్ణుఁడుఁగూడ; నిప్పుడే
నిం దగదే యమాత్మజుని నెయ్యముఁ దియ్యము రాజనందనా!

ధర్మ—(విని) అన్నప్పుడన్నను గురునందనుఁడు మిగుల దయాళుఁడు ఈతులువమదికి పథ్యవాక్యము లెక్కవు.

(తెరలో)

క. యామయు నీవును బ్రదుకుదుఁడు, నేమముగాఁ; జావులేని చిరజీవులుగా?
యీమాట కేమి చత్తుమొ? యేమగుదుమొ? దైవలిఖిత మెట్లున్నదియో.

ధర్మ—(విని) ఆ! నే ననుకొన్నటులే జరిగినది.

తరథునితోడఁ బోరుట యధర్మము గావునఁ జెప్పుచుంటిఁ గా

ని రథము లేక పోయినను నీకును గాఁకి జంకి గాదునూ

కృష్ణ—ఏమి రాధేయా! చిన్నవాఁడు చదివిన ధర్మశాస్త్రము నేఁటి కాదకుపచ్చెనా

గీ. ధర్మమతులైన మా పాండుతనయులేవు, రకుశుభంబగు మీకందఱకునగీడు

వచ్చు! వచ్చునుగాక కష్టుడికిఁ గరుణ, వచ్చునే దయ మృత్యుజీవితకుఁ గర్ణ!

కర్ణ—కృష్ణా! ఇందుకు శుభాశుభంబుల ప్రస్తావనమేమున్నది. రణధర్మము గావున నుడివితిని. నిలిచిన నిలువుఁడు. లేదేని మీరును గ్రిందికి దిగుఁడు. గదాయుద్ధము చేయుదము.

కృష్ణ—కర్ణా! నీవే పాటించిన ధర్మము లనుష్ఠించితివి? సిగ్గులేక ధర్మముమాటతల పెట్టెదవు మాకు మారణధర్మంబులు తప్ప మీరణధర్మంబులతోఁ బనిలేదు.

ఉ. పెచ్చిన చాలకాలమునఁ బెక్కురు గూడి ధనంజయాత్మజుం

గూల్చుట ధర్మమా! కొడుకుఁగుఱ్ఱలఁ గొంతిని లక్కయింటిలోఁ

గాల్చుట ధర్మమా! కనులు గానక ద్రౌపదిచీరలెల్ల నాఁ

డొల్చుట ధర్మమా! యలవృకోదరమందలి గెల్పుధర్మమా?

కర్ణ—(లజ్జించుచుఁ వనలో) హా దైవమా! నాయొనర్చిన సుకృతములన్నియు నెచట దాఁచితివి? కర్ణ నీరీతిఁ బౌరుషము లేనిచావు చంపెదవా? (కన్నీరు తుడుచుకొనుచు ప్రకాశముగా సారథితో) మద్రేశ్వరా! అరదముమీఁది గదాదండమందిమ్ము?

మహాప్రస్థర—తలఁగుం దిగ్దంతులెల్లం; దలఁకుఁ గులగిరు; ల్తారలల్లాడు; బృధ్వీతలమల్లంగ్రుంగుఁ; నాకోదరపతియును మత్ప్రాక్షిఘాతంబుచేతన్ దలలెల్లన్వంచు; నీశాత్రవబలములు భీతంబులై పోవు; వార్ధుల్ గలఁగుం; గర్ణుండు కేలంగదఁగొని సమరోత్కంఠమైఁ బోరువేళన్

శల్య—అంగరాజా! నీగదాయుద్ధప్రశంస యుగ్గెత్తి చెప్పకుము. భీముండు వినును

ఉ. “ నాగశరంబు నాఁటిచెడె నావననంబులునమ్ము” నుంచునే

మోగఁగవింటివే? యిఁక నరుం బరిమార్చుట కేదిదిక్కు? నీ

యాగడ మింతచేసెఁ బోలుపారఁగ నేర్చినవింటి విద్యయే

యీగతి నుండఁగాఁ దెలియు మేమగునో గదచేతఁ బట్టినన్.

కర్ణ—శల్యా? ఎన్నఁడును మేలుగాని పల్కవే పలికితివి. మణి యనికొని యగ్నికణముం గేలఁదాల్చిన నాకుందగిన శాస్తి చేయుచుంటివి రోగగ్రస్తునకుఁ బెదవి విఱిచిన వైద్యునివలె దిగులు నెలకొల్పుచుంటివి.

శల్య—విషగ్రస్తునకు విభీతకఫలంబులు మధురంబు లగునట్లు నీకప్రియవాక్యంబులు గాని రుచింపవు. కానిచో నాప్రియోపదేశంబు నీకు వెగటగునా?

కర్ణ—అది పరస్పరసమాగమకాలప్రభావము గాని వేఱుగాదు, ఇఁక నేని యిట్టికొఱగాని యుపదేశంబు లొనరింపక గద నా చేతికందిమ్ము.

శల్య—అంగపతీ! నాపలుకులు విశ్వసింపుము. నీవు గదాపరిశ్రమ మెఱుంగవు. తేరు పెకలించుకొనుము. నేనును సహాయపడెదను.

కర్ణ—(తనలో) కటకటా! ఈపాపాత్ముం డూరకుండఁడు! (భుజము మోపి రథచక్రము పైకెత్తుచు) ఇదియేమివింత! నగరారణ్యపట్టణ సముద్రంబులతోఁ బుడమి యెగయుచున్నది గాని రథచక్రంబులు కదలవు. కాలము సన్నమైనదని తోఁచుచున్నది. హా సుయోధన! నీకుఁ జేయఁదగిన యంతయుపకారము చేసితిని. నన్ను మన్నింపుము. దైవప్రాతికూల్యంబున మడియుచున్నాఁడు గాని కర్ణుఁడు మనుష్యప్రయత్నమున మడియువాఁడు కాఁడు.

(తెరలో)

ఉ. ఓగురుపుత్త్ర! యోకృపుఁడ! యోకృతవర్మ్మఁడ! రండు కర్ణుఁడా
లాగున డస్సియుం దనబలంబునఁ గ్రుంగిన స్యందనాంగమున్
లాగిన రాక కష్టపడులాగు గనుంగొను చూఁడకుందుర
య్యయ్యొ! గతిమాలువాఁడగునొకో? యిఁక నేఁడు హితుండు క్రుంగుటన్

కృష్ణ—ఫల్గునా! వింటివా సుయోధనునిపలుకులు! తడయక వీనిశిరంబు పుడమిఁ ద్రుంప వలయును. లేదేని వారడ్డమువత్తురు.

ఉ. ఓదము త్రవ్వి కాచుకొని యొద్దకుఁ జేరిన మత్తుఁడేనుఁగుం
బావలి యెవ్వఁడేని నవపాతగనంబడఁ ద్రోయకుండునే
సాదుతనంబు చూపెద నసాధ్యుఁడు వీఁడగు నేఁడు; చాలు నో
హో! దయ; ప్రొద్దుగ్రుంకువడుచున్నది కంఠము ద్రుంచుమర్జునా.

(తెరలో)

ఉ. ఏసిరి పోయి యా కురదమిత్త్రవ మొత్తెదఁ బార్థకృష్ణుల
న్నామనమద్ధైర్యముం జూపరమా నకు మిక్కుటిపోరు పోరుచే

వానితలంపు గానఁబడువారముగా నిటు లూరకుంటి మీ
దానికినింతఁగా దిగులు దాల్చుట బీరమె కౌరవేశ్వరా.

(అశ్వత్థామ ఖడ్గపాణియై ప్రవేశించి చేయెత్తి)

చ- జడియకుమోయి కర్ణ! రథచక్రము నిమ్మయి యెత్తికొమ్ము వెం
బడిఁ జనుదెమ్ము నీపడెడుపాటుఁదలంచి విభుండు "పొమ్ము" నా
వుడుఁ జనుదెంచినాఁడ నినుఁ బ్రోచుటకై; చనివిక్రమింపు మే
నడఁచెదఁ బార్థకృష్ణుల రణాభిమికత్వ భుజావలేపముల్-

ఆర్జు—(కృష్ణునితో) దేవా! అధర్మయుద్ధ మొనర్చుటకుఁ జేతులాడకున్నవి- మది యొప్పదు. నేనేమి చేయుదు?

కృష్ణు—కానిమ్ము అశ్వత్థామకర్ణుల సంభాషణను విందము. గురుపుత్రసంవర్తజలధరంబునకుఁ గర్ణుని వాక్యంబులు ఝంఝామారుతంబులు కాకపోవు-

కర్ణు—(సిగ్గుపడుచు మరలఁ జక్రమెత్తఁబోవును)

అశ్వ—కర్ణా! ఏల వృథాప్రయాసము! క్రొవ్వి తెచ్చుకొనిన విప్రశాపంబు రిత్తవోవునా? పుడమియైనఁ గదలుఁగాని యీరథచక్రములు కదలవు- దైవోపహతుండ వగు నిన్ను నేఁడు దూఱుటపాడిగాదు.

గీ. పరువుపోయిన మరలరావచ్చుఁగాని, నాశమొందిన మరలఁబ్రాణములురావు
తలఁగునీమీఁద భారమంతయును మోపి, ధరణియేలఁగనున్నాఁడు కురువిభుండు

కర్ణు—(కోపముతో రథచక్రము విడిచి) గురుతనయా! వెంగలి యగుసుయోధనుండు నిన్నునిపిన ననుచుఁగాత. నీచేతఁ బ్రోవఁబడువాఁ డెవ్వఁడు?

ఉ- ఇచ్చితి నర్థికోటికి మనీషులు మెచ్చఁగ వాంఛితంబు, లం
దిచ్చితి మేటిదుగ్గులు మహీశ్వరు చేతికి ; గెనుగాంచితిం;
జొచ్చితి సంగరంబున నసుప్రకరంబు తృణీకరించుచుం
జచ్చెదఁగాక బ్రాహ్మణులసాయముఁ గోరుదునే రణంబునన్-

అశ్వ—రాధేయా! "చింతవిరిగినను బులుసు విఱుగదే" యనురీతి నేఁటికిని నీకున్న పట్టుదలకు సంతోషించుచుంటిని- కురురాజున కుపకారము చేయుటయే నాతలంపుగాని నిన్ను బ్రదికించుటగాదు- కానీ నీవువచ్చిన వెనుకనే వచ్చెదనులే.

(నిష్క్రమించుచున్నాఁడు)

ఆర్జు—సూతపుత్రా! పొద్దుగ్రుంకుచున్నది- నీకోరినవిధంబున ముహూర్తకాలంబు గడచినది. సంగరంబునకు వచ్చెదవా? తొలంగిపోయెదవా?

కర్ణు—(కోపముతో రథకుమీఁదిగద లాగుకొనుచున్నాఁడు)

శల్యు—(గదను మరల లాగుకొనుచు) కర్ణా! నీకింతలో మానహాని రానేరదు. తొలఁగి చనుము.

కర్ణు—ఛీ! మద్రేశ్వరా! నీవంటి తుచ్ఛరాజులు చేయఁదగినపనిగాని నాబోటి పోటు మానిసులు చేయఁదగిన పనిగాదు. (గదపుచ్చుకొని అర్జునునితో) ఫల్గునా! సమస్థలంబున గదచేతనే పోరెదను రమ్ము. (నిష్క్రమించును)

కృష్ణు—అర్జునా! తడయక వీనిశిరంబుఁ వెనువెంటనే వాఁడితూపున దునుముము.

అర్జు—మంచిది. అట్లనే చేసెదను. రథఁబటుపోనిమ్ము (నిష్క్రమింతురు)

శల్యు—(నిరూపించి) కర్ణుఁడిప్పటికిని నెట్లు వెనఁకుచున్నాఁడో (పెదవివిఱచి) ఈయస్త్రము తప్పక కర్ణుని మస్తకమును దునుమక మానదు. (ఆశ్చర్యముతో) ఔరా! యీరథచక్రము కర్ణశిరంబుతోడన పైకినుబుకుచున్నది. (విచారముతో)

ఆ. వె. కర్ణుచావుచూడఁగాఁ జాలకక్కటా!, రాజరాజు మొగము తేజమడలి
దుఃఖసాగరమునఁ ద్రోయంగఁబడియె ధైర్యంబుచెప్పి యారుల నడఁతుగాక.
(రథముతో నిష్క్రమించును)

## గద్య

ఇది శ్రీ...తిరుపతివేంకటేశ్వరు లొనర్చిన పాండవ విజయనాటకమున షష్ఠాంకము.



శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవ విజయము.

## సప్తమాంకము.

(తెరలో)

ఉ. అంజలిలోఁ దునీటికొల నక్కట! పూచిన తమ్మికిన్ విధి
పిరణ రాలిపోయినవి రేకులు తొంబదితొమ్మి; దిప్పుడా
నీరజమందుఁ దా మిగులువే యొకరే, కటు లుండెఁ బో! యలం
కారము లౌనె యీ కొలనుగాని సరోజముగాని భూమికిన్

దుర్యో—(రక్తసిక్తాంగుఁడై తత్తఱపాటుగాఁ బ్రవేశించి విని తనలో) ఎవరో నా తండ్రిని నన్నును వెత్తిపాడుచున్నట్టులున్నది. కానిమ్ము. లోకము నోరెవఁడు కట్టఁగలఁడు? (యోజించి) ఈమాటలు నాకు ద్వైపాయనహ్రదంబునకు దారి చూపుచున్నయవి (పరుగిడి ద్వైపాయనహ్రదముం జేరును)

(తెరలో)

ఉ. తొంగలనాఁటనుండి కడు ధర్మముగా నిల యేలుకారవ
వ్రాతము రూపుమాసెఁగదరా! ధృతరాష్ట్రునిబావవైన నీ
మాతులతాప్రభావమున మాన్యులు పల్కెడు "సర్వనాశకో
మాతుల" యన్నవాక్య మసమంజస మౌనె తలంచి చూచినన్.

దుర్యో—(విని) అక్కటా! శస్త్రవ్రణంబులకన్నను ఈమాటలు వేదనాపాదకము లగుచున్నవే? ఇయ్యవి యెవ్వరివై యుండనోపు (యోజించి) మఱెవ్వరివి యుఁగావు నాకై యడలుచు నన్ను వీడలేక వెంబడించుచున్న నారాజ్యాధి దేవతవై యుండును.

(తెరలో)

తే. గీ. ఒక్కఁడే గెల్వఁజాలిన యుక్కడీఁడు, నేఁటికేనియునట్టిద్రోణినిఁ బరాభ
వింతురే! నీచరిత్రలు వింత లేమ, పాపమొనరించిరో చీకుటాలు మగలు.

దుర్యో—(దీనముగా) అమ్మా! సకలమును నెఱిగియుఁ నీవుఁగూడ నట్లధిక్షేపించెదవేమి? కర్ణునికేమి? శల్యునికేమి? నేను గురుతనయుని యనుజ్ఞచొప్పున నేకదా

సేనాధిపత్య మిచ్చియుంటిని. (యోజించి) అప్పుడు నాదికోపమే, నేను "అధిపత్య మెవరికిమ్మందు" వని యతని నడుగుటచే నాకిమ్మనుట కతఁడు సంశయించి యుండుటను పదపడి కొంకుకిట్టి యనుమానము కల్గినది. అన్నా యిప్పుడేని నీయాజ్ఞ శిరసావహించి యశ్వత్థామను సేనాధిపతిం గావించి నీయడలుడిపి నిన్ను స్థాపింపఁగలను నన్ను క్షమింపుము.

(తెరలో)

ఉ. కౌరవులఁ జేతులంటెగిన కాల్బలముం గని వారు మువ్వురుం
గాలము దూఱుకొంచుఁ జనఁగా వెనుకన్ మనరాజు "సంగరం
బో"లని కాలొక్కలందిఁ బరువెత్తెఁగటా! యిక మూఁపుపై గదం
దాలిచి ; కాలకర్మములు తప్పవుగా ! భువి నెంతవారికిన్

దుర్యో—(విని సంశయముతో) ఈకంఠధ్వని వెనుకటిదానికన్న భిన్నముగా నున్నదే (పరికించి) ఓహో ! ఇతఁడు స్వపక్షనాశనమునకై యడలుచు నాపరిచారకుఁడు కంకాళకునితో నన్ననుసరింప నరుదెంచుచున్న సంజయుఁడు (నిరూపించి) మడుగునొడ్డునకు వచ్చితిని. కాన నిట నిలిచి యితనివలనఁ గొన్ని సంగతులు వినుట కొంతయవసరము (లజ్జాదైన్యములతో) ఈయవస్థలో నేను వీరల మొగ మెట్లు చూడఁగలను ? ఓహో దైవమా !

క. నతులై యెదుగరలాసఁగెడు, క్షితిపాలుర చేతఁ గొల్వఁ జేయించుఁదనకున్
గతి లేనివానిఁ గావిం, చితివే రారాజు ! నెంతచేసితి వకటా !

సంజయకంకాళకులు—(ప్రవేశించి దైన్యముతో నమస్కరించి) మహారాజా! జయము జయము.

దుర్యో—(లేని తెల్వితో) సంజయా ! నేను రణము వదలిన పిదప విశేషము లెట్టివి?

సంజ—మహారాజా ! నేమిచెప్పుదును ? మనస్కంధావారము కాలిపోయిన యూరివలె సర్వశూన్యమైనది. కృపాశ్వత్థామ కృతవర్మలు మాత్రమే మెటకొంచరిరి. వారి బలమున నిప్పటికి రెండువేల రథంబులును, నేడునూర్ల దంతావళంబులును, పది వేల కాల్బలమును, అయిదువేల ఘోటకమ్ములును, యుయుత్సుండును ధృష్టద్యుమ్నుండును శిఖండియు ద్రౌపదేయులేవురును కృష్ణసాత్యకులును పంచపాండవులును మిగిలిరి. పదపడి యంతఃపురస్త్రీలయడలు వినఁజాలక యుయుత్సుండు ధర్మజుననుమతిగొని బాలికలనచుండి వారలను పురంబునకుఁదీసికొనిచనియె

దుర్యో—(తలపంకించి) కానిమ్ము, పరునాఁటి నింకెంతకాలము మిగులుదునో చూ
చెదఁగాక! (కన్నీరునించి) నేనెంత బలసంపన్నుఁడ నయినను విపరీతదైవ
మున కేమి చేయుదు? తక్కినవన్నియు నట్లుండనిమ్ము. అక్కటా! శల్యునంత
వాఁడు ధర్మరాజుచే వధింపఁబడువాఁడా!

క. యమసుతునయుండెతఁడని, క్రమటంబుం దెలియఁ జేయఁగడఁగి మహాయు
ద్ధము గావించెను నేఁటి దినమున నొకఁడు సురలు మెచ్చునంగనుఁగొనఁగన్.

సంజ—కుమారా! అట్లనవలదు? అజాతశత్రుఁడసమర్థుఁడనుకొంటివా! నిక్కముగా
నతఁడే యుల్లినచోఁ గ్రిందుమీఁదు చేయఁడా? వడయుఁడియేల?

దుర్యో—(పెడచెవిఁ బెట్టి) సరే! మీ రెందుల కిటు వచ్చితిరి?

సంజ—సేవాధర్మము కావున నేకాదశాక్షౌహిణీపతి వగు నీ వొంటిఁ జనుచుంటివని
వగపున ననుసరింప వచ్చితిమి.

దుర్యో—పాండవులవలన మీ కేమొగ్గును గలుగ లేదుకద?

సంజ—వారివలన జరుగకున్నను శత్రువిజయసంభ్రమమున నొడలెఱుఁగక కాఁబోలు
సాత్యకి నన్ను గుందలపట్టి నఱుకఁబోవునంత వ్యాసభగవానులు వచ్చి వారించి
బ్రతికించిరి.

దుర్యో—(కోపముతో) హా! దుర్మార్గులనపరాధి యగు నిన్నుఁగూడఁ జంపనుంకించిరిగా?
కానిమ్ము నా నిశ్చయము వినుము.

క. కొండొక యీ హ్రదమున నే, నుండి శ్రమముదీర్చుకొని రణోర్వికిఁ జని నా
యుండు రథికత్రయము రాఁ, బాండవహతకులను బట్టి పరిమార్పింతున్.

నీవరిగి మాతండ్రికి సకలమ్మును దెల్పుదువుగాక. (నిష్క్రమించును)

సంజ—కంకాళకా! చూచితివా? ఇంకను వారి నేమో చేయుదుననియె యహంకరిం
చుచున్నాఁడు ఇప్పుడేని ధర్మజుని శరణన్న నతఁడు పోనీయనివాఁడు కాఁడు
సుమా? కానిమ్ము, ధృతరాష్ట్రరాజుకడ కరుగుదమురమ్ము. (నిష్క్రమింతురు)

(రథికత్రయము ప్రవేశించును)

కృపా—కుమారా! అతఁడు జలస్తంభన మెఱిఁగినవాఁడు. తప్పక యిందే యుండును

అశ్వ—అట్లయినఁ బిలిచి చూతము రమ్ము. (బిగ్గరగా) మహారాజ దుర్యోధన మేము
కృపాశ్వత్థామకృతవర్మలము నిన్నుఁ గనుఁగొన వచ్చితిమి.

చ- భయమున డాఁగియుంట పరువా! పెఱవారికి మాత్ర మేమిటం
జయము లభించె మద్రపతి చచ్చినమాత్రన పోరు మాని తే
మి యనుడు నిన్ను; లెమ్ము రణమేదినికిం జనుదెమ్ము మార్తు ర
ప్రియులు సేయుకుండఁగ భరించెద నేను సమీకభారమున్-

కృపా—కౌరవేశ్వర! హతవిధి నీయట్టివానిచేఁ దుద కట్టివిపద్దశ యనుభవింపఁజే
యుచున్నాఁడు? ప్రాణాశ కలవాఁడవేని నానుడువు లాలకింపుము-

చ- తలఁపకుమయ్య లోఁగడ గతంబు; గతంబు దలంపఁ బోకు మీ
యులకతనంబు; ధర్మజునియొద్దకుఁ బోయి "భగింపుమన్న వా
యలుకుడి విన్నఁ బ్రోవఁగలఁ డాతఁడు నీసగపాలొసంగి; యూ
వలసకలంబుఁ గల్గును భవత్సహవర్గము కౌరవేశ్వరా!

దుర్యో—(మడుగునుండివచ్చి) శారద్వతా! నీపలుకులు నిన్ననే దత్తోత్తరంబులయ్యె
నీవు నాహితంబు గోరినవాఁడవని యెఱుంగుదు- వినుము—

చ- చలము బలంబు మానము యశంబును మాయఁగఁ బోయి పాండుపు
త్రుల శరణందుఁ గాక దయతో ననుఁ బ్రోతురు గాక ప్రోచినం
గలుగును రాలుబిడ్డలటు గాక సహోదరు లేగుదెంతురో?
కలకల నవ్వుకర్ణుని మొగంబు గనుంగొను భాగ్య మబ్బునో?

కృపా—(ఎకసక్కెముగ) రాజా! నీకుఁగర్ణుని మొగమే చూడవలయు ననియున్న
స్వర్గమునందే చూడవలయును- అదియును గాక (అనునర్థోక్తిలో)

అశ్వ—మామా! యిది పురస్కారమునకు సమయముగాని తిరస్కారమునకుఁ గాదు.
మహారాజు మిగుల నాపదపాలై డస్సియున్నవాఁడు- ఇంకఁ గలిమియపహించు
నసుట కలఁగోనివార్త-

ఉ- కొమ్మలు గాలిచే విఱుఁగఁ గ్రుంకటివే రసిఁగూడఁ జెట్టుపాం
కమ్మెడఁ బాసియున్న సహకారము తీయని కాపుకాచునో
కమ్మని పూఁతపూచునో! పికప్రముఖద్విజపాళిచేతఁ జి
త్తమ్మున కింపుఁగూర్చునో! సదా తెరువర్లకు నీడ యిచ్చునో-

పదునొకం డక్షౌహిణులకు మనకు మువ్వురము గదా! మిగిలితిమి ఇష్టపడితి వేని
పోరితమున కాయిత మ్మగుదము- లేనేని గిరిముఖంబులకరిగి మునివృత్తి సలుపు
కొందము- అంతియుకాని రాజుండూఱనాడుట యనుచితము- సంధిసేయుమను
ట యంతకంటె ననుచితము-

కృప— ఆచార్యనందన ! లెస్సపలుకు పలికితివి.

ఉ. లేవరదంబులుం; గరులు లేవు, మనుష్యులు లేరు; గుఱ్ఱముల్
లేవు, సహోదరుం డొకఁడు లేఁడు, సుయోధనుఁ డాజిలోపలం
జావక పోను దాఁచుకొని సంధి కొడంబడెనం బ్రతిజ్ఞయుం
జేవయుఁ బోవుఁ గాని తనజీవముఁ దాల్చిన లాభమున్నదే.

అయినను మహారాజుతలంపు గట్టిగాఁ గనుగొందము. (రాజుతో) అయ్యా! ఇందు
ల కేమనియెదవు?

దుర్యో— నన్ను వృథాజీవితాశ గలవానినిగా దలంపకుఁడు. ప్రతిజ్ఞాప్రతిజ్ఞలు తప్ప
నిప్పుడెవరు గెల్చినను బ్రాయుకొనునదిలేదు. కులక్షయంబునకు వగనంగాని గాం
గేయుని గెడపిన శిఖండి యొకఁడును కురువృద్ధమహాపాతకంబున కొడిగట్టిన
పాంచాలకులకలంకంబును పాండవకులాంకూరంబు లగుద్రౌపదేయు లేవురును
బ్రదికియున్నందులకు వగచుచుంటిని.

చ. అరసితిఁ గాని సూరథము లచ్చటఁ గన్పడవయ్యె; నొచ్చెమేన్
దురగములైరో; నేనొకఁడనుం జనుదెంచితి విశ్రమింప నాఁ
డరదపుఁ జక్రమెత్తుకొను నప్పుడు చంపిరి కర్ణునంచు; నీ
తెరఁగగునేని నాహృదయతాపము వాపుము ద్రోణనందనా!

ఉ. పోటుదనంబునం దుముకుఁ బోకలు పోవుచుఁ "గూడ" దన్నమీ
మాట నిరాకరించితిఁ గుమారుల నందఱఁ గోలుపోతి నా
చేతున కేమి యాయుసరిచీకుల కక్కట ! బుద్ధిహీనతం
గూటికిఁ గాటికిం బరులకొంపకుఁ జేరుచవస్థఁ దెచ్చితిన్.

ఉ. కాలము చేరువయ్యెఁ గలకాలము రాజ్యము చేసి రేధరా
పాలురు? కాలకర్మపరిపాకము దాఁటఁ బరంబె ! కంత మీ
వాలునఁ ద్రుంచి నాకుఁ ద్రిదివంబునఁ జూపుము వారినెల్ల; బం
డాలుఁడు భీముఁడేల కురునాథునిఁ జంపవలెన్ ద్విజోత్తమా !

అశ్వ— మహారాజా ! కడచినపనికి వగవనేల ? నా మేనంబ్రాణము లున్నంతవఱకు
నిన్ను భీమసేనుబారినుండి కాపాడెదను-

ఉ. మించి పరాక్రమించెద, సమీకము నేఁటి కపాండవంబుఁగా
వించెద, నేఁడు నీకుఁ గనిపించెద నాభుజవిక్రమంబు, మె

ల్పించెద, నూతనూతి మఱపించెద నీమది; నీకు రాజ్యమి
ప్పించెదఁ, బాండువంశము శపించెద ; నన్ను నమ్ము కౌరవాధిపా
(తెరలోఁ బెద్దకలకలము)

కృత—(తేఱిపాఱఁ జూచి) ఎట్లు తెలిసెనో కాని పాండవులు వచ్చుచున్నారు. మనకుఁ గర్తవ్యమేది?

దుర్యో—నేనిప్పుడు యుద్ధము సేయఁజాలను.

చ. ఒడలు పృథాకుమారచటులోగ్రశరాహతి డస్సి మండఁగాఁ
బొడఁగెఁ బ్రతీకసంధులు విఘాతములయ్యెఁ గదల్పజాల లో
వడ జనియించె గుండెలు యథాయథలయ్యెఁ జలించి ప్రాణము
ల్పుడిపడెఁ గాన నీమడుఁగులోపలఁ గొండొక విశ్రమించెదన్.

అశ్వ—మహారాజ! మేమిప్పటి కటకేనిబోయి మరల నిటకు వచ్చెదము. నీవందాక నీమడుగులో నిశ్చింతగా నుండుము.

కృత—వారేమన్నను వెడలిరాకుము. మేముపోయివత్తుము. (నిష్క్రమింతురు)

దుర్యో—హాశకుని ! హాదుశ్శాసన ! హాకర్ణ ! హాశల్య ! హానరేంద్రులార !

ఉ.- "అందని మ్రానిపం" డని మహాత్ములు చెప్పిన ధిక్కరించి మి
మ్మందఱి ఘోరయుద్ధమున కాయితపెట్టి సహానుగంబుగా
మ్రందఁగఁ జేసియుం దుదకుఁ బ్రాణము మానముకంటె హెచ్చుగాఁ
బంద సుయోధనుండు నృపపాంసులుఁ డక్కట! నీట డాగెడున్.
(మడుఁగులోఁ డాగును)

(పిదపఁ బాండవపంచకంబును గృష్ణుండును గిరాతుండును బ్రవేశించుచున్నారు)

ధర్మ—(చేతఁజూపి) ఓరీకిరాత ! ఇదియేనా నీవు వారినిజూచినమడుఁగు.

కిరా—ఇదియే దేవర ! అవలివైపుననుండి మాటలాడినారు.

ధర్మ—(ఆవైపునకుఁబోయి) కృష్ణా! ఇవిగో నాలకులిశధ్వజప్రముఖరేఖాంకితంబులగు పాదంబులజాడ లీచెమ్మనేలఁ గనబడుచున్నవి. చూడుము. ఇవి దుర్యోధనుని పాదములేనా?

కృష్ణ—ఓరీ! దుర్యోధన మహారాజును నీ వెఱుఁగుదువురా?

కిరా—దేవరా! యెఱుఁగ నేమి?

కృష్ణ—అతని నెట్లుగుర్తుపట్టితివి?

కిరా—మా రాజుగారి చేతిలోని గదవంటిగద యొకటి కలదు. కిరీటమున్నది. శరీరము నిండ గత్తురు వాతికలున్నవి.

ధర్మ—ఆర్యా! యేలసందేహపడెదవు. ఆతఁడు జలస్తంభన విద్యయెఱిఁగినవాఁడు. తప్పక యీమడుఁగులో దాఁగియున్నవాఁడు. కాదేని నడవిలోనుండు జడదారులకుఁగాని కిరాతులకుఁగాని పాదములయందిట్లు సుస్పష్టములగు భాగ్యరేఖ లుండునా?

కృష్ణ—అయిన నిపుడు మనము చేయవలసినదేమి?

భీమ—నేనీమడుగులో దిగి కరికలభము కలంచినట్లు కలఁచివైచెదను.

కృష్ణ—కాదు కాదు, ఈమడుఁగగాధమైనది. పాతాళగంగకును, దీనికిని ద్వారము కలదనివిందుము.

భీమ—అటులేని పోటుమాటలతో నెత్తిపొడిచెదను. అభిమానధనుఁడగువాఁడు బయలు పడక మానఁడు.

కృష్ణ—నీవు కాదు. నీయన్న ధర్మనందనునిచే ననిపింతము (ధర్మజునితో) ధర్మజా! నీవు పిలువుము.

ధర్మ—(మడుఁగు సమీపించి బిగ్గరగా)

మ. చతురంభోధిపరీతమైనధరణీచక్రంబు శాసించి భూ
పతివర్గంబరిగాపులై కొలువ సేవానమ్రరాజేంద్రమౌ
ళితలాలంకృతరత్నదీధితిసరోలీనుండవై యుండునీ
స్థితి యీరీతిగ నేఁటికిం బరిణమించెం గాదె దుర్యోధనా!

ఉ. చచ్చిరి సోదరుల్ సుతులు చచ్చిరి చచ్చిరి రాజులెల్ల, రీ
కచ్చెకు మూలకందమగు కర్ణుఁడు మామయుఁ జచ్చి రీగతిం
బచ్చసికొంప మాపితివి బాపురె! కౌరవనాథ నీసగం
బిచ్చెద జీవితేచ్ఛ గలదేని బయల్పడు మయ్య! గ్రక్కునన్.

దుర్యో—(తనలో) అభిమానమా కొంతకాలము నామనంబునఁ బ్రవేశింపకుము. ఛీ! మూఢదుర్యోధన! అభిమానముకంటెఁ బ్రాణము హెచ్చని తలఁచుచున్నావా? బయల్పడుము. (ఆలోచించి) నాకుపకారకంబగురథికత్రయంబు నన్ను మడువు వెడలకుమని చెప్పిపోయిరి. హా! భగవంతుఁడా! నాకట్టి యిక్కట్లు సంభవింపఁజేసితివి! ఓమనసా! తొందరపడకుము!

వ. మడువున డాఁగఁ బొమ్మనుచు! మాతులుండు హెచ్చరించి నా
కడలు జనింపఁజేసితి వహా! యిపు డీవు "జలంబు నుండి వే
వెడలు" మటంచుఁ జెప్పెదు వివేకము సుంతయుఁ గాని యున్న నే
చెడుగు చునంబు! నీకుఁ; బరిశీలన చేయక పోతి వక్కటా!

భీము—ఓయీ! దుర్యోధనమహారాజ! మడుగులోనుండి దయచేయుము.

ఉ. దంభము పన్ని సంగరపదంబు తొలంగి హ్రదంబునన్ జల
స్తంభనవిద్య డాగినను జావక యుందువె మూఢుఁడా! ఇలో
జ్జృంభణఁజేసి జాలరులు చేపలఁ బట్టినరీతిగా దురా
లంభుని నిన్ను నాభుజబలంబున నేఁ డెటు లైనఁ బట్టెదన్.

నకు—దుర్యోధనా! ఏల కష్టపుంజావు చచ్చెదవు? క్షత్రియోచితంబుగ మడిసిన ని
వాపరంబులు రెండును గలవు.

ఉ. కౌరవులందుఁ బుట్టియు నఖండగమావిభవంబు పట్టియుం
బోరనఁ గీర్తి గట్టియు నపూర్వగదారణయుండు జెట్టివై
పోరి రణంబులోపల రిపుప్రకరంబున కోడిపోయి కా
సారముఁ జొచ్చితీ వని ప్రజ ల్విని నవ్వుదురే మొగంబునన్.

సహ—సుయోధనా! గాంధారరాజదౌహిత్ర!

ఉ. మానిని ద్రౌపది న్వలువ మాసినదానిఁ బరాభవించుచోఁ
గానల కేగునప్పుడొడి కారము నైన యను నింద నేయుచోఁ
బూనిన పౌరుషంబుఁ దలపోయుము వే? త్రప లేక పోయె నే
మానసమందు; నీమరభిమానము కర్ణునితోడఁ బోయెనే.

అర్జు—చ. శాంతనవుండు ద్రోణుఁడు విశాంపతులందఱు నీనిమిత్తమై
యంతముఁ జెందిరంగపతి యంతటిమిత్రముఁడు చచ్చె నీ
పంతము లొచ్చెపోయెఁ బరిపంథికులంబు బలంబు హెచ్చె నీ
వింతటి మొండిధైర్యము వహింపుటకుం గత మేమి తెల్పుమా!

కృష్ణ—కౌరవేంద్ర! నాఁడు సభాముఖంబున "బ్రతికిన న్నాళ్లు రారాజు ననిపించు
కొనవలె" నని మీయమ్మతోఁ బలికిన పలుకులు జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము.

ఆ. వె. మడుఁగు వెడలివచ్చి మాతోడ నెదిరించి, తేఁజేరు నిలుచు నీల్గుదాఁక
లేక యున్న నిన్ను లోకంబు పాలుఁబో తినుచుఁ బిలుచుఁ దప్పదనియు నీకు

దుర్యో—పాండునందనులారా! ఏల యీమృదాలాపములు! ధర్మనందనా!

ఉ. ఏలుము రాజ్య; మైతివి మహీంద్రుఁడ; వేను బరిత్యజించితిం
గాలము చేరు వాదమకఁ గానలలోఁ దపమాచరింతు నే
జాల మొనర్పఁగా! దగిన యాయుధము ల్దరి లేవు యుద్ధ మిం
కేల భవన్మనోరథము లేనాఁడుఁ గూర్చుచు నుండ నిత్తిక.

ధర్మ—దుర్యోధనా! దానపూర్వకముగా గ్రహించుటకు మేము బ్రాహ్మణులము కాము. నిన్నుఁ గడతేర్చుటయే మామనోరథము గాని రాజ్యమేలుటయుఁ గాదు కావునఁ దడయక వెడలిరమ్ము.

దుర్యో—(తనలో) ఈదురాత్ములు వెడలింపక మానరు. ఓవనదేవతలారా! ద్వైపాయనహ్రదపావనోదకంబులారా!

గీ. అనుఁగుచెచ్చెలి! నీవుచేసినప్రతిజ్ఞ తప్పకుండఁగ నెఱవేర్పఁదలఁపుమయ్య
పాండవులబారిఁ బడఁద్రోచెఁబట్టుపట్టి, నన్నుఁజండాలదురభిమానగ్రహంబు.

అనిమాటలుగా గురునందనునకు విన్నవింపుఁడు (ప్రకాశముగ) ధర్మతనూజ!

గీ. అరదమైనను లేదు నిరాయుధుండ, నెదిరి మీతోడఁ బోరుట యెట్లటంచుఁ
బల్కితినిగాని మీరుతప్పదనిరేని, గదలి చనుదెంచుచున్నాఁడఁ గాచికొనుఁడు

(మడుగునుండి వెడలివచ్చుచున్నాఁడు)

ధర్మ—(చూచి) కురునాథ! ఆయుధంబులు లేవనియు నేకాకిననియు వంతఁజెందకుము. ఇవిగో! నీయిచ్చవచ్చిన యాయుధములు గైకొని మాయేవురలో నీకభిమతంబగువానితోఁ గయ్య మొనర్పుము.

ఉ. ఈవురణంబునం గెలిచెదేని జయంబు వహించి యేలు మీ
భూవలయంబు మేము వనభూముల కేగెద మట్లు గాక నీ
వేపడినన్ ధరాభరము మేము వహింతుము రాజరాజ! నీ
చావున జావకుండుటయు సజ్జనగణ్యముగా నొనర్పుమా.

దుర్యో—(తనలో) ఔరా! యీధర్మపుత్రునిన్యాయమాతిశయము! తన్నో, కవలనో విన్నమ్మనో, గదాయుద్ధమునకుఁ బేర్కొనిన నాకు గెలుపు సులభముగదా! ఛీ! నేనేల వారిపేరులు తలపెట్టెదను? చచ్చిన భీముని చేతనే చావవలయును కడతేర్చినవానినే కడతేర్పవలయును (ప్రకాశముగ) కౌంతేయాగ్రజ! నీధర్మవర్తన

మునకు సంతసించితిని- కవచశిరస్త్రాణాదులుమాత్రము కైకొందును నీయాయుధ
ములతోఁ బనిలేదు-

గీ. యమగదాదండమున కుపాధ్యాయమైన
నాగదాదండ మిదిగో? యున్నయది కేల
నెవరు వచ్చినరఁడు మీయేగురందు
నాలమున రాజరాజోలమాసగొనఁడు.

(కవచాదిధారణ మొనర్చును)

భీమ—అన్నదమ్ములారా! ఆల్లేని నన్నే యుద్ధము చేయనిండు-

మ. యువరాజక్షతజామృతోపనముచే నూర్జస్వలంబైన యీ
పవమానాత్మజవామబాహుశిఖరస్థాయద్గదాదండ మా
హవమం దీధృతరాష్ట్రిజాగ్రిజుని జక్కాడంగటాక్షింపుఁడీ
సవనంబేఁ దుదముట్టఁ జేసెద మదుత్సాహంబుఁ జెల్లింపుఁడీ

దుర్యో—భీమసేనా రారమ్ము- నాకును మనోరథ మట్లేయున్నది? (స్మరించి)

మ. బలరామున్ బలరాము దేశికునిగాఁ బ్రార్థించి చేకొన్నవి
ద్యలు గావే! ఖురళీగదారణము; లాధవ్యాత్యుత్క పేరైనమున్
దలఁపం జెల్లదె? రాజరాజు భవదన్యప్రాణిరోద్ధం గదా
బలమున్ జూపి కలంకుఁ దెచ్చునె పరిలంబ ఘూర్ణజ్వలత్క్రీకిన్.

(తెరగా)

జడదారులారా! ఏను బ్రహ్మహత్యాదోష నివారణంబునకై తీర్థయాత్రలు సేవింపఁబో
యి మరల వచ్చిన బలరాముఁడను- ద్వైపాయనహ్రదంబునకుం దారిచూపుఁడు
దానియందుఁగూడఁ గృతావగాహనుండనై హాస్తినాపురంబునకు దుర్యోధనా
దులగు బంధుగులం జూడఁబోయెదను ఏమనుచున్నారు! ఇంకను దుర్యోధనా
డు లెక్కడననియా! పాండవులచే ననవారంద ఱుఁగూల నేకాకియై దుర్యోధ
నుం డెచ్చటికో పాఱిపోయెనా! ఔరా! విధిప్రాతికూల్యము! ఎంతలో నెంత
మూఁజినది? కానిమ్ము- నేను వేగముపోయి రారాజును వెదకించి వానిరాజ్యము వా
నికిప్పించెదను- మంచిది! యీకదంబవృక్షవాటికకు దక్షిణభాగమునందున్న
యేకపదిం బట్టి పోవలయునా! (ప్రవేశించుచున్నాఁడు)

కృష్ణు—(విని యర్జునునితో) ఫల్గునా! నీవియ్యంకుఁడు బలభద్రుఁడు సుయోధనుని యు దృష్టముచేఁ గాఁబోలు నిచటికే వచ్చుచున్నాఁడు.

అర్జు—(విచారముతో) కృష్ణా! ఇఁక నెక్కడివియ్యంకుఁడు. తొల్లింటి బాంధవ్యమే మిగిలెనుగదా. నేనతని మొగమెట్లు చూడఁగలను.

చ. "అనుపమవిక్రమక్రమసమన్వితు లేగురు జీవవంతు ల
యన్నను శశిరేఖకుం బతివియోగ దశానుభవంబుఁ దెచ్చిరే
యని మొగిడింప నేల విలయంబునకై యిటు" లంచు శత్రువో
యినమదితోడ నీనుసలి యెట్టిదురాగ్రహముం గ్రహించునో.

కృష్ణు—ఫల్గునా! దైవగతికి వగ నేమి చేయుదుము. నేను దానికనలేను. ఈజరగఁ బోవు భీమదుర్యోధనగదాయుద్ధము మాత్రము మితిఁడు చూడఁదగినది కాదు.

బల—(ఆశ్చర్యముతో) ఓరి కురుపాండవయూధపతులు! అందఱునిచ్చట నె యున్నారు! (ఆలోచించి) జలస్తంభనవిద్యచే డాఁగియున్న దుర్యోధనుని బయలు పఱచుటకై వచ్చిరని తోఁచెదను. హా! కురురాజకంఠీరవా! పాండవులు నీకెం విపద్దశ తెచ్చిరి! (సమీపించుచున్నాఁడు)

దుర్యో—(చూచి విషణ్ణవదనముతో) కౌరవశ్రీయుసాక్ష మా! బలరామ!

చ. కొడుకులఁ దమ్ములం గదనకోవిదుఁ బ్రాణసమానుఁ గర్ణు వృ
ద్ధుఁ డయినయాపగాతనయు ద్రోణునిఁ దక్కినయుక్కడీండ్రను
న్వడు పొలియించి తా మిగిలెఁ బాపభరంబునఁ బావకుండ నొ
క్కఁడగుచు; నాసుయోధనుఁడు కైకొనుమా! కడసారి మ్రొక్కడున్.

భీము—(సంతోషముతో) బావా! హాళాపిత్రము!

ఉ. ద్రౌపదికట్టుచీరలు సదస్సున డుల్చినయన్న దమ్ములం
బాపులఁ జంపఁగాఁ బ్రతినపట్టి సహోదరు ముందుఁ జంపి సం
తాపము కొంత దీర్చుకొని న్యాయముగాఁ బెఱవానిజీవముం
బాపఁ దలంచపావనినమస్కృతిఁ గైకొను మచ్యుతాగ్రజా!

అర్జు—(కన్నీటితో నమస్కరించి) బావా! నీకు మఱవరానిదుఃఖముఁ దెచ్చిపెట్టిన యీపాండవులతప్పు క్షమింపుము.

ఉ. మాయఘుటోత్కచుండు పెనుమాయ సృజించి విరోధులం దృణ
ప్రాయులఁగా విడల్చుచు వివాహము చేసినచేత కిప్పు డ

రయ్యా యని యుండఁగా వలసె నోయనుభూపమణీ! తొల్లి స్వర్గభ
శ్రేయుల నైనయిర్వురను చేసినపాపఫలంబు లెట్టివో.

కృష్ణ—వెఱ్ఱియర్జునా! లక్ష్మణునకే యిచ్చితిమనకొనుము. శశిరేఖకే వ్రాఁతతప్పునా!

బల—ఏమి! అభిమన్యుఁడు మడిసెనా! హా సుభద్రాకుమార! ఈకురుపాండవయుద్ధము నీమృతికొఱకే తటస్థించెనా! కాకున్న నంతగందరగోళము జరిగిన పెండ్లి యెట్లుకొఱకు వచ్చును! ఓ పాండవవీరులారా!

గీ. పెద్ద లరిగినపిమ్మటఁ జిన్నవాండ్రు, కవర మొనరింపఁ బోవుట పాడిగాని
కలదె యెందును ముందుసంగరములందుఁ; జంటివాండ్రను బంపించి చంపుకొనుట

కృష్ణ—అగ్రజా! దానిఁ దగినంత కారణము లేకపోలేదు. సావకాశముగ నివేదించుకొందును ఇప్పుడు నీశిష్యు లిరువురకుఁగదా యుద్ధము కానున్నది. మనమింకఁ గూర్చుండి యావేడుకఁ గనుఁగొందము.

బల—ఈఘోరయుద్ధమున కాదికర్త వైన నీకిది వేడుకగానుండదా! నీవొనరించిన కపటోపాయంబులంగాక జగదేకవీరులగు ద్రోణభీష్ములు మడియుదురా!

గీ. సంధిగావింప కుందువే చతురుపాయ, ముల నెఱింగిన బుద్ధికౌశలము గలవు
ఉత్తవైరంబుఁ బెంచితి రిత్తలనేలఁ గలధరించి సుఖించునే ధర్మరాజు

కృష్ణ—అన్నయ్యా! నామీఁద లేనియపవాద మోపిన నేనేమందును. అడ్డమున్నది మొగమున్నది దుర్యోధనునే యడుగరాదా! "అయిదూళ్లిచ్చినఁ బాండవులకుఁ జాలు" నని నేఁబతిమాలితినో లేదో! కడచినదానికేమి. నేఁడునీవు కూకలిడి సంధిచేయింపుము. పాండవుల నే నొప్పించెదను.

బల—సర్వశూన్యమైనపిదప సంధి కావించిన నేమి కావింపకున్న నేమి?

గీ. ఇరువురొకరూప కాకు లిందెవరియాఁదుఁ, గానికించిదధర్మంబు కానిపించె
నేని జూచుచు నేను సహింపఁజాల, నెవరికర్మము వారిదె నేఁగువాఁడ.

ధర్మ—బావా! నీ వుపద్రష్టవై యుండ నట్టిల జరుగును? ఇందు నీయానతి నుల్లంఘించు వారెవ్వరు?

ఉ. ప్రాణభయంబునం బెదరి పాఱి సుయోధనుఁ డీహ్రదంబునం
త్రాణముగా మొఱంగిన కథావిధము న్విని యేను వచ్చి "నీ
రాణ యిటున్నదే" యని దురాశయు లాడ సహింపలేక యీ
ద్రోణతమై సమీక మొనర్చుట తప్పదటంచు నెల్వడెన్.

తరువాత రణసామగ్రి లేక యేకాకియై యున్నయతనితో—

"క. ఏమాయుధంబుఁగోరిన, నా మాయుధ మొసఁగువార మనికిఁగఁడఁగ నీ
మాయేగురయందెవ్వరి, నోయుకరినిం జేరుకొనుము యుద్ధంబునకున్.

వానింగెల్చితివేని జయము నీపక్షముగా నంగీకరింతు" మని పల్కితి.

బల—బళే ధర్మరాజా! నీబుద్ధికి సంతసించితి. కావున నీధర్మయుద్ధమును గనఁగోని యే యేగెదన.

కృష్ణ—(జనాంతికముగ నర్జునునితో) ఈధర్మనందనుండు పోవుచున్నవానిని బలాత్కారముగ నాపుచున్నాఁడు. భవితవ్యమెట్లున్నదో.

ఉ. న్యాయముగా గదారణ మొనర్చిన భీముఁడు కౌరవేశ్వరుం
ద్రోయుట దుర్లభం బొకనితో రణమే కద? నిర్ణయించె న
న్యాయ మొకింతయుం జరిగినం గని సైఁపఁడు సీరపాణి; యిం
కాయనతోడ మీకుఁగలహంబు ఘటిల్లుట నిక్కమర్జునా!

అర్జు—మాయన్నగారొనర్చు పనులన్నియు నేమిపాపమో మనకపకారముగనే పరిణమించుచున్నయవి. కానిమ్ము. భవితవ్యమెట్లును గాకమానదు.

ధర్మ—మనమందఱ మీప్రదఘట్టంబునం గూర్చుండదమురండు. (కూర్చుండురు)

భీము—(పరికరము బంధించి గద నుద్దేశించి)

ఉ. కమ్మని జాళువారొఱపుగంటలు గట్టి యహర్నిశంబు నే
మమ్మునఁబూజ చేయుచు నమస్సులొనర్చుచుఁ గొల్చుచుంటిఁ జి
త్తమ్మున నిన్ను నమ్మితిఁ గదమ్మ సుయోధనుతోడి నేఁటికై
య్యమ్మునఁ జేరు నిల్పఁగఁగదమ్మ! మదంబ గదావతంసమా

దుర్యో—చేతిలావును బుద్ధికౌశలమును నుండవలయుఁగాని పూజాపురస్కారములతో గదారణకోవిదుండ వగుదువా! చాలునీస్తోత్రపాఠములు రారమ్ము.

అర్జు—(కృష్ణునితో జనాంతికముగా) గదాగ్రజా! బుద్ధికౌశలంబున రారాజునకు భీమసేనుండును జేతిలావున భీమసేనునకు రారాజును జాలరనుకొనియెదను. నీయభిప్రాయ మేమి?

కృష్ణ—చేతిలావున భీముఁడెక్కుడైనను జిరతరాభ్యాస పాటవమందును నేర్పునందును సుయోధనుఁడే ఘనుఁడు.

గీ. అప్పుడప్పుడు వేఁడి మదగర్విజాతు, వలసఁదత్త్వదర్విహాస్యము దెలిసికొనుచు
సలిపెనితఁడు గదాపరిశ్రమయుమీరు, వనమునందున్న పండెండువత్సరములు_

భీము—(క్రోధహాసములతో) దుర్యోధనా! ప్రాణభీతిం జేసి నీట డాఁగినసీతోరణ మొ
నర్చుటకే నాకు సిగ్గగుచున్నది_ కాని రణసత్త్రము ముగియుమింజేసి చంపఁదగి
న వాఁడవైతివి_

చ. "అవని సమస్త మేలుకొనుమయ్యా! రణంబిఁక నే నొనర్ప మా
నివరులతో నరణ్యమున నిత్యసుఖాప్తి నెయిం జరింతు న
య్య విడువు"మంచు వేఁడఁగ దయామతి నీపయి రాక పోయె ధ
ర్మవిభునకే దురాత్మ! పవమానతనూజున కింకవచ్చునే.

దుర్యో—ఓఁయూవాచాల! వృథాన్యార్థసంభావక! పాండుకుమార! (నాలుక కఱచు
కొని) కాదు కాదు, వాయుకుమార!

ఉ. ఎందఱు రాజు లీధరణి యేలఁగ రోసి పరిత్యజించి మా
నీందుగ్రిలతోడిచెల్మి కయి యేగిరి కానల; కెల్ల సౌఖ్యము
లొందినవాఁడ నాఁటఁ బరలోక సుఖంబున కంటెఁగాక మి
కుం దిట వేద యంటె ననుకొంటివె మూర్ఖకులావతంసమా!

బల—ఓభీమదుర్యోధనులార! మీకుంబరస్పరజుగుప్సావచనంబులతోఁ బని లేదు_ ఈ
ప్రదేశము శమంతపంచకములోనిది కాదు_ కావున స్వర్గాపవర్గప్రదంబును పా
వనంబును నగుపొలికలనికిం బోదము రండు మీయుద్ధముగూడ నయ్యెడనే య
గుట ప్రశంసనీయము.

(నిష్క్రమింతురు)

గద్య

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరు లొనర్చిన పాండవ
విజయమునందు సప్తమాంకము.



శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవ విజయము.

## అష్టమాంకము.

(పాండవచతుష్టయమును కృష్ణబలరాములును ప్రవేశింతురు)

నకు—సహదేవా! యీదెబ్బతో దుర్యోధనునితల చెక్కలుగాక పోదు. చూడుమా మనభీముని చూపునందలి యుదుపు.

క. బరిమీఁది యారగ నొదుపుగఁ, గలచుటకుం దిరుగుకరణిఁ గౌరవనాథ
స్ఫురదురుగదాహతులకుం, దొరకక తగుసమయముం గనుంగొనుచుండెన్.

సహ—అగ్రజా! అరరే! ఆదుర్యోధనుఁ డాదెబ్బ నెంతసులువుగాఁ దప్పించుకొనెనో చూచితివా?

గీ. తద్గదాఘాతముల కోర్చి తగినసందు, వేచి గుటిచేసి తలమీఁదవిసరినట్టి
యన్నగారిపవింబోలు నన్నగారి, గదకు గుటియయ్యెనకట సైకతతలంబు.

అర్జు—కృష్ణా! ఈకురురాజు శరీరలాఘవంబున నెక్కలున్న పక్షివలె నెంతదూర మెగురుచున్నాఁడో చూడుము.

ఉ. గాలిపటంబు లీలదివిఁ గన్పడు నొక్కొకమాఱు నెక్కలం
గ్రాలుధరాధరేంద్రము పక్రారముగాఁ దనరారు నొక్కెడం
దూలక నిల్చు నొక్కపరి దూలము గాలికిఁ దూగులీలగాఁ
దూలు మఱొక్కపారి గద దూలముపోలికఁ గేల నొప్పఁగన్.

కృష్ణ—అర్జునా! నేనేమంటిని! వీనింగడ తేర్చుట కొక్కయుపాయము కలదుగాని ప్రళయకాలరుద్రుం డగు నేమోయని మదగ్రజుంజూచి వెనుదీయుచుంటిని.

ఉ. పాములవానిచేఁ బడిన పన్నగమట్లు కరంబు డస్సెన
య్యో! మనభీమసేనుఁ గనుమోయి కపిధ్వజ! దీనతాస్పదం
బై మదహీనమైన నొగ మంతట నల్లవడెం బ్రిమర్దనో
ద్దామము లైనబాహులు మదంబఱి వ్రేలఁగఁ గొచ్చెదుర్ గటా!

అర్జు—(ఆత్రముతో) ఈపారి గదాఘాతములో మనప్రయత్నము లన్నియు విఫలంబు లగుచున్నవని తోఁచుచున్న దేమిగతి!

చ. అనృతములాడి ద్రోణుని గతాసునిఁ జేయుటకన్నఁ బాడి మా
లినపని యున్నదయ్య! యవలీల నొనర్చితి మట్టికార్య మా
వెనుక హలాయుధు న్నతులు వెట్టి ప్రసన్నునిఁ జేసికొంద మీ
యన పడకుండఁగాఁగల దుపాయ మటంటివి తెల్పు మయ్యతా.

కృష్ణ—లెస్సపలుకు పలికితివి.

మ. “విఱుగన్ గొట్టెద నూరుయుగ్మ”మని యున్ వీరుండు మీయన్న కో
పరసావిష్టుఁడు ఎల్కె నాభికి నధఃప్రాంతమ్మునన్ గొట్టు టొ
ప్పరు తామెందు గదారణజ్ఞు; లిపుడీ పాపాత్ముఁడాయాగతిన్
బోరిగోకన్న నితండ మీకనుఁడుగాఁబోవున్ ధ్రువంబర్జునా!

అర్జు—(భీమునికిఁగనుపడునట్లు తనతొడపై జరచుకొనును)

బల—(లేచి కోపముతో) ఓరీ! పాపాత్మా! వృకోదర! బలరాముఁడున్నాఁడనియైన భయంబులేక గదారణంబున నాభిక్రిందఁ గొట్టఁగూడదని యెఱింగియుఁ దొడలమీఁదఁ గొట్టితివేమిరా! నిలువు నిలువుము! ఈముసలంబునకు నీతల బలి యొసంగెదను. (భీమునిమీదికి పోఁబోవును)

కృష్ణ—(అన్నను బట్టుకొని) అన్నయ్యా! ఏమిది పెట్టికోపము! ఆదెబ్బతొడల మీఁదఁదగిలెనో నడుముపైఁ దగిలెనో చూడకుండఁ గోపించెప వేల?

బల—నడుము మీఁదనా? గదావిక్షేప మెఱుఁగనివానికి బోధించినట్లు బోధించుచుంటివి? అయినను జూలిము పద. (అందరును బరిక్రమింతురు)

(తెరనెత్తుదురు; తొడలు విరిగిన దుర్యోధనుఁడు కన్పట్టును)

బల—(సమీపించి) కౌరవేంద్ర! కాళ్ళేఁది నిలఁవుము?

దుర్యో—(పగరుచుచుఁదొడలు చూపించి మూర్ఛపోవును)

బల—కృష్ణా! దీని కేమందువు? (పరికించి) ఆదురాత్ముఁడేఁడి, కానరాఁడు?

భీము—(సంరంభముతోఁ బ్రవేశించి) ఓరిదురాత్మ! కౌరవజఘన్య!

శా. “కాతర్యంబు వహించె దాసీ పశువా! కానిమ్మిఁకొక్కండు నీ
పాతివ్రత్యము పోవునే” యని సభం బాంచాలి నన్నట్టినీ
బూతుంగూఁతల కీఫలంబు గలిగెంబో! యిద్ది మాధర్మభూ
నేతం బెట్టిన పాట్లకున్ ఫలము కానీ పాపదుర్యోధనా!

(ఎడమకాలితోఁ గిరీటముఁ దన్నును)

ధర్మ—ఆ! ఆ! భీమసేన! ఎంత తెలివిమాలినపని గావించితివి! ఉడుగు ముడుగుము

బల—(మండిపడి) కృష్ణా! ఇంకను నీనీచుకొట్టు క్షమింతును?

చ. కసిగలజేని బాహుబలగర్వముచేఁ గురురాజు వాజిలోఁ
గసిమసగింతు? గాక కొంటుగాక గదారణమందుఁ బాడి లే
క సముఖమం దొకండు శఠకార్య మొనర్చినఁ జూచి రాముఁ డీ
ముసలము చేత వానితల ముక్కలు చేయక యూరకుండునే.

కృష్ణ—అగ్రజా! దీన భీమునియందుఁ దప్పేమి? బంధుత్వ మటుంచుము- ద్రౌపదియు
క సామాన్యవనితయే యనుకొందము-

గీ. నిండుఁగొల్వున దుశ్శాసనుండు, వలువ, లొల్వఁగాఁ జూచి నీవూరకొందువోటు
కురువు మాపంపవచ్చునే! కూరుచుండు, మనుచుఁగులకాంతకీసుయోధనుఁడు చెపుమ

నాఁడు ధర్మజునికి బద్ధం బగు భీమమత్తగజంబు కదలలేక, "ఓరీ! దురాత్మ! రణంబు
న నిన్నుఁ దొడలు విఱుగ నడచెద" నని వాచాకూరత్వముమాత్రము చూపించె
ను- నేఁడది నెఱవేర్చికొనెను-

బల—తొడలు విఱుఁగఁగొట్టుట యొకతప్పు- దాని నటుంచుము- తలదన్నుటయెంత
నీచపుఁబని- దానికేమందువు?

కృష్ణ—ఇది తప్పిదమే కావచ్చునుగాని యిదియును నతనిప్రతిజ్ఞలోనిదియైయుండ
నోపు- కాకపోవుఁగాక- ఈతఁడొనర్చినదోసఁగులలో నిది కొత్తాంశమును గాదు
గదా! అదిగాక ఇదికలియుగము ధర్మము నాలుగుపాదముల నడచునా! శాం
తించి యనుగ్రహింపుము-

బల—కృష్ణా! కురురాజుమాత్రము ధర్మశీలుఁడంటివా! మీరొనర్చిన యధర్మము లె
న్నియో వారొనర్చిన తప్పు లెన్నియో నేను జూచితిని! (ధర్మజుదిక్కు) ధ
ర్మరాజ! పోవువాని నన్నాపి యీయాటుధర్మముఁ జూపించితివిగదా?

ఉ. "కౌరవనాథునుం దొడలు గాఁడఁగ నేసి శిరంబు దన్ని న
మ్మారుతి మధ్యవర్తి యగుమాబలరాముఁడు చూచుచుండఁగా
నౌర?" యటంచు ధర్మనిధులందఱు దూఱఁగ నెల్లకాల మీ
దారుణ దుర్యశముఁ దాలిచి నేఁదలయెత్త నేర్తునే.

కృష్ణ—సహోదరా! ఇందు దుర్యశ మేమున్నదో? మేనత్తకొడుకుల కుపకారము చేసె
నందురు-

బల—చాలుఁజాలు కపటోపాయములకు మూలకందమై నీవు చేయుచుంటివి చాలదా? ఇందు బలరాముఁడు కూడఁ గలియవలెనా? (విచారముతో) హా! ధర్యోధన!

గీ. ఎన్ని దుష్కపటంబులు పన్ని నీదు, బలముఁబరిమార్చిరో కదా పాండుసుతులు,
దైవవిధి యెవరికైనను దప్పదిప్పు, డెదుటనుండియు బలరాముఁ డేమిచేసె.

(కోపముతో) ఛీ! యీపాపాత్ముల మొగముఁ జూడరాదు- పాపవృకోదర! నిన్నీ ముసలమునకు బలియిచ్చి న్యాయప్రతిష్ఠ తీర్చుకోవలయును-

భీమ—క. గడబిడ యేటికి నీవడ, నుడికింగద లేదా? నీకు ముసలమ్మున్నఁ గా
"నొడలని లోపల విఱుగం, బొడిచెద" నని నుడివి రిత్త వోదువె ముసలీ.

బల—ఏమీ! నాకు ముసల మున్న నీకు గదకలదా! నిలువు నిలువుము నాముసలితనముఁ జూపించెదను- (మీఁదికురుకఁబోఁగా)

కృష్ణు—(ఆఁపి యర్జునునితో జనాంతికము) ఫల్గునా! ఈభీముఁ డూరకున్న వానిమరలఁ గదిపె- ఈబలరాముముసలాఘాతమున కితఁ డెంతవాఁడు? (జనాంతికముగ) భీమసేనా! శాంతింపఁగదోయి, మీయన్నగారి శాంతమునకును నీకోపమునకు బ్రతుకలేకున్నారము-

ఆ. మొదటఁ బోవువానిపదముల కర్ఘ్యపా, ద్యమ్ములిచ్చి నిలిపె ధర్మరాజు
నేఁడు పోవువాని నిటలభ్రుకుటిచేత, నిల్పఁదలఁతు వౌర! నీలచేల.

బల—(కోపావేశముతో) మంచిమాట చెప్పితివి- అవును మీపంగతి గుఱుతెఱుఁగక యీపాపపుసభలో నిల్చుట నాదే తప్పు- (నిష్క్రమించును)

దుర్యో—(మూర్ఛ తెలిసి) హా బలదేవ! నీ వుండియు నిట్టియన్యాయమున గొడిగట్టితివా? నీతమ్ముని మాయమాటలకు లోఁబడితివా!

గీ. మధ్యవర్తి విరణధర్మమయుఁడవీవు, కలవనుచుఁ గాక నేమూర్ఖకాయమునకుఁ
గాపుదల చేసికొనియుధకాయమునకుఁ, జేసికోలేని యకట! వంచితుఁడనైతి.

భీము—(కోపముతో మరల దుర్యోధనునితల దన్నఁబోఁగా)

ధర్మ—(వారించి విచారముతో)

గీ. మంచియో చెడ్డయో పదిమందిచేత, మెచ్చుగాంచునో లేదో భవచ్చరిత్ర
మించిపోయెఁ బ్రతిజ్ఞ చెల్లించుకొంటి, విట్టియాగడమ్ములని యేల యిపుడు.

మ. ఇతరప్రాణి కలభ్యమైనసిరిచే నేకాదశాక్షౌహిణీ
పతినై సర్వవిధంబులం జెడి దురాపంబైన దైన్యంబుచే

సతిశోచ్యత్వముఁ జెందఁగాక మన దాయాదుఁడు నీవింత హీ
నతగాఁ జూతువె! రాజరాజితవిఁ దన్నఁగ బాడియే మౌళిపై.

గీ. కాలమును గర్మమును రెండుఁ గలిసి యిటులు, దైవవిధిచేత మనకు నింతలు జరించె
కాని నీ కీతఁ డెవ్వఁడు? కలఁడె నాకు, నీతనికి భేద మావంతయేని భీమ!

భీము—(శాంతించి) ధర్మనందన! ఈదురాత్ము నేమిచేసినను బాపములేదు- కలదుగాక నరకమునకే పోవుదును- ఓపంచభూతములారా! ఓసూర్యచంద్రులారా!

ఉ. పర్యాద లాగె నేచెనఁటి "బంధకినీ" యని సాధ్వి నేఖిలుం
డొయ్యన సన్న చేసెఁ దన యూరువులందు వసింపు మంచు నే
నిర్యాడ నానిఁ గూలిచి మదీప్సితము న్నెఱవేర్చుకొంటి న
న్యాయ్యము న్యాయ్యమో నరక మైనను నా కది స్వర్గలోకమే

ధర్మ—(దుర్యోధనుని సమీపించి కౌఁగిలించుకొని)

గీ. నేఁడు భీముఁడు చేసిననింద్యకర్మ, మును సహింపఁగదన్న! తప్పులు క్షమింపు
మన్న! మది సిగ్గుఁ జెందకుమన్న! పూర్వ, కృతముఁ దప్పింపఁ జేయఁగా నేరితరము.

క. ఏలా వగచెద వకటా!, నీలోభము నీమదంబు నీచిన్నతనం
బీలాగు పరిణమించెను, గాలముఁ గర్మంబుఁ గడవఁగలరే మనుజుల్.

అర్జు—దుర్యోధనా! విచారింపకుము- తత్త్వ మరసిన నీవే సుకృతివి-

ఉ. బంధుగు లెవ్వరుం దినవిభాగ్యము భాగ్యమె! ధర్మహీనులై
కుందుచు ఘోరశత్రులును గొల్లు మనం గనుఁగొంచు దూఱఁగాఁ
గొంచెమందుచుం గెలుచుకొన్న ధరానరకంబుకంటె ని
ర్ణిందితసౌఖ్యరాశి యగు నిర్జరలోకము మేలుగాదొకో!

కృష్ణ—ధర్మజార్జునులారా! ఎందుల కీయప్రస్తుతనిర్వేదము?

ఉ. కోరి సమస్తముం గెలుచుకొంటిరి బంధుగులెల్లఁ జావ కే
పోరును లేక చత్తురె రిపుల్! దనుదెంచునె రాజ్యలక్ష్మి మీ
కోరినరీతి! ధైర్యమెసఁ గూర్పుఁడు నేఁటికిఁ దీఱిపోయె మీ
వేరము; లేమపు ల్పొవలు పెట్టితి రక్కట! నవ్వువేళలన్.

దుర్యో—(కృష్ణునివంకఁ [illegible] జూచుచు)

క. పాపము చేసియుఁ బొర్చు, త్తాపంపడు పాండవుల నదల్చుచు నీ వో
పాపాత్మ! యేలొకో సం, తాపము చెందెదవు కంసదాసకుమారా

నీవు పాపపుబండితో లాటయు విజయుఁడు తొడమీఁదఁ జఱచుకొంటయు నేను జూడక పోలేదు.

మ. ఎటులైనన్ ధర ధర్మపుత్త్రునిచే నేలింపఁగానుంటి మ
త్పటుశక్తిం బవమానసూనుఁడు గతప్రాణుండు గాని భవ
త్కుటిలత్వంబు న మాయయున్ దెలిసె నో గోవింద! కీల్బొమ్మ లీ
వెటు లాడించిన నట్టు లాడుదురు గాదే పార్థు లీయేవురున్.

లజ్జాపరిత్యాగముఁ గావించిన వన్నె కాదు. ముల్లోకములు జయింపవచ్చును. శిఖండి నెదుటఁ బెట్టుకొని పితామహుని జంపించితివి. "చక్రంబుఁ దాల్ప" నని ప్రతిన పట్టియుఁ జేపట్టితివి. ధర్మరాజుచే నసత్యమాడించి కుంభసంభవుం బరిమార్చితివి. సిగ్గుమాలి పార్థుండు శపకంతము సంకుచుండ సవారింపలేకపోయితివి. సూర ముఁనుంచి భూరిశ్రవస్సుచేయి నఱికించితివి. కర్ణునిఁ జంప ధర్మభీతిచే వినుదీయు నర్జునునకు దురుపదేశం బొనర్చి పాపము గట్టికొంటివి. తుట్టతుదకొంటరినైన నన్నుఁగూడ ఋజుమార్గంబునఁ జంపింపలేకపోతివి. ఛీ! సిగ్గులేక తగవులాడ వచ్చితివి. నీయితివృత్తం బెవ్వ రెఱుఁగరు?

కృష్ణ—దుర్యోధన! నీక క్తికాలఁది దుష్కృత్యములు నీవును జేసితివి.

క. నీకర్మంబున కెవ రో, యీకర్తలు! వాసుదేవుఁ డెవ్వఁ డొనర్పన్
బాకారికైనఁ బాపం, బాకారమునం గులక్షయం బొనరించున్.

భీమునకు విషము పెట్టించి, పాములఁ గఱపించి, నీటఁద్రోయించితివి. కుమారులతోడఁ గుంతిని లక్కయింట గాల్పించితివి. పాంచాలరాజపుత్త్రికి సభలోఁ గట్టువలువ లొలిపించితివి. చేఁత గాని ధర్మరాజునకును మాయాద్యూతవిశారదుం డగు నీ మేనమామకును దురోదరంబుఁ గల్పించితివి. నీపాపమంఁదిచే వనంబున ద్రౌపది ని బరాభవింపఁ జేసితివి. నన్నుం గట్ట నుంకించితివి. పదిమందిరథికుల నొక్క బాలునిమీఁదికిఁ బురికొల్పి చంపితివి.

క. దుండగములు నాకెఱిఁగెను, రెండింటలు గలవు హెచ్చరించిన విను మెం
దుండును ధర్మము జయ మం, దుండునదుచు నెవ్వ రెఱుఁగ రోయిదురాత్మా!

దుర్యో—గోపాలా! యిది ధర్మమునకుఁ గాలము గాదు. కలికాలము వచ్చినది. కపటోపాయ లేనివారికి జయము లేదనుము. ఇది వినుము.

సీ. చదివినాఁడను వేదశాస్త్రంబు లర్థుల కిచ్చినాఁడను మనోభీప్సితమ్ము
లేలినాఁడను భూమి యేకాతపత్రంబు ప్రజలను సంతోషపఱచినాఁడఁ
జలిపినాఁడను పెక్కుజన్నము లృత్విజులఁగాంచితిఁ బున్నరకంబు వాయ
మెచ్చించినాఁడ సుమిత్రుల నార్జించి పొందినాఁడను సర్వభోగములను
క్షత్రియులచేత మిగులఁ బొగడ్తగన్న, కదనమరణంబుఁగంటి నాకంటె భాగ్య
శాలిసుకృతివదాన్యుండు చతురమతియుఁ, బండితుం డెవ్వఁడేమిలోపంబు నాకు

గీ. బంధుగులులేక సైన్యసంపదలులేక, సంతసములేక తగినవంశంబులేక
బహుళదుఃఖాకరం బగు పాడునేల, యీయుధిష్ఠిరు చేత మోయింపుమయ్య.

(తెరలోఁగోలాహలము, దివినుండి పుష్పవర్షము గురియును)

ధర్మ—(దిగ్భ్రాంతితోఁ దనలో) ఔరా! ఈసురలీతని పలుకకెట్లు పొగడుచున్నారో!
(తలపంకించి) ఔను ఇతఁడు మనయెడల నెట్టివాఁడైనను రాజ్యపాలనాదుల
యందెందును దుర్మార్గుఁ డనిపించుకొన్నవాఁడు కాఁడు (యోజించి)

ఉ. అమ్ములపాన్పుమీఁదఁ దనకుం తన చావుఁదలంచి మాఘమా
సమ్మును గోరి తాత దివసంబులు లెక్కిడుకొంచు నున్నవాఁ
"డెమ్మెయి రాజరాజును జయించితి వీ" వన నెట్టులీయుధ
ర్మమ్ము వచింతు, వృద్ధకురురాజు నిఁకేగతి నూఱడించెదన్.

చ. మడపిరి బంధుజాలము సమస్తము; రాజ్యముఁ బ్రోవఁజాలు నే
రాడు కనుకొంటిమా యతఁడుఁ గూలెను ముండితమూర్ధుడైన యీ
ప్రుడమిఁ బునర్భవు న్వయసుపోషిమి నాయిన నేను సంతసం
పడుమఁబరిగ్రహించుటకుఁ బాల్పడఁ జేసెను దైవ మక్కటా!

కృష్ణ—ఉ. ఇంటికిఁబోద మేల పదునెన్మిదినాళ్ళుగతించె వీరికిం
గంటికి నిద్రలేదు దుదయాలకు దాఁకను బోదు ప్రాణ మీ
తుంటరి; కొంతసే పితనితో శవజాగరణంబు, రెండు మీ
బంటులు మీరు చేతు లెదపైనిడి స్వస్థత విశ్రమింపఁగన్.

ధర్మ—మంచిది (అందఱితోఁబరిక్రమించి) బావా! వసుదేవనందన!

క. పరమపవిత్ర గాంధా, రరాజనృపప్రతి మదిఁ గరంబును శోకం
బారని మనల శపియించెనేఁ, గురురాజా నధర్మరీతిఁ గూల్చితిమనుచున్.

కృష్ణ—ఆమెను మీ పెద్దతండ్రినిం గూడ నే నిప్పుడ చని తగువిధంబున నోదార్చి శాంతులం జేసి వచ్చెదను. రండు పోదము (నిష్క్రమింతురు)

(తెరలో మంట కన్పట్టును)

దుర్యో—(తెరపై నంజూచి తనలో) ఏమో అర్జునునితేరట్లు మండుచున్నది. పట్టి తేరు మండిన నేమిలాభము (ప్రకాశముగా) ఎవరురా? అక్కడ (యోజించి) ఛీ! మూఢదుర్యోధన! ఇంకను నీవుపిల్చినం బలుకువారెవరు?

సంజ—(దుఃఖముతోఁ బ్రవేశించి) దేవా! నేను సంజయుఁడను. నేనిక్కడనే కనిపెట్టుకొని యున్నవాఁడను.

దుర్యో—(కౌఁగలించుకొని కన్నీటితో) సంజయా! పాండవులొనర్చిన యధర్మము ను గన్నులారఁ గాంచితివిగదా! గురుపుత్రునితో నిదియెల్లఁ జెప్పి—

క. కడసారి తల్లిదండ్రుల, యడుగులకున్ నా నమస్కార మంజలి యిడి వా
రిడలేక యుండు నుపాయము, కడువడిఁ గరిపురికి నరిగి గావింపు మిఁకన్.

సంజ—ఇట్టిస్థితిలో నిన్నొంటిగ విడిచి యరుగ నాకెట్లు శక్యమగును.

దుర్యో—ఇంతకన్న నాకు నిప్పుడు కావలసినప్రయోజనము వేఱొండులేదు పొమ్ము. (నిరూపించి) నాకై శోకించుచుఁ బౌరులెల్ల నిటవచ్చుచున్నారు. వారి నోదార్చి పురంబున కంపుము (సంజయుఁడు కన్నీటితో నిష్క్రమించును.

దుర్యో—(తెరవంకఁ దిరిగి

ఆ. వె. పౌరులార! వగవఁ బనిలేదు నాకునై, యనుఁడు ధర్మజాతు శరణమునఁడు
యశము నాది వార లన్యాయపరులై, యపయశంబుఁగొనిరి హరికతమున.

(దెసలుపరికించి తనలో) హా! దైవమా! క్రూరసత్వభయంకరం బగు నిమ్మహారణ్యంబున నన్నీ రాత్రి యెట్లుగడపింతువు! ప్రాణవాయువులారా! గంపంతబలంగను వదలిపోయినను భగ్నోరువగు నీశరీరమును వదలలేకున్నారా! హా! సర్వలోకబాంధవా! అందఱుబంధువులవలె నీవుఁగూడ నాపైదయ విడచి చనెదవా! నీపోవుట న్యాయముగాదు. ఇప్పుడు మనమిరువురము సమాన తేజోబలశాంతులు కలవారము. తుల్యవ్యసనులము.

శా. మందేహాభిధరాక్షసక్షతజరమ్యంబయ్యెనీమేను; నా
కుంద్రప్రాగిగదాప్రహారజనితక్రూరాహతిన్ రక్తము

యొగ్యంగేహంబు; విపత్సముద్రమున నుండె మున్గితి న్నేను; ము
న్గందా పైతివి నీవు; తుల్యులము కానక దేవ! నీవాఁగుమా.

కటకటా! భాస్కరదేవ! నారోదన మరణ్యరోదనము చేయుచున్నావా! నీకు నేనే
మిఱుగ్గఁ గావించితిని. (యోజించి) అవును!

ఉ. "పాండవులందు నాకుఁగడుఁ బక్షము ధర్మతనూభవుండు మ
న్నుండవుటన్ ద్వదీయమరణంబు హితంబ" యటంచు లోకబం
ధుండవు నీవు నాకభిమతుండవు గాకపు డేగుచుంటె! మి
త్రుండవు కష్టవేళ నసిరో! యిటుదోడ్పడకుంట పాడియే.

కొండొక కాల మస్తమింపకుము ఇంతలో సారథికత్రయము వచ్చి నామనోరథముఁ
దీర్పఁగలదేమో? (ఆలోచించి) మూఢబుద్ధీ! దుర్యోధన! గురుపరాభవాభిభూ
తుండవై నీవిట్లనుచుంటివే కాని సూర్యచంద్రులగతి యాఁగునా! (బిగ్గఱగా)
హా అశ్వత్థామ! ఏను గతప్రాణుండనైనను నీవనినప్రతినమాత్రము చెల్లింపవల
యును జుమా! (మూర్ఛిల్లును) (రథికత్రయము ప్రవేశించును)

అశ్వ—(కన్నీటితో సమీపించి) హా! దుర్యోధనమహారాజ!

క. నిన్ను నధర్మప్రయుద్ధము, నన్నీతనికిఁ దొరఁగి యిట్లొనర్చిరనెడి వా
ర్తన్నేను వింటి వచ్చితిఁ, జన్నేయిఁక మిన్నకుంట శక్తుఁడనయ్యున్.

దుర్యో—(మూర్ఛ తెలిసి)

చ. గురుతనయుండ! నిన్నుఁగనఁగో నసువుల్బిగఁబట్టియుంటి స
త్వరముగ రాఁగదయ్య! బలవత్తరమైనవిధిం దరింప నె
వ్వరితరమీ ప్రకారపునవస్థకు లోనయితిం దురాత్ము లా
మురహరభీమఫల్గునులమూలమున న్విపినంబు లోపలన్.

(కౌఁగిలించుకొను)

క. నుదుల నుడికించి నన్నుం, గ్రదలించిరి నీటనుండి వెడలించినన్
జడుపేమి గదారణమునఁ, దొడలు విఱుగఁగొట్టి రకట! దుర్నీతిమెయిన్.

అశ్వ—(కోపముతోఁ దలపంకించి) ఏమీ దురాత్ములగుపాండవు లిట్లొంటివానిం జేసి
నిన్ను భంగపఱచిరా! చూడు నేఁడు నీమనోరథము దీర్చి భానుమతీదేవితో
ద్రౌపదింగూడ సమాన దుఃఖభాజనంగావించెద. దైవానుగ్రహమున నంతదను

క నీప్రాణములు నిలిచెనేని మరల వచ్చి నీకావృత్తాంతము ను వినిపించెదను, స్నభిషేకించి యనుపుము.

కృపా—(జనాంతికము) అబ్బాయీ! అడుసుద్రొక్కనేల కాలుగడుగనేల? భవదీయవిజృంభణంబు పాండవుల కపకారము గావచ్చుఁగాని యీసుయోధనునకు మాత్ర ముపకారంబు గానేరదు కావున నీ దుర్వ్యవసాయ ముడుగుము. వంశచ్ఛేదము చేయరాదు సుమీ!

అశ్వ—మామా! అటులేనిం బితృద్వేషి యగుపాంచాలపశువును జంపకుండుమనెదవా? పాండవవంశచ్ఛేదము నేఁడు నేఁటుగఁ జేయ నక్కరలేదు

మ. జగదాచార్యుఁడు శస్త్రము ల్విడిచి స్వస్థుం బ్రాణబంధంబు వా
యఁగ మద్భాగ్యుఁడు గత్తి చేకొని తదీయుగ్రీవ నగ్లజ్జతోఁ
దెగఁగోయం గని రెప్పుడో యపుడె పో! నిర్మూలితం బయ్యె; నా
పగ సాధింప నిమిత్తమాత్ర! మిపు డశ్వత్థామ కారద్వితా.

అదియునుఁగాక పాండవులు నాకు సుయోధనామిత్రులగుటచే శత్రువు లనుకొంటివేమో! కాదుకాదు గురుద్వేషియగుపార్షతుని చేతులు నఱికిపకపోవుట చేతఁజుమీ

మ. అకటా! పాపముండి యంచుఁ ద్రిజగత్త్వాచార్యుఁ డౌ నొజ్జను
న్నికృతిం జేసిన నీచుఁ గాతురోకో! యంతేవాసులే పాండుపు
త్రకు! లీరీతి బరాభవంబు తనయుంతం జావఁగా నున్న తా
తకుఁ జేయింతురె గొంతుకోఁత! పరమాశ్చ్రోహు లోహూతులా.

ఛీ! వారిమాట తలంపకుము తండ్రికిని గురువునకును భేదమున్నదా! (ఆలోచించి) కాలచేరులకుఁ దండ్రి నొడలఁ గౌరవ మనట్టిది? భూమియందొంద జెందట్లో రాజులుండ వైధవేయుల నాశ్రయించినగురువ కిట్టియవమానము వచ్చుట యబ్బరము గాదు (శిగ్గఱగా)

గీ కర్ణుడెపుఁ జేర్చిఁజూపిన కారవేంద్రు, పట్టుదల యీప్రకారము పండెఁగాక
జాఁగను కాదోకో! ద్రాణి సేనానియే న, వని యపాంచాలయాదవ పాండవంబు.

దుర్యో—ఆచార్యనందవ! నాయపరాధము లన్నియు సహింపుము.

ఉ. శాంతనవుండు పోరుదివసంబులఁ గర్ణుఁడు లేమి దా నతం
డంతముఁ జెందుదాఁక సమరావని కీ వొకభంగి యాట నిం

గీ. తనయులను నూర్వుర ధురంధురులఁ గనియు, బాపమతియగు నొక్క సాహస
మున లీతనమునఁ బగయించి భాజనంబు, విధవయగుఁ గురు దిక్కులేట విధి లిఖించె.

ఓ నిద్రాదేవీ! నీకైన నాపై దయ లేకపోయెనా! (కన్నులు మూసికొని శబ్దమాలించి) రథ
ధ్వనివలె నున్నదే! రథికత్రయము వచ్చుచున్నదేమో! (ఆకాశమువంకఁ జూచి)
రాత్రి యామమాత్రావశిష్టము కావచ్చినది.

క. పలపలని వెన్నెలలు డిగ, ముక్కలకుఁ బర్వంగ బజ్రిమండలశోభా
కలితమయి చంద్రబింబము, చెలఁగెఁ బ్రాచీపురంధ్రి చెవికొనయందున్.

అశ్వ—(కృపకృతవర్మలతోఁ బ్రవేశించి) ఓ మహారాజ! బ్రతికియుంటివా లేదా!

క. మామయుఁ గృతవర్మయుఁ దో, డై మది తుల్లాసపఱుప నరుల నడఁచి నీ
కామాట దెలుప నశ్వ, త్థామ దరికి వచ్చె ద్రోణతనయుఁ డెఱుఁగుదె!

పాఱిపోయిన పాండవపంచకంబును నీతమ్ముఁడు యుయుత్సుండును గృష్ణసాత్యకులును
దప్పఁ దక్కిన బలమంతయును నామావశిష్టము గావించితిని-

దుర్యో—(విని యల్పస్వరముతో) గురునందనా! యీవైపునకు రమ్ము-

గీ. నిన్ను ముదమునఁ గనుఁగొని నీ మొగంబు, గాన పాండవమును విని మేను వాయఁ
బ్రాణములు నిల్పుకొంటి నో ద్రోణతనయ, యిప్టు కడసారి యాశ్లేషణమ్ము నాకు.

అశ్వ—(సమీపించి) మహారాజా! నీపరివారమునందెల్ల మేమే విశ్వాసహీనులము-

గీ. అందఱాత్మీయులను మును ముందఁ బంపి, కదలుచున్నావు స్వర్గలోకమునకీవు
లేక పోయెను నీతోడి లోకమునకు, మాకుఁ జనుటెంచు పుణ్యమో మానవేంద్ర!

ఉ. “నీకు విరోధియైన జననింద్యచరిత్రునిఁ జంపెఁ బార్థుఁ డే
నీకాడు” కంచుఁ దెల్పు మవనీధవ! ద్రోణునితోడఁ; బాండవా
నీకము నెల్ల నేఁడు స్మరణీయముగా నొనరించె నంచు స్వ
ర్లోకమునందు దేవతలలోపల నీయశ ముగ్గడింపఁగన్.

కృత—మహారాజా! ఇది పరాజయమని తలంపక దేవేంద్రునిఁ బోలి స్వర్గమేలుము

గీ. పాండవులకోడి నీవు ద్వైపాయనహ్రదమున డాఁగితివనుట కా దపయశంబు
ద్రోణపుత్రుని కోడి వారును బలాయమానులైరి కదా! యభిమాన ముడిగి.

కృపా—కౌరవేశ్వరా! నీవు వారికంటె సర్వవిధంబుల సుకృతాత్ముఁడవు-

గీ. బాంధవులతోడ సకలసంపదలతోడఁ, ద్రిదివమున కేగుదువు జగ్వదితకీర్తి
మా లేక తగినసంపదలు లేక, వారు జీవచ్ఛవంబులై నారు నేఁడు.

ధ్రు—ఆచార్యా! సత్యము వచించితివి (అశ్వత్థామనుద్దేశించి పరమప్రీతితో)

ఉ. ఎంతపరాక్రమంబు వహియించితి? వింతటిసంతసంబు గ
ల్గింతువటంచు నే నెఱుఁగ లేఖవిభుల్ దలఁదాటి వాఁడ నే
డెంతపనిన్ బొనర్చిరె మహాసురపుత్త్ర! గురుండుఁ గర్ణుఁడున్
శాంతనవుండు శల్యుఁడును; సఖ్యపు మేరను దప్పితిమ్మియిన్.

మీముగురికన్న నాకొండొరు ఉపకారులు లేరు. ఎన్నటికైన మరల మీదర్శనంబు త్రిదివంబున నగుఁగాక. నాకై విచారింపకుఁడు. సర్వమనోరథములనుభవించిన నాకేకోరికయును లేదు.

కృపా—ఇంతదనుక మధ్యమలోక దేవేంద్రుఁడవై యిఁకఁ బరలోక సౌఖ్యసామ్రాజ్యపట్టాభిషేకమునంద నున్ననీకుఁ గావలసినదేమియును లేదు. అయిన నిట్లగుఁగాక.

## భరతవాక్యము.

చ. ఇల భరియింతురిగాక ధరణీంద్రులు నీవలెఁ, గాని యాన లేం
డ్రులకు సతీపరాభవము ద్యూతము లాడుట పిన్నతండ్రిపు
త్రులకు ధరాంశ మీక వితచొమ్ము రయినర్పుట లేక పోవుఁగా
కలిమి రచింతురిగాక సుకవీశ్వరు లీకథఁ జెక్కు కావ్యముల్.

(అందరు నిష్క్రమించుచున్నారు)

గద్య

ఇది శ్రీశంకరీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వరులచే రచి
యింపఁబడిన పాండవవిజయమున సర్వంబును
అష్టమాంకము.



